## నవ్యవీక్లి-తురగా ఫౌండేషన్ సంయుక్త నిర్వహణలో



### తురగా జానకీరాణి కథల పోటీ

| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. | 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. | 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. | 7,000 |
| 5 విశేష బహుమతులు కథ ఒక్కింటికి | : రూ. | 5,000 |

### తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీ



| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : రూ. | 10,000 |
| ద్వితీయ బహుమతి | : రూ. | 8,000 |
| తృతీయ బహుమతి | : రూ. | 7,000 |
| 5 విశేష బహుమతులు కథ ఒక్కింటికి | : రూ. | 5,000 |

### కథ/హాస్యకథ: నిబంధనలు

- కథ తెలుగు వారి జీవితాన్ని ప్రతిబింబించేలా ఉండాలి.
- ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.
- కథలు అరటావు సైజులో 10 పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది 6 పేజీలకు మించరాదు.
- కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జతపరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మాగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద 'తురగా జానకీరాణి కథల పోటీకి' అని స్పష్టంగా పేర్కొనాలి. పోటీకి హాస్యకథ పంపుతున్నట్టయితే కవర్ మీద 'తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీకి' అని పేర్కొనాలి.
- విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ (navyaweekly@andhrajyothy)కి పంపగలరు.
- బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.
- పోటీ గడువు తేదీ పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లి' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.
- కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలు తిప్పి పంపడం సాధ్యం కాదు.

### కథలు పంపవలసిన చిరునామా

నవ్య వీక్లి
ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్
ప్లాట్ నెం. 76
రోడ్ నెం 70
అశ్వనీ లే అవుట్
హుడా హైట్స్
జూబ్లీహిల్స్
హైదరాబాద్-500033

## కథలు, హాస్యకథలు చేరవలసిన ఆఖరు తేది

# 30 జూన్ 2017



24

## ప్రాణాలు రక్షించే రహస్యం

భయంకరమైన ప్రమాదాల్లో మనల్ని మనం కాపాడుకోవడం, త్రుటిలో అప్రమత్తమై తప్పించుకోవడం, సహాయం లభించేవరకు మనోవిశ్వాసంతో బతకడం...వీటన్నింటినీ అదృష్టమనో, దైవలీల అనో అనుకుంటాం. కానీ ఆ శక్తి మనలోనే నిబిడీకృతమై ఉంటుందట! అదెలాగో తెలుసుకోండి.

**8**

### భ్రాతృదేవోభవ

అన్నదమ్ముల అనుబంధానికి ఆదర్శం రామలక్ష్మణులు. మమతానురాగాలకు నిలయమైన ఆ అనుబంధమే మనకు శ్రీరామరక్ష. మే 24వ తేదీ బ్రదర్స్ డే సందర్భంగా ఒక అవలోకనం.

**72**

### ఇంటర్వ్యూ

ప్రేమసాగరం డబ్బింగ్ చిత్రంతో తెలుగు తెరకు పరిచయమైన నటి నళిని. పలు భాషల్లో 200 చిత్రాల్లో నటించారు. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలంటున్న ఆమె ఇంటర్వ్యూ....

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: ప్రగ్యా జైస్వాల్
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### ఛీ

బాధగా ఉంది. భయంగా ఉంది. అయినా ఆఫీసు పని చేస్తూ కూర్చున్నాడతను. అంతలో ఫోన్ రింగైంది.

**అతను:** హలో

భార్య: ఏమండీ! ఏం చేస్తున్నారు?

**అతను:** భయంతో ఛస్తున్నాను, శవాలమధ్య పని చేస్తున్నాను.

భార్య: ఏమైందండీ?

**అతను:** లిఫ్ట్ కేబుల్స్ తెగిపోయాయి. కంట్రోల్ తప్పి, లిఫ్ట్ కూలిపోయింది. దాంతో ఆఫీసులో అందరూ చనిపోయారు.

భార్య: అవునా! మరి మీరెలా తప్పించుకున్నారు?

**అతను:** కడుపులో గందరగోళంగా ఉంటే టాయ్‌లెట్‌కి వెళ్ళాను. తిరిగొచ్చేసరికి జరగాల్సిందంతా జరిగిపోయింది. చనిపోయిన ప్రతివ్యక్తి కుటుంబానికి కోటిరూపాయలు ఇస్తోంది కంపెనీ.

భార్య: మీరూ, మీ కడుపులో గందరగోళం మండిపోను, మీరు అప్పుడే టాయ్‌లెట్‌కి వెళ్ళాలా? కాసేపు ఆగలేకపోయారా?

### తెలివి

ఆదివారం. భార్యాభర్తలిద్దరూ సరదాగా మాట్లాడుకుంటున్నారు. సుత్తిసుభద్ర వస్తూ కనిపించింది. ఆమె సుత్తి భరించడం కష్టం అనుకున్నాడు భర్త. భార్యతో అన్నాడిలా.

"ఇదిగో! సుభద్ర వస్తోంది. దాని సుత్తి నేను భరించలేను. నేను పైకెళ్ళిపోతాను, కాసేపు పోయిన తర్వాత కిందికి వస్తాను, ఓకే?" అని గబగబా మెట్లెక్కి పైకి వెళ్ళిపోయాడతను.

గంట గడిచింది.

కిందికి రాసాగాడతను. మెట్లు దిగుతూ పరిశీలనగా విన్నాడు. ఎలాంటి మాటలూ వినరావడం లేదు. అంటే సుభద్ర వెళ్ళిపోయిందన్నమాట అనుకున్నాడు. భార్యను ఉద్దేశించి అరిచాడిలా.

"ఇదిగో! సుత్తి సుభద్ర వెళ్ళిపోయిందా?"

అతని అరుపునకు సుత్తి సుభద్రసహా భార్య కూడా లేచి నిల్చుంది. వాళ్ళని చూసి ఆశ్చర్యపోయాడు భర్త. మెట్ల మీదే ఆగిపోయాడు. వెంటనే కల్పించుకుని భార్య తెలివిగా సర్దిచెప్పిందిలా.

"ఆ సుభద్రగారు ఎప్పుడో వెళ్ళిపోయారు. ఆమె అటు వెళ్ళడం, ఈమె ఇటు రావడం రెండూ ఒకేసారి జరిగాయి. రండిరండి, మీ గురించి ఇప్పుడే అడిగారు సుభద్రగారు."

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 12
24-5-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజి

# వేణువై వచ్చాను...

వెన్నెలవేళ సీతమ్మ వేణువు వినవస్తుంది. సన్నగా వర్షం కురిసే వేళ సీతమ్మ వేణువు వినవస్తుంది. చలివేళ, సాయం వేళ సీతమ్మ వేణువు వినవస్తుంది. ఏ వేళనైనా వినవచ్చే సీతమ్మ వేణువు ఎవరికైనా విందు చేస్తుంది. పసందు చేస్తుంది. సీతమ్మకు అరవై ఏళ్ళు. సన్నగా పొడవుగా వేణువులా ఉంటుందామె. నిలువెల్లా బాధలరంధ్రాలేమో! పలకరిస్తే చాలు, పాటైపోతుంది. పరుగైపోతుంది. తండ్రి వేణువులు తయారు చేసి అమ్మేవాడు. నాలుగు, అయిదు, ఏడు, తొమ్మిది రంధ్రాల వేణువులు తండ్రి తయారు చేస్తోంటే, సరిగా పలుకుతున్నదీ లేనిదీ వేణువును పరికించి అతను చూస్తోంటే సరదాగా ఉండేది చిన్ననాటి సీతకు. తానూ వాటి తయారీలో పాలుపంచుకునేది. తండ్రి స్వరాలు సరిజేస్తోంటే తానూ అదే రీతిన సరిజేసి వేణుగానాన్ని నేర్చుకున్నది. కర్ణాటక, హిందుస్థానీ సంగీతాలు తెలుసుకున్నది. సంగీతం తెలిసిన సీతను, ప్రేమించిమరీ పెళ్ళి చేసుకున్నాడు రామయ్య. ఓ కొడుకును కని, వెళ్ళిపోయాడు. పోయిన రామయ్యకోసం దిగులు లేదు, పొత్తిళ్ళ పాపడికోసమే ప్రయాస. ఆనాటికి తండ్రి కూడా పోయాడు. ఒక్కతే వేణువులు తయారు చేస్తూ, అమ్ముతూ, బిడ్డని పెంచుతూ వచ్చింది సీతమ్మ. బిడ్డ పెరిగి పెద్దవాడయ్యాడు. ఉద్యోగి అయ్యాడు. పెళ్ళి చేసుకుని పట్నంలో స్థిరపడ్డాడు. తల్లిని చెంతనే ఉంచుకున్నాడు కాని, భార్య చెప్పిన మీదట ఆమెను తన మనసుకూ మమతకూ దూరంగా ఉంచసాగాడు. ఆ దూరాన్ని తట్టుకోలేని సీతమ్మ, మధ్యలో మానేసిన వేణువుల తయారీని, గానాన్నీ మళ్ళీ అందుకుంది.

పొద్దున అయిదుగంటలకే ప్రకాశం పార్కుకి చేరుకుంటుంది సీతమ్మ. వేణుగానం ప్రారంభిస్తుంది. ఆ పాట వింటూ వాకర్స్ రెట్టించిన ఉత్సాహంతో నడుస్తారు. అలసిన వేళ సీతమ్మ సరసన చేరి, వారంతా అదే వేణుగానానికి సేదదీరుతారు. సరదాపడి కొందరు నేర్పమంటే, నేర్పుతానుగానీ, విడవకుండా వందరోజులు నేర్చుకోవాలయ్యా! రోజుకి రూపాయి ఫీజు చెల్లించాలి అంటుంది సీతమ్మ. ఓసింతేకదా అంటే...వందరూపాయలు ప్రధానం కాదయ్యా! వందరోజులు ప్రధానం. ఏ రోజూ గైరుహాజరు కాకూడదంటుంది. సరే అంటే వేణువు ఇచ్చి, ఊపిరిలూదమంటుంది. రంధ్రాల మీద వేళ్ళు కదలించి, రాగాలు పలికించమంటుంది. ఎలా అంటే ఇలా అంటుంది. పలికించి చూపుతుంది. ముందుగా సినిమా పాటలు నేర్పుతుంది. అక్కడితో ఆగిపోతారంతా. చాలని ఆనందిస్తారు. సరేనంటుంది సీతమ్మ. గురుదక్షిణగా వందరూపాయలు తీసుకుని, ఎవరి వేణువు వారికి కానుక చేస్తుంది. సరదా, సంగీతంపట్ల మమకారం ఉన్నంతకాలం వేణువు మీ దగ్గరే ఉంటుంది. మీరూ దానికి దగ్గరగానే ఉంటారు. సరదాలూ, మమకారాలూ పోతేనే ప్రమాదం. వేణువును ఏ గూటిలోనో ఉంచి, దాన్ని ఒంటరిదాన్ని చేస్తారు. దిక్కులేనిదాన్ని చేస్తారు. దయచేసి అలా చెయ్యకండయ్యా! ఏ అనాథకో, అంధునికో దానిని బహూకరించండి! అది వారికీ, వారు దానికీ ఒకరికి ఒకరు తోడవుతారు. ఒకరికొకరు నీడవుతారు అంటుంది సీతమ్మ.

ఆయాసపడుతూ, దగ్గుతూ కూర్చుని, వేణుగానాన్ని వినే పెద్దమనుషుల్ని ప్రయత్నించి చూడండయ్యా! వేణువును పలికించి చూడండి! పొద్దున పదిసార్లు, సాయంత్రం పదిసార్లు వేణువును పలికించారంటే మీకు ఈ బాధలు ఉండవయ్యా అంటుంది సీతమ్మ. శ్వాసకోశవ్యాధులకు సరైన చికిత్స వేణుగానం అంటుంది. ఇబ్బందిపడుతున్నా, సిగ్గుపడుతున్నా వదలదు. పట్టుబట్టిమరీ నేర్పుతుంది. నెలరోజుల తర్వాత నేర్చుకున్నవారు తేరుకున్నట్టు కనిపిస్తే చూశారా మహిమ అంటూ వేణువును కళ్ళకద్దుకోమంటుంది. కష్టానికీ, సుఖానికీ వేణువును మించిన నేస్తం లేదయ్యా! చేతులు జాచి చేరదీయండి! చేతనైనంతగా పాడండి అంటుంది. కొడుకూ, కోడలికీ దూరమైతేనేం? పార్కులో ప్రతి ఒక్కరికీ సీతమ్మ దగ్గరే! ఆమె పార్కుకి వస్తోంటే అక్కడి మనుషులూ, చెట్టూపుట్టేకాదు, అక్కడి పక్షులు కూడా సీతమ్మను ఆహ్వానిస్తున్నట్టుగా కిలకిలమంటాయి. ఆ కిలకిలలు వేణుగానాల్లా ఉంటాయి.

నవ్య



## గెట్‌సెట్ క్యాంప్!

ఒక హిల్‌స్టేషన్, ఒక అడవి, ఒక అందమైన లోయ.... ప్రకృతిరమణీయ దృశ్యాలను చూస్తూ మైమరస్తూ ఏకాంత ప్రదేశంలో ఏకాంతంగా గడిపితే...ప్రపంచాన్నే మరచిపోవచ్చు. ఏ రక మైన చీకూ చింతా లేకుండా హాయిగా, ఆనం దంగా గడపవచ్చు. చల్లని సాయంత్రం వేళ, చుక్కలు మేమొచ్చేస్తున్నామంటూ అక్కడొకటీ అక్కడొకటీ తళుక్కుమనేవేళ, వెన్నెల కాంతులలో గడిపితే ఎలా ఉంటుంది? మరి అలాంటి ప్రదే శాల్లో ప్రకృతి మధ్య గడపాలంటే క్యాంప్ వేసు కోవాల్సిందే! సరిగ్గా ఇక్కడే నిమేశ్, నవేశ్‌లు తమ ఆలోచనను ఆచరణలో పెట్టారు. మేం మీకు క్యాంప్ సెట్ చేసి ఇస్తామంటున్నారు. అలా వారు ప్రారంభించిందే గెట్‌సెట్ క్యాంప్! జన్మలో మరిచిపోలేని ఎన్నో అద్భుతమైన అనుభూతుల్ని మూటగట్టి ఇస్తోంది గెట్‌సెట్ క్యాంప్. రెగ్యులర్ హోటల్ లాగా కాకుండా క్యాంపింగ్ స్టయిల్ అకా మడేషన్ ఇవ్వడం దీని ప్రత్యేకత. ప్రకృతితో మమే కమై అందమైన లోకేష న్‌లో రెండు మూడు రోజులు గడపాలనుకునేవా రికి వీరు కంటికి ఇంపైన ఏర్పాట్లు చేస్తారు. అలా క్యాంప్ సెట్టింగ్ కావాలనుకునేవారు వెబ్ సైట్‌లోకి లాగిన్ అవగానే వారి అభిరుచికి తగ్గ ట్టుగానే వెరిఫైడ్ క్యాంప్ సైట్స్ కనిపిస్తాయి. అన్నీ నిజమైన పిక్చర్లతో కూడిన డీటెయిల్స్ ఇస్తారు. ఒకవేళ ఏమైనా సందేహాలుంటే హెల్ప్ డెస్క్ ఉంటుంది.



గెట్ సెట్ క్యాంప్ ఫిబ్రవరి 2013లో మొద లైంది. ముంబై వేదికగా మొదట రెంటల్ బేసిస్‌లో మొదలుపెట్టారు. మెల్లిగా మార్కెట్ మీద పట్టు సాధించి లాభాలబాట పట్టారు. ఆ తర్వాత 2015లో పూర్తిస్థాయి క్యాంపింగ్ అకామడేషన్ మోడల్లోకి మారిపోయారు. ఇప్పుడు ఇండియా అంతటా విస్తరించాలని ప్లాన్ చేస్తున్నారు.

అన్నదమ్ములైన నిమేశ్, నవేశ్‌లు చేస్తున్న ఉద్యోగాలు వదిలిపెట్టి మరీ ఈ క్యాంపులు సెట్ చేస్తున్నారు. వీరిలా ఉద్యోగాలు వదిలిపెట్టి ఈ రంగంలోకి దిగడం మొదట వీరి తల్లిదండ్రులకు ఏమాత్రం ఇష్టం లేదు. అయితే తమ మీద తమ కున్న నమ్మకంతో వారు తల్లిదండ్రులకు నచ్చ చెప్పి ఈ రంగంలోకి వచ్చారు. అనుకున్నది సాధించారు. అంతేకాదు నిమేశ్ డిజిటల్ ఆర్టిస్ట్ అయినందున క్రియేటివ్ విభాగం అంతా అతనే చూసుకుంటాడు. వీరితో పాటు ఇంకో ముగ్గురు టీం మెంబర్లు కూడా ఉన్నారు. వీరంతా కలిసి క్యాంపులు డిజైన్ చేస్తూ తమ క్రియేటివిటీని చాటు కోవడంతో పాటు, ఆర్థికంగా కూడా ముందుకు సాగుతున్నారు.

# మెయిల్ బాక్స్

### చక్కటి శైలితో సాగే 'మనసుగతి ఇంతే'

'మనసుగతి ఇంతే' సీరియల్ రచయిత వక్కంతం సూర్యనారాయణరావ్‌గారు చక్కటిశైలితో రాస్తున్నారు. వీక్లీకి ఈ సీరియల్ హైలైట్. ఇంతమంచి సీరియల్ అందిస్తున్న యాజమాన్యానికి ధన్యవాదాలు. కోట శ్రీనివాసరావుగారి భావాలు మాకు బాగా నచ్చాయి.

– కోలిపాక శ్రీనివాస్, బెల్లంపల్లి

### సివిఆర్ పుస్తక సమీక్ష బాగుంది

నిరుపేదగా పుట్టడం నేరం కాదు, పేదగా మర ణించడం తప్పు అంటూ ప్రారంభించి రాసిన 'సి.వి.ఆర్ జీవన తరంగాలు' పుస్తక సమీక్ష బాగుంది. జీవిత చరిత్రలు వ్యక్తిత్వ వికాస గ్రంథాలే అని నిరూ పించిన సి.వి.ఆర్ ఆదర్శప్రాయుడు, శ్లాఘనీయుడు.

వివిధ దేశాలలో ఎలా ఉంటే 'అందం' అని పరి గణిస్తారో చక్కగా వివరించారు. జీవితం అంటే చివర సున్నా అని కోట శ్రీనివాసరావు బాగా చెప్పారు.

–కె.ప్రవీణ్, కాకినాడ

### ముగ్గురు మరాఠీల ప్రహసనం

మే 10వ తేదీ సంచిక మార్నింగ్ కాఫీ మోసంలో మోసం లా ముగ్గురు మరాఠీల ప్రహసనం సోముడు అతితెలివి అచ్చెరువొందేలా ఉంది. మొదటిపేజీ 'జాన కమ్మవంటివారు ఛాదస్తంలా కనిపించినా ఎంతో అను భవం కలబోసిన వారి మాటలు అందరికీ శిరోధార్యం అనకతప్పదు. హర్షఋతువు కథాకర్త సింహప్రసాద్ గారికి అభినందనలు. మా అపార్ట్‌మెంట్ లిఫ్ట్ అంటూ లిఫ్టు త్యాగాన్ని అక్షరబద్ధం చేసి ఆకట్టుకోవడంలో కృతకృత్యులయ్యారు ఓలేటి శ్రీనివాసభాను. ఇవన్నీ నిజాలేలో హంసలు ఏకపత్నీవ్రతం చదివాక మను షులు సిగ్గుపడాలేమో అనిపించింది. సరదా కథలు చదువుతున్నాం. సీరియల్స్ వదలకుండా చదివిస్తు న్నాయి.

–నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం

### మరువలేని చిక్కని 'కాఫీ'

కాఫీబ్రేక్ ఐటెమ్ అత్యంత వినోదాత్మకంగా ఉండటమే కాకుండా ఆ చిన్ని కథ తాజాదనం చిక్కని కాఫీలా మరువలేనిదిగా ఉంది. నిరాశావాదానికి మూలమే నిర్లిప్తత. ఈ జంట రుగ్మతలకు దూరంగా ఉండేందుకు ప్రయత్నించాలి. నటుడు ఎమ్మెస్ నారాయణ జీవితకథ పుస్తకావిష్కరణ వివరాలు అలరించాయి. విజ్ఞానానికి మారుపేరైన ఎమ్మెస్ హాస్యప్రియత్వాన్ని మరువలేం. సక్సెస్‌ఫుల్ సెక్స్‌లైఫ్ జీవితానికి సంపూర్ణత్వాన్ని, పరిపక్వతను, మానసిక, లైంగిక సంతృప్తిని, విశ్రాంతినీ ఇస్తుంది. మూడో ముడి కథ చక్కగా కుదిరింది. ఔటర్‌రింగ్‌రోడ్ క్రైమ్ స్టోరీ సస్పెన్స్‌తో సాగింది.

–డాక్టర్ శివభూషణం, కర్నూలు

### ఎంత పొగిడినా తక్కువే

నవ్య వీక్లీని ఎంతపొగిడినా తక్కువే. పత్రిక ప్రతి వారం ఠంచనుగా బుధవారంనాడు పాఠకుల చేతికి అందుతుంది. వీక్లీ నిర్వాహకులు ఎంతైనా ప్రశంసనీ యులు.

–డా.టి.బాల్‌ముకుంద్‌సింగ్, అమరచింత

### జానకమ్మ బోధలు అందరూ పాటించాలి

పెళ్ళయిన యువతికి జానకమ్మ చేసిన హిత బోధ బాగుంది. మనుషులు ఇంతే, అభిమానాలు, అపార్థాలే... జీవితాన్ని తెలుసుకోవాలంటూ చక్కగా చెప్పిన బోధల్ని అందరూ తెలుసుకుని పాటించాలి. ఈ కాలం పిల్లలకు ఇదెంతో అవసరం. జపనీయుల హస్తకళ ఒరిగామి కళాకృతులు అద్భుతంగా ఉన్నాయి. ఆ కళ గురించి చెప్పిన విషయాలు ఆకట్టుకున్నాయి.

—కె.సాహిత్యదీప్తి, రమణ్యపేట. తూ.గో.జిల్లా

### జానకమ్మ మాట వినాలి

జానకమ్మను అసహ్యించుకునే గౌతమి, ఆమె చెప్పిన హితబోధలు, పెద్దరికపు మాటలు విని కన్నీళ్ళు పెట్టుకోవడం మనసును కరిగించింది. ఈ మొదటిపేజీ కథ 'మనుషులింతే' ఎంతో బాగుంది. ఈ కాలం పిల్లలకు పెద్దరికపు మాటలు నచ్చడం లేదు. పిల్లలు పెద్దల మాట వినాలి, ఆకళించు కోవాలి. అందుకు గౌతమి ఉదాహరణ.

–శ్రీవల్లి, హైదరాబాద్

### వెట్టి వెరీ ఇంట్రెస్టింగ్

వెట్టి సీరియల్ అనేక మలుపులు తిరుగుతూ ఇంట్రెస్టింగ్‌గా సాగుతోంది. తల్లి కడుపులో ఉండ గానే పిల్లలు రుచులు, వినికిడి శబ్దాలు గ్రహించ గలుగుతారని 'ఆరోగ్యమే మహాభాగ్యం'లో తెలియ జేశారు. తీన్మార్ కార్టూన్స్ వారం వారం పత్రికకోసం ఎదురుచూసేలా ఉంటున్నాయి. మాస్టారు కథ చాలా బాగుంది.

–చిన్నా, ఖమ్మం

### మూడోపాదం సూపర్

కథలు నాలుగూ బాగున్నాయి. సలీం కథ 'మూడో పాదం' సూపర్. ఫీచర్లన్నీ విశేషంగా ఆకట్టుకుంటు న్నాయి. భారత్‌ను కవ్విస్తున్న పాక్ దుశ్చర్యలు ఖండించదగినవి. లేడీ డిటెక్టివ్ రజనీపండిట్ పట్టు దల, చొరవ ఆశ్చర్యపరిచాయి.

ఎమ్మెస్ నారాయణకు కారం మమకారం రెండూ ఎక్కువే అంటూ తనికెళ్ళ భరణి, పుస్తకా విష్కరణ సభలో నవ్వుల పూలజల్లులు కురిపించారు. సినీ కార్మికుల కోసం కోటగారు దీక్షచేసి విరమించి నప్పటి చిత్రపరిశ్రమలోని చేదునిజాలు వెల్లడ య్యాయి.

—తాళాబత్తుల సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం

# మద్యం సేవిస్తే మరణశిక్షే!

తాగడం...తూలడం ఈ రోజుల్లో ఫ్యాషన్! మద్యం కొందరిని నిద్ర పుచ్చితే మరికొందరితో చిందులు వేయిస్తుంది. తాగడం తప్పు అనే సూక్తిని పెద్దల నుంచి పిల్లల దాకా అందరూ ఎప్పుడో మరిచి పోయారు. కొన్ని దేశాలవారు మద్యపానాన్ని తీవ్రమైన నేరంగా పరిగణిస్తుంటే... మరికొన్ని దేశాల వారు చూసీ చూడనట్టు ఉండిపోతున్నారు. సంపూర్ణ మద్య నిషేధాన్ని కాగితాలలో కాకుండా చేతలలో చూపిస్తున్న కొన్ని దేశాలు...

**ఎల్‌సాల్వడార్:** మద్యం తాగి వాహనాలు నడపడం నేరం ఘోరం అనే మాటలు ఈ దేశంలో వినిపించవు. అలా కంటపడిన వారిని ఫైరింగ్ జట్టుతో షూట్ చేయిస్తారు. అది మొదటి నేరమైనా శిక్ష అంత కఠినంగా అమలు చేస్తారు.

**రష్యా:** రష్యాలో నిబంధనలు, శిక్షలు మరీ అంత కఠినతరంగా ఉండవు. తాగి వాహనం నడుపుతున్న వ్యక్తి లైసెన్స్‌ను జీవిత కాలం రద్దు చేస్తారు. ఆ వ్యక్తి తన జీవితంలో స్వంతంగా వాహనం నడిపే అర్హత కోల్పోతాడు.



**మలేసియా:** మలేసియాలో తాగి వాహనం నడిపిన వ్యక్తినే కాకుండా, అతనితో పాటు ఉన్న వ్యక్తిని కూడా అరెస్ట్ చేసి జైలుకి పంపుతారు. ఆ వ్యక్తి వెనుక కూర్చున్నది అతని కుటుంబ సభ్యులు అయినా శిక్షలో ఎలాంటి మార్పూ ఉండదు.

**థాయిలాండ్:** ఏ దేశంలోనూ లేని విచిత్రమైన చట్టం ఇక్కడ అమలు చేస్తున్నారు. మద్యం సేవించడం, సేవించి వాహనం నడపడం చట్టవిరుద్ధమే కాదు, ఎవరు పడితే వారు మద్యం కొనుగోలు చేయడానికి కూడా అనుమతి లేదు. మద్యం కొనుగోలుకు ప్రత్యేకమైన అనుమతి తీసుకోవాలి.

**యునైటెడ్ కింగ్‌డమ్:** ఇక్కడ పబ్బుల్లోనూ, బార్లలోనూ మద్యం సేవించడానికి కొంత మేరకే అనుమతి లభిస్తుంది. వాటిల్లో పరిమితికి మించి మద్యం సేవించడం కూడా నేరమే! పరిమితికి మించి మద్యం సేవించినట్టు రుజువైతే కఠిన శిక్ష అనుభవించాల్సి ఉంటుంది.

**స్కాట్లాండ్:** ఇక్కడ ఓ వింత చట్టం అమలులో ఉంది. మద్యం సేవించిన వ్యక్తి ఆవు మీద ఎక్కితే కఠినంగా శిక్షిస్తారట!

**కెనడా:** ఇక్కడ కూడా ఓ వినూత్నమైన చట్టం అమలులో ఉంది. అది తాగిన వారికి వర్తించదు. బార్‌టెండర్స్‌కి వర్తిస్తుంది. వినియోగదారులు అడిగిన విధంగానే బార్‌టెండర్లు మద్యం అందించాలి. అందులో తమ క్రియేటివిటీ చూపిస్తే శిక్షకు అర్హులవుతారు.

**ఫ్రాన్స్:** బ్రీత్ ఎనలైజర్ ద్వారా పోలీసులు మద్యం సేవించిన వ్యక్తులను గుర్తిస్తారు. వారు ఎంత మేర మద్యం సేవించారో నిర్ణయిస్తారు. ఈ బ్రీత్ ఎనలైజర్లు పోలీసుల వెంటే ఉంటాయి. ఫ్రాన్స్‌లో మాత్రం మద్యం సేవించేవారు బ్రీత్ ఎనలైజర్లను వారే వెంట తెచ్చుకోవాలి. బ్రీత్ ఎనలైజర్లు లేకుండా వాహనం నడపడం అక్కడ నేరం.

**జర్మనీ:** మద్యం సేవించి వాహనం నడిపేవారికి చట్టాలు కాకుండా స్థానికులే శిక్షవిధిస్తారు. ఏ వ్యక్తి అయినా మద్యం సేవించి వాహనం నడుపుతున్నట్టు స్థానికులు గమనిస్తే వారి వెంట పడి మరీ కొడతారు. ఇలా కొట్టడం అక్కడ నేరంగా పరిగణించరు.

**ఇండియా:** చట్టాలు అయితే చేశారు కానీ, దాన్ని పాటించే వారే కరవయ్యారు. మైనర్లు మద్యం సేవించి వాహనం నడపరాదన్న నిబంధనలు గాలికి వదిలేస్తున్నారు.

నవ్య





# భ్రాతృదేవోభవ



**మే 24 'బ్రదర్స్ డే' సందర్భంగా...**

**అరణ్యవాసం చేస్తున్నప్పుడు శ్రీరాముడు అయోధ్యకు తిరిగివెళ్ళి తల్లిదండ్రులకు సేవ చేయాల్సిందిగా లక్ష్మణుణ్ణి బ్రతిమాలతాడు. అప్పుడు లక్ష్మణుడు 'అన్నా! నీ మాట ప్రకారం నేను తిరిగి వెళ్ళినా, నువ్వు నాకు కనబడినంత వరకు మాత్రమే ప్రాణాలతో ఉంటాను. నీవు ఎప్పుడైతే కనుమరుగవుతావో మరుక్షణమే నా ప్రాణాలు పోతాయి' అంటాడు రామునితో. ఆ మాటలను బట్టి అన్నపై తమ్ముడికున్న అనురాగం అర్థం చేసుకోవచ్చు. అలాగే శ్రీరామునికి కూడా లక్ష్మణుడిపై అపారమైన ప్రేమ. అందుకు సీతమ్మ స్వయంగా పలికిన ఈ మాటలే నిదర్శనం. 'మత్తః ప్రియతరో నిత్యం భ్రాతా రామస్య లక్ష్మణః' – అంటే 'రామునికి నాకన్నా సోదరుడు లక్ష్మణుడే ప్రియతముడు'. శ్రీరామ లక్ష్మణులకు ఒకరిపై మరొకరికి ఉన్న ఆ ప్రేమానుబంధం నేటి తరం అన్నదమ్ములలో కొంతైనా ఉందా?**

మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ అంటూ తల్లిదండ్రులను, విద్యనందించిన గురువును గౌరవించడం మన విధి, సంప్రదాయం. పెద్దలను గౌరవించడం, ఉమ్మడికుటుంబాలు, బంధాలు బంధుత్వాలు, ఒకరికొకరు సహకరించుకోవడం, ఐకమత్యంతో సమష్టి జీవన ప్రయాణం ఇవన్నీ భారతీయ జీవన విధానంలోనే కనిపిస్తాయి.

అలా సమష్టిగా కుటుంబమంతా ఒక దగ్గర చేరి పండగలు, ఉత్సవాలు జరుపుకోవడం ప్రతీ మతంలోనూ, ప్రతీ సంస్కృతిలోనూ కనిపిస్తుంది. వాటిద్వారా అందరూ ఒకదగ్గర చేరి ఆడిపాడి, సంతోషం, ఆనందం పంచుకుని తమదైన ఒక ఆత్మీయలోకంలో విహరిస్తారు. కానీ ఉరుకుల పరుగుల జీవితంలో బంధాలే మృగ్యమైపోతున్న తరుణంలో బంధాలు, అనుబంధాల ప్రసక్తి ఎక్కడిది? తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు... ఎవరికి వారే యమునాతీరే అన్నట్టుగా ఉంది ప్రస్తుత పరిస్థితి. అసలు ఈ దగ్గరితనం దూరంగా జరుగుతుండటం వల్లనే కొత్తకొత్త 'డే'లు పుట్టుకొచ్చాయి, పుట్టుకొస్తున్నాయి. తరచి చూస్తే ప్రపంచంలో సంవత్సరంలోని ప్రతిరోజూ ఏదో ఒక 'డే' సెలబ్రేట్ చేసుకుంటూనే ఉంటారు. సోదరీసోదరుల మధ్య అనుబంధానికి గుర్తుగా రాఖీ, తల్లీబిడ్డల మధ్య అనురాగానికి మదర్స్ డే, ప్రేమికుల కోసం 'వాలెంటైన్స్ డే' ఇలా ఏదో ఒకరూపంలో కాస్తయినా ఆప్యాయతానురాగాలు, బంధాలు దృఢపరుచుకుంటున్నారు. ఆ కోవలోకే వస్తుంది 'బ్రదర్స్ డే' కూడా! అన్నదమ్ముల మధ్య బంధం దృఢపడేందుకు, వారిని మరింత దగ్గర చేసేందుకు అన్నదమ్ములరోజును సెలబ్రేట్ చేసుకుంటారు. మొట్టమొదటగా డానియల్ సి. రోడ్స్ ఈ 'బ్రదర్స్ డే' ప్రారంభించారు. మే 24 'బ్రదర్స్ డే' సందర్భంగా అన్నదమ్ముల తీపికబుర్లు, కష్టసుఖాలు మీకోసం...

### చిన్ననాటి మధురిమలు

బాల్యం అత్యంత మధురం. తల్లి లాలన, తండ్రి పాలన, తోడబుట్టినవారితో ఆటపాటలు... ఇలా ఎన్నో తీపిగుర్తుల సమాహారం బాల్యం. గతంలోని ఆ తీపిగుర్తులు నెమరేసుకునే అద్భుత అవకాశం ఈ 'డే'ల వల్ల కలుగుతుందంటే అతిశయోక్తి కాదు. అన్నదమ్ముల మధ్య వచ్చే చిన్న చిన్న గిల్లికజ్జాలు, చదువులో పోటీలు, ఆటపాటలు, తమ్ముడికి వెన్నుదన్నుగా అన్న, అతడికి చేదోడు వాదోడుగా తమ్ముడు ఇలా ఎన్నో రకాలుగా అన్నదమ్ముల అనుబంధం పెనవేసుకుని ఉంటుంది. చిన్నతనంలో అంతలా కలివిడిగా ఉండి, ఒకరికొకరుగా పెరిగిన అన్నదమ్ములు, పెద్దయ్యాక ఉద్యోగ బాధ్యతల వల్లనో, పెరిగిన కుటుంబ బాధ్యతల వల్లనో వారి మధ్య దూరం పెరిగిపోతోంది. ఒక్క చిన్న ఫోన్‌కాల్ కూడా చేయలేని పరిస్థితులు దాపురించాయి. ఇలాంటి పరిస్థితుల్లో పిల్లల నడత పెద్దవాళ్ళను అనుసరించే ఉంటుందని గుర్తుంచుకోవాలి. పెదనాన్న, బాబాయి అని పిలవటానికి బదులు ఆంటీ, అంకుల్ పదాలకే పరిమితమవుతున్న నేటి తరం పిల్లలు బంధాలకు దూరంగా, యాంత్రికంగా జీవితం గడపడం, మమతానురాగాలు, ఆప్యాయత పిల్లల్లో లోపించడం... ఇవన్నీ నేటి తల్లిదండ్రుల పెంపకం వల్లనే అనేది ఫ్యామిలీ రిలేషన్స్ ఎనలిస్టుల నివేదిక సారాంశం.

### చెప్పకనే చెబుతున్నాయి

అన్నదమ్ముల అనుబంధాన్ని చిత్రీకరించడంలో సినిమాలు ఏమాత్రం తీసిపోలేదు. అప్పుడూ ఇప్పుడూ వస్తున్న సినిమాలు అన్నదమ్ముల మధ్య బంధం ఎంత గట్టిగా ఉండాలో చెప్పకనే చెబుతున్నాయి. అన్నదమ్ముల అనుబంధం, అపూర్వ సహోదరులు, సీతారామరాజు, పెద్దన్నయ్య వంటి సినిమాలు సహోదరుల మధ్య అనుబంధాన్ని గుర్తుచేస్తాయి. అయితే రామలక్ష్మణుల్లా, సినిమాల్లో చూపించిన విధంగా అన్నదమ్ములు ఉండాలంటే ఈరోజుల్లో సాధ్యమేనా? అనే సందేహాలూ వస్తాయి. కానీ ఎంతోమంది అన్నదమ్ములు ఎన్ని అంతరాలు, అవాంతరాలున్నా

### రక్తసంబంధమే కానక్కర్లేదు

అన్న లేక తమ్ముడు అని పిలిపించుకోవడానికి రక్తం పంచుకుపుట్టినవారే కానక్కర్లేదు. మనసులో ప్రేమ, ఆప్యాయత, దగ్గరితనం ఉంటే ఎవరు ఎవరినైనా సోదరులుగా భావించవచ్చు. ఆదరించవచ్చు. ఆనందించవచ్చు. అభిప్రాయాలు, కష్టసుఖాలు, సంతోషాలు వారితో పంచుకోనూవచ్చు. మీరు సోదరులుగా భావించేవారితో కూడా బ్రదర్స్ డేని సెలబ్రేట్ చేసుకోవచ్చు. చిన్నచిన్న బహుమతులు ఇచ్చిపుచ్చుకోవచ్చు.

నేటితరానికి ఆదర్శంగా నిలుస్తున్నారు. ఒకరికొకరు ఆసరాగా ఉండాలనే జీవన సత్యాన్ని తెలియజేస్తు న్నారు. ప్రప్రథమంగా విమానం తయారుచేసి, గాల్లోకి ఎగిరిన రైట్ బ్రదర్స్ ఆ కోవలోకే వస్తారు. వారిద్దరూ కలిసి, ఆలోచనలు పంచుకొని ప్రయత్నించటం వల్లే అది సాధ్యమైందనేది జగమెరిగిన సత్యం.

### విభేదాలు సహజం

అన్నదమ్ముల మధ్య అనురాగం, ఆప్యాయతలే తప్ప శత్రుత్వాలు ఉండకూడదు. చిన్నవయసులో అనేక విషయాల్లో ఏకాభిప్రాయంతో ఉన్నాగానీ, పెద్దయ్యాక పంచుకునే విషయాల్లోనే విభేదాలు వస్తుంటాయి. అలాగే పెళ్ళిళ్ళ తర్వాత వారి బంధం పలచబడుతుందనేది మరో వాదన. ఏదేమైనా కొన్ని జాగ్రత్తలు తీసుకుంటే అన్నదమ్ముల అను బంధం అపూర్వమే. అందుకే పిల్లలను అలాంటి అంతరాలు, అవాంతరాల్ని అధిగమించేలా మాన సికంగా తయారుచేయాలి.

### చేయూత

ఆర్థికంగా అన్నదమ్ముల్లో ఒకరు ఉన్నతంగా ఉన్న ప్పుడు తమ సోదరుల మంచిచెడుల్ని, అవసరమైతే ఆర్థిక చేయూతని అవసరాన్నిబట్టి ఇవ్వగలగాలి. ఒకరు కావాలని నాశనం చేసుకున్నప్పుడు అతన్ని మార్చేందుకు, అతని కుటుంబాన్ని నిలబెట్టేందుకు ప్రయత్నించాలి. ఇలా ఆ కుటుంబానికి తోడ్పాటు నందించాలి. దానివల్ల సోదరుని పిల్లల దృష్టిలో బాబాయి, పెదనాన్న అంటే మంచి అభిప్రాయం కలుగుతుంది. వారు కూడా జీవితంలో అలాంటి పద్ధతులే అలవరుచుకుంటారు. కలిసిమెలిసి చేదోడు వాదోడుగా ఉంటారు.

### బాధ్యత వారిదే!

పెళ్ళిళ్ళయ్యాక ఎవరి జీవితాలు వారివి. వారి ఆదాయాలు కూడా వేర్వేరుగా ఉండటం సహజం. అయినా తమ మధ్య అనుబంధం చెక్కు చెదరకుండా చూసుకోవాల్సింది అన్నదమ్ములే. అలాకాకుండా కొందరు చిన్నప్పుడు తమ మధ్య ఉన్న భేదాభి ప్రాయాల్ని భార్యలతో పంచుకుంటారు. వాళ్ళు ఆ దృష్టితోనే వారిని చూడటం జరుగుతుంది. దీనివల్ల అనుబంధాలు బీటలువారే ప్రమాదం ఉంది. అంతే కాదు 'వాడి పెళ్ళాం వచ్చాకే వాళ్ళమధ్య గొడవలు వచ్చాయి' అనే మాటలూ ఇరుగు పొరుగు నోట వినిపిస్తాయి. అందుకే అన్నదమ్ములమధ్య అనుబంధం బలపర్చుకోవాల్సిన బాధ్యత కూడా వారిదే. వీళ్ళ మధ్య అనురాగం బాగుంటేనే వారి భార్యలమధ్య అనుబంధం మరింత బాగుంటుంది.


రైట్ బ్రదర్స్



### ఇలా సెలబ్రేట్ చేసుకోండి

- లేవగానే మీ అన్నదమ్ములను ఆప్యాయంగా కౌగలించుకుని, మీ ప్రేమను తెలియబరచండి.
- బ్రేక్‌ఫాస్ట్, లంచ్, డిన్నర్ కలిసే చేస్తే ఆ అను భూతి వర్ణనాతీతం.
- ఒకవేళ ఉద్యోగరీత్యా, బాధ్యతలరీత్యా కలుసు కోలేని పరిస్థితులు ఉంటే, ఫోన్‌కాల్స్ ఉన్నాయి. చిన్నచిన్న బహుమతులు పంపించవచ్చు. లేదా మీ చిన్ననాటి తీయటి అనుభూతుల్ని కాసేప యినా, ఫోన్‌లోనో, చాటింగ్ ద్వారానో పంచు కోవచ్చు.
- మీ అన్నదమ్ములతో మీకున్న అనుభూతుల్ని, అనుభవాల్ని సోషల్‌మీడియాలో షేర్ చేసుకోండి.
- మీ గుర్తుగా ఓ చిన్న పుస్తకమో, మీ చిన్న ప్పటి ఫొటోలనో పంపించండి.
- వీలైతే అన్నదమ్ములు కుటుంబాలతోసహా ఒక దగ్గర చేరి సెలబ్రేట్ చేసుకోవడం, ఏదయినా పుణ్యక్షేత్రానికో, రిసార్టుకో వెళ్ళటం చేస్తే మీమధ్య బంధం ఇంకాస్త బలపడుతుంది.
- కేవలం ఆనందాలే కాదు కష్టసుఖాలను కూడా అన్నదమ్ములతో పంచుకోండి. దానివల్ల మనసు ప్రశాంతంగా ఉండటంతోపాటు నాకూ ఓ తోడు ఉన్నారనే భావన కలుగుతుంది.

### కష్టాల్లో ఉన్నప్పుడే...

అన్నదమ్ములమధ్య సఖ్యత కష్టనష్టాలొచ్చినప్పుడే బాగా తెలుస్తుంది. అలాగని, ఒకరి జీవితాన్ని మరొకరు మొత్తంగా తలకెత్తుకోవాల్సిన అవసరం లేదు. కానీ కష్టంలో ఉన్నప్పుడు తండ్రి తర్వాత తండ్రిలా పెద్ద సోదరుడు ఉండాలి. పెద్దవాళ్ళకి కష్టం వచ్చినా, తన తమ్ముడు వ్యవహారవేత్తగా ఉంటే, అతనితో సంప్రదించడం చిన్నతనమని అన్న అనుకోకూడదు. అలా ఒకరికొకరు కష్టనష్టాల్లో ఆసరాగా ఉండాలి. వాటి నుండి బయటపడేందుకు చేయూతగా నిలవాలి. అవసరమైతే తమ జీవిత భాగస్వాముల సహ కారమూ తీసుకోవాలి. వారికీ పరిస్థితి అర్థమయ్యేలా చెప్పగలగాలి. అప్పుడు వారిమధ్య ఎలాంటి కష్టం వచ్చినా, నష్టం తలెత్తినా తేలిగ్గా బయటపడగలు గుతారు.

### దూరంగా ఉన్నా...

అన్నదమ్ములు ఉద్యోగాల రీత్యా ఒకరికొకరు దూరంగా ఉన్నాగానీ వీలైనప్పుడల్లా పలకరించు కుంటూ ఉండాలి. వారి వారి కుటుంబాల మధ్య కూడా అనుబంధం కొనసాగేందుకు రెండువైపులా కృషి ఉండాలి. దూరాన ఉన్నా ఎప్పటికప్పుడు పర స్పర యోగక్షేమాలు తెలుసుకుంటూ ఉంటే, వారి మధ్య మానసికమైన దూరం తగ్గుతుంది. ఒకరిపట్ల ఒకరు ఆప్యాయతతో వారానికో ఫోను, వీలైనప్పుడు ఆన్‌లైన్‌లో మాట్లాడుకోవడం చేయాలి. ఇలా అన్న దమ్ములిద్దరూ దూరాన్ని అధిగమించి, దగ్గర కావాలి.

### పరిసర వాతావరణం

అన్నదమ్ములు ఇంటి వాతావరణంలో ఒక వయస్సు వరకే కలిసి పెరుగుతారు. కానీ, తర్వాత చదువుల రీత్యా, ఆ తర్వాత ఉద్యోగాలు, పెళ్ళిళ్ళతో వేర్వేరు చోట్ల ఉండటంతో ఆ చుట్టూ ఉండే వాతావరణ ప్రభావమే వారిపై ఎక్కువగా ఉంటుంది. ఈ వాతా వరణం ఒక్కోసారి అన్నదమ్ముల అనుబంధాన్ని విచ్ఛిన్నం చేసేలా కూడా ఉండొచ్చు. చుట్టూ ఉన్న పరిస్థితుల ప్రభావానికి లోనుకాకుండా ఉండాల్సిన బాధ్యతను అన్నదమ్ములిద్దరూ గుర్తించగలగాలి. దాన్ని అధిగమించగలిగితే వారి మధ్య అనుబంధం ఎలాంటి తుపానులనైనా, చివరికి సునామీలు వచ్చినా చెక్కుచెదరకుండా నిలుస్తుంది.

అక్కచెల్లెళ్ళ మధ్య ఉన్నంత అనుబంధం అన్న దమ్ముల మధ్య ఉండదనేది మనకు కనిపించే జీవన సత్యం. దీనికి కారణం చుట్టూ ఉన్న సమాజ ప్రభావం వల్లే అంటారు నిపుణులు. కొన్ని కుటుంబాలు ఎవరు ఏ పని చేయాలన్నా అందరూ మాట్లాడు కుని, నిర్ణయం తీసుకుంటారు. ఎవరెవరు ఎక్కడున్నా, సంప్రదింపులు నడుస్తాయి. ఆ విధమైన అను బంధాలు బలంగా పెనవేసుకుని ఉంటాయి. చిన్నపాటి అలకలు, కోపతాపాలే తప్ప మొత్తంగా చూస్తే వారి మధ్య వ్యవహారాలు బాగానే ఉంటాయి. ఆ కుటుం బాల్లో కొత్తగా అడుగుపెట్టినవాళ్ళు కూడా అలాంటి వాతావరణంలో సఖ్యతగా ఉండడాన్ని అలవరుచు కుంటారు. అన్నదమ్ముల అనుబంధం కేవలం రక్తసం బంధం మాత్రమే కాదు, కష్టాలు, సుఖాల్లో తోడుగా నిలిచే అపూర్వ సంబంధం. విడదీయరాని అనుబంధం.

—లక్ష్మీ నర్మద

# మనిషి-పశువు

సరసి

**"పశువులు పసిపాపల్లాంటివి. ఆటిని ప్రేమతో సాకాలిగానీ కసిగా హింసించకూడదయ్యా! బిడ్డల్ని కన్నోళ్లకి తెలుస్తాది ఆ ప్రేమ. నీకూ నాకూ ఎట్టా తెలుస్తాదీ?" అంది నాగమణి భర్త వీపు సబ్బుతో రుద్దుతూ.**

**"ఎయ్యిరూపాయిలే! ఎయ్యిరూపాయలు ఏట్లో కలిసిపోయాయే ఆడివల్ల. ఎవడు తిన్న దయిందీ? ప్రేమ చూపించాలా ప్రేమ! ఈసారి ఎదుర్రావాలి దాన్నిగదరగా తలపగిలిపోద్ది! ఆ!" అన్నాడు అమ్మిరాజు ఆవేశంగా.**

"శివశివా! నీ నోరడిపోనూ ఏంటా మాటలూ? నోరులేని జీవాన్ని కొడితే పుట్టగతులుండవు. బసవడు దేవుడు!" నాగమణి మాట పూర్తిచేసేలోపే కస్సుమని లేచాడు అమ్మిరాజు. "ఛయ్ నీ.." అంటూ ఓ బూతుతిట్టి ఎదురుగా ఉన్న నీళ్ళగిన్నెని ఫెడీల్మని తన్నాడు. "ఇంకోపాలి ఆణ్ణి దేవుడన్నావో ముందు నిన్ను నరుకుతా!" అంటూ స్నానం పూర్తికాకుండానే ఒళ్ళు తుడుచుకుంటూ విసవిసా ఇంట్లోకెళ్ళిపోయాడు అమ్మిరాజు.

నాగమణికి నోట మాటరాలేదు. భర్త కోపం చూసి వణికిపోయింది. "ముదనష్టపోడు అన్నంతపనీ చేస్తాడు. బసవన్నా నిన్ను నువ్వే కాపాడుకో తండ్రీ ఈడికెదుర్రాబోకు!" అంటూ దణ్ణం పెట్టుకుంది.

***

బసవడు! బసవడి పేరుచెబితే ఆ ఊళ్ళోనేకాదు ఆ చుట్టుపక్కల గ్రామాల వారెవరూ 'ఏ బసవడూ?' అని అడగరు. 'ఓహో మన బసవడా?' అంటారు. అందరికీ అతడంత ఆప్తుడూ కావలసిన వాడూనూ!

కొన్నేళ్ళక్రితం కాలవ అవతల ఊళ్ళో వందెకరాల ఆసామి నీలంరాజుగారు అచ్చోసి వదిలేసిన ఆబోతే ఈ బసవడు! శ్రేష్ఠమైన గిత్తదూడని తెచ్చి, పూజలుచేసి, వెనకవైపు రెండు చట్టలమీదా శంఖుచక్రాలు అచ్చుపోసి వదిలారు. ఆబోతుకు అవే గుర్తులు. ఆ గుర్తులున్న గిత్తనెవరూ కట్టడి చెయ్యకూడదు. అది స్వేచ్ఛాజీవి. చేతనైతే ఇంత తిండిపెట్టి దణ్ణం పెట్టాలిగానీ బంధించడం, బాధించడం వంటివి చెయ్యకూడదు. అక్కడి ప్రజలందరికీ ఇది స్పష్టంగా తెలుసు. అప్పట్నించి బసవడు ఆ చుట్టుపక్కల ఐదారుగ్రామాల్లో యథేచ్ఛగా తిరుగుతూ ఎవరేం పెడితే అది తింటూ ఏపుగా ఎదిగాడు. గున్న ఏనుగులా బలిష్టంగా పెరిగాడు.

నిలబడితే ముందు రెండుకాళ్లూ దగ్గర పెట్టుకుని సుశిక్షితుడైన సైనికుడనిపిస్తాడు. కళ్ళు మూసుకుంటే తపస్సులో ఉన్న యోగిలా అగుపిస్తాడు. కూర్చుంటే శివుడిముందు మోకరిల్లిన నందీశ్వరుడే! కదిల్తే కైలాస శిఖరమే!!

'లేపాక్షి బసవయ్య లేచి రావయ్యా కైలాస శిఖరిలా కదిలి రావయ్యా' అన్న అడవి బాపిరాజుగారి



# నవ్యవీక్లి-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతి సాహితి కథల పోటీలో విశేష బహుమతి రూ.5,000 పొందిన కథ

కవిత తలపుకొస్తుంది కూర్చున్న బసవణ్ణి చూస్తే!

బసవన్న నడిచి వస్తూ ఉంటే ఆ ఠీవి, రాజసం చూసి తీరాల్సిందే! పైకీ కిందకీ ఊపుతున్న తల, తరంగంలా ఊగుతున్న గంగడోలు, అటూఇటూ నర్తిస్తున్న మోపురం, లయగా పడుతున్న కాలి అడుగులు...ఆ సుందర దృశ్యాన్ని చూస్తూ అటుగా వెళ్తున్న పాదచారులు తమ పనులుకూడా మరచి పోయి బసవణ్ణి అనుసరిస్తూ వెళ్ళిపోతారంటే అది అతిశయోక్తికాదు.

'అచ్చోసిన ఆబోతు' అంటే ఆ ఊళ్ళో అది నింద కాదు. పొగడ్త! బసవడివల్లే ఆ మాటలకు కీర్తి వచ్చింది. ఎందుకంటే అతడివన్నీ మంచి లక్షణాలే! ఆకలేసినా ఏ చేనులోనూ అడ్డం పడి గడ్డి మేయడు. గడ్డి పరకలైనా, అన్నం మెతుకులైనా ఎవరైనా తెచ్చి ముందుపెడితేనే తింటాడు. లేకపోతే ఆరోజు అతడికి శివరాత్రే! అంతెత్తున చూడటానికి గంభీ రంగా ఉన్నా పరమ సాధువు. చిన్నపిల్లలు సైతం చేరువకెళ్ళి గంగడోలును చేత్తోరాస్తే మోరపైకెత్తి తన ఆనందం వ్యక్తం చేస్తాడు.

బసవడంటే శివుడి వాహనం అనీ, ఊరు చల్లగా ఉండాలంటే బసవన్నని భక్తితో పూజించా లనీ కొందరు భక్తులు బసవడి మెడలో శివలింగం బొమ్మ వేలాడదీసి, వీబూది రేఖలుదిద్ది, బొట్లుపెట్టి దండాలు పెట్టేవారు. అవతల వీధిలో రామాలయం పూజారిగారు 'శంఖుచక్రాలు అచ్చోసిన ఆబోతు శివుడికి వాహనం ఎట్లా అవుతుందీ, అది విష్ణుమూర్తి వాహనమే' అని గుడికొచ్చిన భక్తులతో వాదించే వారు. దాంతో ఊరుకోక రామాలయంవైపు బస వడు వచ్చినప్పుడల్లా అతడి నుదురు మీద తిరునామం దిద్ది హారతిచ్చేవారు. ప్రదక్షిణించేసి వెనకవైపున్న శంఖుచక్రాలకి దణ్ణం పెట్టుకునేవారు.

'ఎంత మాత్రమున ఎవ్వరు తలచిన అంత మాత్రమే నీవు..' అన్న అన్నమయ్య మాటల్ని నిజం చేశారు ఆ ఊరువాళ్ళు. ఎవరికివారే బస వన్న మా వాడు అనుకుని ఆదరించారు.

ఇది ఇలాఉండగా, 'బసవన్న' అనగానే రైతు లకు ముందుగా గుర్తుకొచ్చే విషయం ఒకటుంది. అది ఆ ఆబోతుకున్న ఒక విలక్షణమైన లక్షణం! ఎడ్లుకట్టిన బండి కనిపిస్తే చాలు కోపంతో బుసలు కొడ తాడు! పరుగెత్తుకుంటూ వెళ్ళి తన బలమైన కొమ్ముల్తో కుమ్మి ఆ బండిని తిరగబడేలా తోసేస్తాడు! అలా బండిపై దాడిచేసే సమ యంలో ఆ ఆబోతును ఆపడం ఎవరి తరమూ కాదు. 'ఎందుకీ ఆబోతు ఇలా విచి త్రంగా ప్రవర్తిస్తోందీ' అని ప్రజలు ఆశ్చ ర్యపోయేవారు. చర్చోపచర్చలు జరి గాయి. ఎవరికి తోచిన వ్యాఖ్యానాలు వాళ్ళు చేశారు. తోటి పశువులకి అన్యాయం జరుగుతూ ఉంటే చూసి సహించలేక ఇలా దాడి చేస్తోందని చివరికి కొందరు విజ్ఞులు నిర్ధారించారు. బళ్ళు కట్టి బరువులు లాగించటం, వాటి స్వేచ్ఛకి భంగం కలి గించడం, వాటిని హింసించడం వంటివి బసవడు సహించడని తేల్చేశారు చివరికి. అది నిర్ధారణ కూడా అయింది.



బళ్లుకట్టి వెడుతున్నప్పుడు బసవడు ఎదురుపడ గానే రైతులు ఎద్దుల మెడమీద నుంచి కాడిదించి, ఎద్దుల్ని బంధవిముక్తుల్ని చేసి చూశారు. అంతే! బసవడు కిమ్మనకుండా పక్కనుంచి వెళ్ళిపోయాడు.

బసవడి ఆగ్రహానికి కారణం తెలుసుకున్న రైతులు అప్పటినించి అతడికి మర్యాదనిస్తూ అత డెప్పుడు తారసపడినా ఎద్దుల్ని బండి నుంచి విడి పించి, బండి కాడిని దించేవారు. బసవడు వెళ్ళి పోయాక తిరిగి బండికట్టి ముందుకు సాగిపోయే వారు. ఇది రైతులకూ బసవడికీ మధ్య కుదిరిన ఒప్పందం కావచ్చు అవగాహన కావచ్చు. ఈ ఏర్పాటు వల్ల అటు రైతులుగానీ, ఇటు బసవన్నగానీ పట్టు దలకి పోకుండా సమస్యను శాంతియుతంగా పరి ష్కరించు కున్నట్లయ్యింది. ఇందుకు విరుద్ధంగా ఏనాడూ ఏ రైతూ మొండిగా బసవణ్ణి ఎదిరించిన సందర్భంలేదు. బసవడు కూడా రైతులు తనపట్ల చూపిస్తున్న మర్యాదను కాదని దాడిచేసిన సంద ర్భమూ లేదు.

అయితే, ఒక పశువుకి భయపడి బండికట్టడం మానేస్తామా? తోటి పశువుల కష్టాలు అర్థం చేసు కునేటంత తెలివి ఓ పశువుకుంటుందా? అంటూ తరువాతకాలంలో కొందరు ప్రశ్నిస్తూ వచ్చారు. కొందరు ఇలా ప్రశ్నలతో వదిలిపెడితే మరికొందరు ఆ ఆబోతుకు బుద్ధి చెప్పాలనీ, కాలో చెయ్యో విర గ్గొడితేగాని బుద్ధిరాదనీ వాదించసాగారు. అలా వాదించే వారిలో అమ్మిరాజు ఒకడు!

'ఎందుకయ్యా గొడవ? ఊరందరిదీ ఒకదారి ఉలిపికట్టెదొకదారీ అన్నట్టుంటావేం? బసవడు కని పించిన కాసేపూ కాడిదించితే పోలా? ఎందుకు విరోధ పడతావూ?' అని నాగమణి భర్తకి చాలాసార్లు చెప్పి చూసింది. ఆ మాటలు అమ్మిరాజు చెవికెక్కలేదు.

బండికట్టిన ప్రతిసారీ బసవన్నని ఎదుర్కోడానికి సిద్ధంగానే ఉండేవాడు అమ్మిరాజు. ఒకసారి టౌను నుంచి యూరియా బస్తాలు వేసుకుని తను, కృష్ణ మూర్తి రెండు బళ్ళమీద వస్తూ ఉండగా బసవడు ఎదురుపడ్డాడు.

కృష్ణమూర్తి వెంటనే బండిదిగి, చిరతలు తీసి, ఎద్దుల భుజాల మీదనుంచి కాడిదింపి నిలబ డ్డాడు. అతడి బండికి ముందున్నది అమ్మిరాజు బండి. బండి తొట్లోంచి పొడవాటి ఇనప కమ్మి తీసి, కిందకి ఉరికాడు అమ్మిరాజు. బసవడివైపు చూస్తూ ఆయుధంతో సిద్ధంగా నిలబడ్డాడు. అంతేగాని బండి నుంచి ఎద్దుల్ని విడిపించ

లేదు. అతడికా ఉద్దేశమేలేదు. బసవన్నతో అమీ తుమీ తేల్చుకోవాలన్నదే అతని నిర్ణయం.

"రా! ఈవేళ నువ్వో నేనో తేలిపోవాలి!" గట్టిగా అరిచాడు అమ్మిరాజు.

బసవడు బెదరలేదు, బెసకలేదు. వేగంగా అడు గులు వేస్తూ ముందుకొచ్చాడు. రానిచ్చి రానిచ్చి అదను చూసుకున్న అమ్మిరాజు చేతిలో వున్న ఇనప కమ్మీతో బసవడి నెత్తిమీద బలంగా ఒక దెబ్బ కొట్టాడు.

అంతే! ఆ దెబ్బకి బసవన్న కళ్ళు బైర్లుకమ్మాయి. నుదిటిమీద నుంచి రక్తం చిప్పిల్లింది. ఒక్కక్షణం అలా నిలబడిపోయి వెంటనే తమాయించుకుని ముందుకుదూకాడు. బండి చక్రంలో తలపెట్టి బలంగా కుమ్మేశాడు. ఎడ్లకికట్టిన తాళ్ళు తెగిపోయాయి. అవి భయంతో పక్కనున్న పొలాల్లోకి పారిపోయాయి. యూరియా బస్తాలతోసహా బండి పక్కనున్న పిల్ల కాలవలోకి దొర్లిపోయింది!

బసవడిని కొట్టడం అయితే కొట్టాడుగానీ ఆ ఊపుకి బేలన్సు తప్పి పక్కకి పడిపోయాడు అమ్మి రాజు. ఆ పడిపోవడంలో నడుముపట్టేసింది. వెంటనే లేవలేకపోయాడు.

బండిని పడగొట్టేసి తలతిప్పి అమ్మిరాజువైపు చూశాడు బసవడు. నాలుగడుగుల దూరంలో లేవలేని స్థితిలోఉన్న అమ్మిరాజు మృత్యువుకి రెండ డుగులదూరంలో ఉన్నానని గ్రహించాడు. తనకిక భూమ్మీద నూకలు చెల్లిపోయాయి!

బసవడు తలచుకుంటే ఆ క్షణంలో అతడి కాలి గిట్టల కింద నలిగిపోయే చీమే అయ్యేవాడు అమ్మి రాజు! శివుడాజ్ఞ కాలేదేమో బతికిపోయాడు!

గట్టిగా ఒకసారి బుసకొట్టి బసవడు ముందుకు సాగిపోయాడు తలమీద రక్తపు ధారలతో.

అంతవరకూ ఆపక్కనే నిలబడి ఆందోళనగా చూస్తున్న కృష్ణమూర్తి పరుగునవచ్చి అమ్మిరాజును లేవదీశాడు. ఇద్దరూ పుంతలోపడ్డ బండివైపు వెళ్ళారు. బండిని బయటకు లాగడం ఇద్దరివల్ల అయ్యే పనికాదు.

"ముందు యూరియా బస్తాలు తీద్దాం పట్టు" అంటూ పంచె ఎగ్గట్టి నీళ్ళల్లోకి దిగాడు అమ్మి రాజు. అప్పటికే బస్తాల్లో యూరియా కరిగిపోయి నీళ్ళ బస్తాల్లా అవి బుసబుసలాడాయి.

అమ్మిరాజు గొల్లుమన్నాడు. "ఎయ్యి రూపాయలు! ఎయ్యి రూపాయలు ఏట్లో కలిసిపోయాయి బావా!" అంటూ కృష్ణమూర్తిని పట్టుకుని ఏడ్చాడు.

***

'బసవణ్ణి బతకనివ్వను! ఆడు చస్తేగాని నా కసితీరదు!' అమ్మిరాజు కుతకుతలాడిపోసాగాడు.

అయితే బసవణ్ణి చంపడం ఎలా! ఎవరికీ తెలియ కుండా చంపాలి. తెలిస్తే ఊళ్ళోవాళ్ళు తనని బతక నీయరు. గుట్టుచప్పుడు కాకుండా పని జరగాలి. ఎలా?

పొద్దున్నే పొలం వెడుతూ ఉంటే చినగంగయ్య ఇంటి దగ్గర జనాలు మూగి ఉండటంచూసి అటు

> **ఆ చుట్టుపక్కల ఐదారు గ్రామాల్లో బసవడంటే అందరికీ గౌరవం. చూపులకు సాక్షాత్తూ నందీశ్వరుడే. బసవడు ఎదురైతే చాలు రైతులందరూ ఎడ్లమెడ మీంచి కాడిదించి బండిని వేరుచేసి వాటికి విశ్రాంతి నిచ్చేవారు. బసవడు వెళ్ళిపోయాక మళ్ళీ బళ్ళుకట్టుకుని వెళ్ళేవారు. బసవడంటే రైతులకు ఎందుకు అంత గౌరవం? వాళ్ళమధ్య ఏదైనా ఒప్పందం ఉందా? ఏమిటా ఒప్పంద రహస్యం?**

వెళ్ళాడు అమ్మిరాజు. గంగయ్య మనవడు పదహా రేళ్ళ రవణయ్య రాత్రి పురుగుల మందు తాగా డట. చావు బతుకుల్లో ఉన్నాడు. నోట్లో నురగలు కక్కుకుంటూ మంచంమీద ఎగిరెగిరి పడుతున్నాడు. చుట్టూ చేరినవాళ్ళు వాణ్ణి నొక్కి పట్టుకుంటున్నారు శోకాలు పెడుతూ.

అమ్మిరాజు బుర్రలో దుష్ట ఆలోచనకి బీజం పడింది.

నాలుగు రోజులు గడిచాయి. ఆ రోజు ఊళ్ళో ముత్యాలమ్మతల్లి జాతర. అమ్మవారికి నైవేద్యాలు పెడుతున్నారు గ్రామంలో స్త్రీలందరూ. అమ్మవారి గుడిదగ్గరే ఉన్న బసవడికి కూడా ప్రసాదం పెడు తున్నారు అందరూ.

నాగమణికూడా ప్రసాదం సిద్ధంచేసి పట్టుకెళ్ళింది. చిన్న ప్లాస్టిక్ సంచిలో పురుగులమందుపోసి మూతి బిగించికట్టి దాన్ని అన్నం మధ్యలో కనబడకుండా పెట్టి నాగమణిచేత బసవడికి పెట్టించాడు అమ్మి రాజు. బసవడు గరళం మింగాడు. అమ్మిరాజు ఆనందం అంబరాన్నంటింది.

ఊరంతా జాతర కోలాహలం! గరగలెత్తుకున్న వాళ్ళ నృత్యాలు, వీధుల్లో విహరిస్తున్న పగటి వేషాలు, వాటి వెంటే బ్యాండు మేళాలు, లౌడు స్పీకర్లలో పాటలు, వాటితోబాటు కొత్త బట్టలు కట్టుకుని మీసాలు మెలేస్తూ తిరుగుతున్న మగరా యుళ్ళూ, పట్టుచీరలు కట్టుకుని పట్టరాని సంతో షంతో రెపరెపలాడుతున్న ఆడవాళ్ళూ, అల్లరిచేస్తూ హడావుడి చేస్తున్న పిల్లగాళ్ళూ...ఇలా ఎవరి ఆనం దంలోవాళ్ళు మునిగితేలుతున్నారు. ఒక్క అమ్మిరాజు మాత్రం తన పనిమీదనే ఉండి బసవన్నమీద ఓ కన్నువేసి దూరం దూరంగా తిరుగుతున్నాడు. అతడికి క్షణాలు యుగాలుగా గడుస్తున్నాయి.

బసవడు మెల్లగా నడుస్తూ గుడి కోలాహలం నుంచి బైటికొచ్చాడు. అడుగులలో అడుగు వేసు కుంటూ ఊరి పొలిమేరల కొచ్చాడు. అతడి అడు గులు తడబడుతున్నాయి. కాలవగట్టుకి చేరుకునే సరికి అతడిపరిస్థితి మరీ దిగజారింది. నిలబడలేని స్థితికొచ్చాడు. అయినా కష్టంమీద ముందుకు వెళ్ళా లని బసవడి తాపత్రయం.

ఎక్కడికి వెళ్ళాలని? ఎదురుగా గట్టుమీద రావి చెట్టు. చెట్టు కింద శివలింగం. పక్కనే రేవు.

భారంగా శరీరాన్ని కదుపుతూవెళ్ళి రేవుగట్టు మీద కూలిపోయాడు. రావిచెట్టుమీది కాకులు కకా వికలమై కేకలు వేశాయి! ఆకులు అల్లల్లాడాయి.

బసవడు అతికష్టంమీద లేచే ప్రయత్నం చేశాడు గానీ సాధ్యం కాలేదు. అప్పటికే అతని శరీరం వణుకుతోంది. కొద్ది కొద్దిగా కదులుతూ గట్టు అంచుకు చేరుకున్నాడు. జారి దొర్లిపోయి కాల వలో పడిపోయాడు!

మామూలు పరిస్థితుల్లో అనేకసార్లు ఆ కాలవ ఈదినవాడే బసవడు. కానీ ఇప్పటిపరిస్థితి వేరు. కాళ్ళూ చేతులూ కదపలేని స్థితిలో నీళ్ళల్లో మునిగి పోయాడు. వలయాలుగా ఏర్పడ్డ కెరటాలు బసవ న్నని కప్పేసి మాయమైపోయాయి. బసవడు కాల వలో కలిసిపోయాడు!

జాతరలో బసవడి నుదుటదిద్దిన కుంకుమ, కొమ్ములకు చుట్టిన బంతిపూల దండలు, నీళ్ళమీద తేలాయి! ప్రశాంతంగా ప్రవాహంలో కొట్టుకుపోయాయి!

రెండురోజుల తర్వాత పొద్దున్నే ఊళ్ళోకి ఎవరో కబురు మోసుకొచ్చారు. లాకులదగ్గర బసవడి శవం తేలిందట! లాకుల తలుపులకి అడ్డం పడిందట!

ఊరు గొల్లుమంది! ఎక్కడి పనులు అక్కడ వదిలి పెట్టి ఊరందరూ పరుగులు పెట్టారు. అప్పటికే బసవడి పార్థివ దేహం ఉబ్బిపోయింది. తాళ్లుకట్టి అదే కాలవలో వెనక్కి లాక్కొచ్చి బయటకు తీశారు.

ఆ రోజు ఊరంతా శోక సముద్రమే అయింది. ఏ ఇంట్లోనూ పొయ్యి వెలగలేదు. పిల్లలతోసహా ఎవరూ మెతుకు ముట్ట లేదు.

బసవడెలాపోయాడు?! ఏ జబ్బూ లేకుండా ఇంత హఠాత్తుగా ఎందువల్ల పోయాడు?

'విష ప్రయోగం జరిగింది' అన్నాడు పశువుల డాక్టరు మృతదేహం పరీక్షించి.

ఎవరు పెడతారు విషం? ఎవరికతడిపైన ద్వేషం?



అందరి దుఃఖం కట్టలు తెంచుకుంది.

'మందుపెట్టినవాళ్ళ చేతులు పడిపోనూ. ఆళ్ళ కుటుంబం సర్వనాశనం అయిపోనూ' అంటూ ఆడవాళ్ళు శాపనార్థాలు పెట్టారు.

రోడ్డువారగా పంటపొలంలో ఒకచోట పెద్దగొయ్యి తవ్వి అందులో ఉప్పు పాతర వేశారు బసవణ్ణి!

ఆ సాయంత్రం పంచాయతీ ఆఫీసుదగ్గర సంస్మరణ సభ ఏర్పాటైంది.

ఊళ్ళోవాళ్ళు ఒక్కొక్కరూ బసవడితో తమకు గల అనుబంధాన్ని గుర్తు చేసుకున్నారు. ఆ తర్వాత సర్పంచిగారు మాట్లాడారు. ఆయన కాస్తోకూస్తో చదువుకున్నవాడు.

ప్రారంభవాక్యాల అనంతరం ఆయన ఉపన్యాసం ఇలా సాగింది. "... ప్రతి మనిషీ పొరుగువాణ్ణి ప్రేమించాలి. కష్టాల్లో ఉంటే ఎంతోకొంత సాయపడాలి. ఇవి మనం మనిషిగా చేయాల్సిన పనులు. అయితే అలా మనలో ఎంతమందిమి ప్రేమిస్తున్నాం? ఎంతమంది ఇతరులకష్టాల్లో సాయపడుతున్నాం? చదువుకున్నామనీ, నాగరికత తెలిసిన వాళ్ళమనీ అనుకునే మనలో ఎంతమంది అసలు మనిషిగా బతుకుతున్నాం? 'నరుడు నరుడౌట ఎంత దుష్కరము సుమ్మీ' అన్నాడొక మహాకవి.

మనిషి మనిషిగా బతకడమే దుర్లభం అవుతున్న ఈ రోజుల్లో ఒక పశువు, నోరులేని జంతువు సాటి జంతువులపట్ల సానుభూతి చూపించడమే కాకుండా, వాటికి జరుగుతున్న అన్యాయాలకి వ్యతిరేకంగా పోరాడటం ఎంత గొప్పవిషయం! దీన్నిబట్టి మనల్ని మనం ప్రశ్నించుకోవాలి ఎవరు మనిషి ఎవరు పశువు అని!

మూగజీవాలను హింసించడం ఘోరం అని తెలిసినా మనం మన స్వప్రయోజనాలకోసం ఆ కనీసధర్మాన్ని మంట కలిపేస్తున్నాం. వేరే విషయాలేవీ నేను మాట్లాడడం లేదు. దేనికి వ్యతిరేకంగా బసవన్న ఉద్యమించాడో దాన్ని గురించే చెబుతున్నా! ఎడ్లు వేగంగా పరుగెత్తాలని వాటిని ముల్లుగర్రతో పొడుస్తున్నాం. అవి బాధతో విలవిల్లాడుతున్నా మనం పట్టించుకోం. తోకలు మెలిపెట్టి, కమ్చీకర్రలతోకొట్టి హింసకి గురిచేస్తున్నాం. ఇవేకాదు, కాడి రాపిడికి మెడలు వొరుసుకుపోయి పుండ్లు పడితే కనీసం ఆ పుండ్లు మానేంతవరకూ అయినా బండికట్టడం మానుతున్నామా? అదే మెడమీద కాడిపెట్టి బండికట్టి బరువులు లాగిస్తున్నాం. ఆ సమయంలో అవి పడేబాధ గురించి ఎప్పుడైనా ఆలోచించామా? నోరులేని జంతువు ఏడిస్తే వినగలిగే చెవులున్నాయా మనకీ?

వీటికి వ్యతిరేకంగానేకదా బసవన్న ఉద్యమం చేసిందీ! అప్పుడు మనం పట్టించుకోలేదు. ఆ బాధలపై మనం దృష్టి పెట్టడానికి చివరికి అతడు ప్రాణత్యాగం చెయ్యాల్సి వచ్చింది.

కేవలం తన తోటి పశువుల్ని బాధించవద్దనీ, ప్రేమించమనీ చెప్పిన పాపానికి మనం బసవన్నకి విషంపెట్టి చంపేశాం! ఇదీ మన మానవత్వం! ఇదీ మన నాగరికత!"

సర్పంచిగారి మాటలు రైతులగుండెల్లో శూలాల్లా గుచ్చుకున్నాయి.

'అయ్యా దయచేసి ఆపండి. నా కడుపు తరుక్కుపోతోంది. బసవడికి అన్యాయం చేశాం. అతడికే కాదు మనలో కొందరు మీరు చెప్పినట్లు ఎడ్లకి కూడా అన్యాయం చేస్తున్నారు. ఈ రోజునుంచి ఎడ్లను బాధపెట్టం! మా బిడ్డల్లా చూసుకుంటాం! బసవడి మీద ఒట్టు!" అన్నాడొక రైతు లేచినిలబడి. కూర్చున్న రైతులందరూ ఒక్కసారిగా లేచి చేతులు పైకెత్తి మూగజీవాల్ని హింసించబోమని! ప్రతిజ్ఞ చేశారు. సభ ముగిసింది. అప్పటికి బాగా పొద్దుపోయింది.

అందరూ తమతమ ఇళ్ళకు చేరుకున్నా ఒకే ఒక వ్యక్తి మాత్రం కదలకుండా అక్కడే చీకట్లో మిగిలిపోయాడు. అతడే అమ్మిరాజు!

సర్పంచిగారు చెప్పిన ప్రతిమాటా అతడి చెవుల్లో ప్రతిధ్వనిస్తోంది. ఆ విషయాలెప్పుడూ అతడికి తోచినవి కావు. బసవడి గురించి సద్భావం లేకపోవడంవల్ల అతడి గొప్పదనం గురించి ఎప్పుడూ ఆలోచించే అవకాశం తనకి లేకపోయింది.

'తనకి అపకారం చేసినవాడు చేతికి చిక్కినా పగతీర్చుకోకుండా క్షమించి వదిలేశాడు బసవడు. ఆరోజు అతడు తలుచుకుంటే నేను బతికుండేవాడినా? కాని నాకు ప్రాణభిక్ష పెట్టాడు. ప్రాణభిక్ష పెట్టిన ఓ నోరులేని పశువుకి నేను విషంపెట్టి చంపేశాను! అప్పుడు నేను పశువునయ్యాను! అవును! నేను పశువునయ్యాను కాబట్టే తోటి పశువులపై ప్రేమ చూపించే బసవన్న నన్ను చంపకుండా వదిలేశాడు. నేను మనిషిని కానే కాను, పశువును! పశువును!' అనుకున్నాడు అమ్మిరాజు.

ఒకసారికాదు రెండుసార్లు కాదు వందలసార్లూ వేలసార్లూ రోజుల తరబడి అనుకున్నాడు. అది చిత్తంమీద పనిచేసింది. చివరకు చిత్త చాంచల్యానికి దారితీసింది.

బసవన్నపోయిన రెండునెలలకి అతడిని పాతరవేసిన చోట ఓ స్మారకమందిరం వెలిసింది! ఎకరానికి ఒక బస్తా ధాన్యం చొప్పున చందాలు వేసుకుని ఆ మందిరం నిర్మించుకున్నారు గ్రామస్థులంతా కలసి.

నాలుగుస్తంభాల మధ్య బసవడి సిమెంటు విగ్రహం తయారుచేయించి నిలబెట్టారు. బసవడు పోలేదు మన మధ్యే ఉన్నాడు అనుకుని ఆనందపడ్డారందరూ. బసవడు మోర పైకెత్తి రోడ్డువైపే చూస్తూ నిలబడ్డాడు. అదే ఠీవి అదే రాజసం!

బసవడు చూస్తున్నాడన్న నమ్మకంతో రైతులు అప్పటివరకూ అతడికిచ్చిన మర్యాదనీ గౌరవాన్నీ చిత్తశుద్ధితో కొనసాగిస్తూ వచ్చారు! ఆ రోడ్డుమీద ఎడ్లబళ్లు ఎప్పుడువెళ్ళినా ఎద్దుల్ని కొద్దిసేపు బంధవిముక్తుల్ని చెయ్యడం, బండికాడి దింపి వెళ్ళడం ఒక సంప్రదాయంగా పెట్టుకుని ఆచరించసాగారు!

అమ్మిరాజు బసవన్నకాళ్ల దగ్గరే కూర్చుని దారినపోయేవాళ్లు ఏదైనా పెడితే తింటున్నాడు. లేకపోతే చేలో గడ్డి పరకలు తెచ్చుకుని నవుల్తున్నాడు!

***సెల్: 94405 42950***



## తమ్మూకు తెలిసే జరిగిందట!

'బాహుబలి 2'లో తమన్నా యుద్ధాలు గ్రా చేసిందన్న వార్తలు ఆ మధ్య బాగా వినిపించాయి. దానికి తగ్గట్టే తమన్నా కూడా తాను కత్తి యుద్ధం, గుర్రం స్వారీ నేర్చుకున్నాననీ వాటిని 'బాహుబలి 2'లో చూపిస్తానని గొప్పలు చెప్పింది. చివరికి ఈ సినిమాలో తమన్నా చెప్పిన సన్నివేశాలేవీ లేవు. ఏదో నామ్‌కే వాస్తే అన్నట్టు కనిపించింది. తన పాత్ర నిడివి తగ్గించినందుకు తమన్నా అలిగిందన్న వార్తలు వినిపించాయి. అయితే ఆ సన్నివేశాలు తొలగిస్తున్నట్టు తమన్నాకు ముందే సమాచారం ఇచ్చారట! అలా ఎందుకు తొలగించవలసి వచ్చిందో వివరంగా చెప్పిన తరువాత తమన్నా కూడా కాంప్రమైజ్ అయి ఓకే అన్నదట! అంటే సినిమా ప్రమోషన్లలో తమన్నా పాల్గొనకపోవడానికి వేరే కారణం ఉంది తప్ప పైన చెప్పుకున్న కారణం కాదట!




# స్మార్ట్‌ఫోన్‌తో మానసిక సమస్యలు

సాంకేతికంగా అందుబాటులోకి వస్తున్న టెక్నాలజీ ఎంత సంతోషాన్ని కలిగిస్తుందో అంతకు రెట్టింపు సమస్యలను తీసుకు వస్తోంది అంటున్నారు నిపుణులు. స్మార్ట్‌ఫోన్ల కారణంగా వ్యక్తుల ప్రవర్తనలో మార్పులు, స్వయం నియంత్రణ లోపిస్తాయన్న విషయం గతంలోనే నిర్ధారణ కాగా ఇప్పుడు వాటితో మానసిక సమస్యలు వస్తాయన్న సంగతి ఇటీవల నిర్వహించిన ఓ అధ్యయనంలో వెల్లడైంది. పదకొండు నుంచి పదిహేను సంవత్సరాల వయస్సు గల పదిహేనుమంది టీనేజర్ల మీద వీరు సుదీర్ఘకాలం అధ్యయనం నిర్వహించారు. మూడు నెలల పాటు వారు స్మార్ట్‌ఫోన్‌ని రోజులో ఎంతసేపు ఉపయోగించారనే డేటాను రికార్డ్ చేశారు. పద్దెనిమిది నెలల అనంతరం వీరి మానసిక, ఆరోగ్య స్థితిని అంచనా వేశారు. వీరిలో సగం మంది దాదాపు రోజంతా స్మార్ట్‌ఫోన్‌ను ఉపయోగిస్తున్న వారే! స్మార్ట్‌ఫోన్ ఎక్కువగా ఉపయోగించే వారిలో చాలా మానసిక సమస్యలను అధ్యయనకారులు గుర్తించారు. అబద్ధాలు చెప్పడం, ఇతరులతో తరచూ పోట్లాటలకు దిగడం వంటి మానసిక సమస్యలు వీరిలో గమనించారు. దీనికి కారణం స్మార్ట్‌ఫోను ఉపయోగించడమే అని వీరు స్పష్టం చేస్తున్నారు.



## స్త్రీలలోనే డిప్రెషన్ ఎక్కువ?

పురుషులతో పోలిస్తే స్త్రీలలోనే డిప్రెషన్ ఎక్కువ అంటున్నారు పరిశోధకులు. సుమారు 90 దేశాలలో 35లక్షల మంది మీద సుదీర్ఘ అధ్యయనం నిర్వహించారు. పురుషుల కన్నా స్త్రీలే ఎక్కువగా డిప్రెషన్‌కి గురవుతున్నట్టు వీరు గుర్తించారు. స్త్రీలలో 12 సంవత్సరాల వయస్సు నుంచే డిప్రెషన్ లక్షణాలు కనిపిస్తాయనీ, 20, 25 సంవత్సరాలు వచ్చేసరికి అది మరింత ఎక్కువ అవుతుందని వారు చెబుతున్నారు. ముఖ్యంగా పురుషులతో కలిసి పనిచేసే స్త్రీలలో డిప్రెషన్ ఎక్కువగా ఉన్న విషయాన్ని వీరు గమనించారు. ఆఫీసులో స్త్రీలు తరచూ ఆందోళనకు గురవుతుంటారని, చివరికి అదే తీవ్రమైన డిప్రెషన్‌కి దారితీస్తుందని వారు స్పష్టం చేస్తున్నారు.



## నైట్ డ్యూటీతో బ్రెస్ట్ కేన్సర్!



రాత్రి సమయంలో ఉద్యోగం చేసే వారికి పలు రకాల ఆరోగ్య సమస్యలు ఉత్పన్నమవుతాయన్న సంగతి తెలిసిందే! వీటితో పాటు మరో కొత్త సమస్యను పరిశోధకులు కనుగొన్నారు. నైట్ షిఫ్టులో పని చేసే స్త్రీలు బ్రెస్ట్ కేన్సర్ బారిన పడే ప్రమాదం ఎక్కువగా ఉందని వీరు చెబుతున్నారు. మెదడులో ఉత్పత్తి అయ్యే మెలటోనిన్ రొమ్ము కేన్సర్ కణాలను అడ్డుకుంటుందనీ, అయితే రాత్రి సమయంలో పనిచేసేవారిలో మెలటోనిన్ ఉత్పత్తి బాగా తగ్గిపోతుందన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. దీని కారణంగా రొమ్ము కేన్సర్ వచ్చే అవకాశాలు పెరుగుతాయని వీరు స్పష్టం చేస్తున్నారు. అందరికీ ఈ సమస్య రాకపోయినా నలభై సంవత్సరాలు దాటిన మహిళలలో ఈ సమస్య మామూలు కన్నా కొద్దిగా ఎక్కువగా ఉంటుందని వీరు చెబుతున్నారు. నలభై సంవత్సరాలు దాటిన స్త్రీలు రాత్రి విధులకు దూరంగా ఉంటేనే మంచిదని వీరు సూచిస్తున్నారు.

## బరువు తగ్గించే అవకాడో



బరువు తగ్గాలనుకునే వారికి నిజంగా ఇది శుభవార్తే! పెద్దగా ఆహార నియమాలు పాటించకుండా, జిమ్‌లో చెమట చిందించకుండా బరువు తగ్గాలనుకునేవారు ప్రతిరోజూ తమ ఆహారంలో అవకాడోను చేర్చుకుంటే చాలు అంటున్నారు అధ్యయనకారులు. క్రమం తప్పకుండా అవకాడో తీసుకుంటే కొన్ని రోజుల తరువాత నడుము చుట్టుకొలత ఒకటిన్నర ఇంచ్‌లు తగ్గడమే కాకుండా కొన్ని కిలోల బరువు కూడా తగ్గవచ్చన్న విషయం వీరి అధ్యయనంలో వెల్లడైంది. ఇది శరీరంలో ఇన్సులిన్ స్థాయిని క్రమబద్ధీకరించడమే కాకుండా గుండె సంబంధిత సమస్యలను కూడా తగ్గిస్తుందని వారు చెబుతున్నారు. అయితే ప్రతిరోజూ ఎంత మోతాదులో దీనిని తీసుకోవాలి అన్న విషయంలో మాత్రం నిపుణుల సలహా తీసుకోవాలని వారు సూచిస్తున్నారు.

## పిల్లల్లో తెలివితేటలు పెరగాలంటే...

పిల్లలకు కచ్చితంగా రోజ్‌మేరీ సువాసన చూపించాల్సిందే అంటున్నారు పరిశోధకులు. కొంత మంది పిల్లల మీద వీరు అధ్యయనం నిర్వహించారు. పది నుంచి పదకొండు సంవత్సరాల లోపు వయస్సు కల పదిహేను మంది పిల్లలను రోజ్‌మేరీ సువాసనతో నిండిన గదిలో గంట నుంచి రెండు గంటలు ఉండనిచ్చారు. ఆ సమయంలో వారిచేత క్లాసు పుస్తకాలు, జనరల్ నాలెడ్జి పుస్తకాలు చదివించారు. మరో పదిహేను మందిని ఎలాంటి సువాసనా లేని గదిలో ఉంచారు. వారిచేత కూడా క్లాసు పుస్తకాలు, జనరల్ నాలెడ్జి పుస్తకాలు చదివించారు. రెండు గంటల అనంతరం వీరి జ్ఞాపకశక్తినీ, తెలివితేటలనూ పరిశీలించారు. రోజ్‌మేరీ సువాసన కలిగిన గదిలో ఉన్న పిల్లల్లో అంతకు ముందు లేని జ్ఞాపకశక్తిని అధ్యయనకారులు గుర్తించారు. సాధారణ గదిలో ఉన్న పిల్లల్లో ఈ మార్పును వీరు గమనించలేదు. అయితే కేవలం రోజ్‌మేరి సువాసన కారణంగానే వీరిలో ఈ మార్పు సంభవించిందా? లేక మరేదైనా కారణం ఉందా? అన్న విషయం మీద మరిన్ని పరిశోధనలు నిర్వహిస్తున్నారు.



## సరదాగా....

### భయం

రజనీష్, నీలేష్ మోటార్‌సైకిల్‌పై కాలేజ్‌కి వెళుతున్నారు. ఇంకాసేపట్లో కాలేజ్ చేరుకుంటారనగా ఎదురుగా వచ్చిన లారీకి డాష్ ఇచ్చాడు రజనీష్. అక్కడున్నవారు అంబులెన్స్‌కి ఫోన్‌చేసి, వాళ్ళిద్దరినీ ఆస్పత్రికి పంపించారు. రజనీష్ కాలికి ఫ్రాక్చర్ అవటంతో కట్టుకడుతున్నాడు డాక్టర్. బాధ భరించలేక హాస్పిటల్ దద్దరిల్లిపోయేలా కేకలు పెట్టాడు రజనీష్. తరువాత నీలేష్ దగ్గరకి వచ్చాడు డాక్టర్. అదేం విచిత్రమయ్యా, ఇద్దరికీ కాళ్ళే విరిగాయి? అని, మెల్లగా కబుర్లు చెబుతూ కట్టు కట్టసాగాడు. అస్సలు ఏమాత్రం బాధ లేకుండా కట్టు కట్టించుకుంటున్నాడు నీలేష్. దాంతో డాక్టర్ రజనీష్‌తో, "నీ ఫ్రెండ్‌ని చూడు...అస్సలు అరవడం లేదు" అని ఇంకా ఏదో అంటుండగానే, నీలేష్ "రజనీష్ అరిచిన అరుపులకు భయపడి విరిగిన కాలుకి బదులు బావున్న కాలుకి కట్టు కట్టించుకుంటున్నానయ్యా డాక్టరూ." అన్నాడు. ఈసారి కేకలు పెట్టడం డాక్టర్ వంతయింది.

### ఒక ప్రశ్న?

సోమశేఖర శర్మ గణితశాస్త్రంలో దిట్ట. గణితావధాని. ఏ సమస్యని ఎటునుంచి ఎటువైపు తిప్పి ఇచ్చినా ఇట్టే పూరించేస్తారాయన. అలాంటి మహాగణిత ఉద్ధండుడికి ఒక్కడే పుత్రరత్నం. పేరు శ్రీహర్ష చక్రవర్తి. ప్రపంచ ప్రప్రథమ మహాగణిత శతావధానిగా పేరుగడించిన కానాల శ్రీహర్ష చక్రవర్తి పేరునే తన కొడుక్కి పెట్టుకున్నాడాయన. తండ్రంతటివాడు కాకపోయినా ఏదో అతడు కూడా కాస్తో కూస్తో గణితావధానంలో పట్టు సంపాదించాడు. కాలం ఎవరికోసమూ ఆగదు కదా... సోమశేఖర శర్మ మరణించాడు. గణితావధానాలతో జీవనప్రయాణం సాగిస్తున్నాడు చక్రవర్తి. ఒకనాడు పక్కూర్లో ఉన్న ఓ పెద్ద ఆడిటోరియంలో చక్రవర్తి అవధానం ఏర్పాటు చేశారు. సమస్యా, పూరణం సంతృప్తికరంగా సాగుతున్నాయి. ఇంతలో ఆ ఊరి ప్రభుత్వ పాఠశాలలో గణిత ఉపాధ్యాయుడిగా పని చేస్తున్న మురళీధర్ "ఒకటి నుంచి తొమ్మిదివరకు గల అంకెల్ని రెండు గ్రూపులుగా విభజించాలి. మొదటి గ్రూపులోని అంకెల మొత్తం రెండో గ్రూపులోని అంకెల మొత్తానికి సమానంగా ఉండాలి. నిబంధన ఏంటంటే ఆరుని తిరగేసి రాయకూడదు." అని సమస్య ఇచ్చి కూర్చున్నాడు. అవధానిగారు వెంటనే సమస్యాపూరణం గావించి తన పాండిత్యాన్ని నిరూపించుకున్నారు. అవధానిగారే కాదు మీరు కూడా సమాధానం ఇవ్వగలరు. ప్రయత్నించండి.

**సమాధానం**

1+2+3+4+5+6 = 7+8+6

6ని తిరగేసి రాయకూడదు అన్నారు గానీ 9ని తిరగేసి రాయవచ్చు కదా! 9ని తిరగేసి రాసి అంకెలను రెండు గ్రూపులుగా విభజించవచ్చు.












# వెట్టి (ది వారియర్)

-మధుబాబు




**'ఎవరు అన్నయ్యా ఈ పిల్లగాడు? దబాయించేస్తున్నాడేంటి?' వెట్టి చెవిదగ్గర నోరు పెట్టి చిన్నగా అడిగాడు రవీంద్ర బావమరిది.**

**'ఇరుకుగా ఉంటుంది బాబీ. ముందున్నది అంతా పరమ చెత్త దారి. ఎగిరెగిరి పడుతుంది బండి. నువ్వు కూడా ఎగిరి అవతల పడిపోతావు' తలను పక్కకు తిప్పి బాబీని హెచ్చరించాడు వెట్టి.**

'ముగ్గురున్నారు మీరు. పడితే వెంటనే పట్టుకోవచ్చు. పోనీ బండిని' అంటూ బండోడి నడుము చుట్టూ చేతులు చుట్టి ఇంకాస్త సర్దుకు కూర్చున్నాడు బాబీ.

'బుల్లెట్ బండే కదన్నయ్యా. ఈ మాత్రం బరువును భరించలేక పోవటం ఏమిటీ? పోనీ' తను కూడా అతనికి వత్తాసు పలికాడు బండోడు.

'మనం పఠాన్‌గాడిని, వాడి చంచాలని పట్టించిన ప్రదేశం ఎక్కడ ఉన్నదో గుర్తుకు తెచ్చుకో. మనం వెళుతున్నది అక్కడికే' అంటూ అతనికే చెప్పి, బండిని కదిలించాడు వెట్టి.

రాయల్ ఎన్‌ఫీల్డ్ బుల్లెట్ బండి ఎటువంటిదో అప్పుడు తెలిసి వచ్చింది అందరికీ.

ఏనుగు మీద ఈగ వాలితే ఎటువంటి ఎఫెక్ట్ వస్తుందో సరిగ్గా అటువంటిదే కనిపించింది. తడబడలేదు బండి. తొణికిసలాడలేదు. అంతకుముందు కంటే మరింత స్మూత్‌గా, ఇంకాస్త స్టడీగా పరుగు మొదలుపెట్టింది.

***



ఏడువారాల నగలు అలంకరించుకున్న రాకుమారి మాదిరి తయారైంది ప్రణవి. తళతళ మెరిసిపోతున్న పట్టుచీరలో దేవకన్యక మాదిరి కనిపించింది.

ఆమె కోసం తయారు చేయించిన నగల్నేకాదు భర్తపోయిన వెంటనే పిచ్చమ్మి తీసి అవతల పడేసిన నగల్ని, తన పుట్టింటి వారు తనకు పెట్టి పంపించిన నగల్ని, తరతరాలుగా ఆ వంశంలోని కోడళ్ళు అందరూ ధరించిన పాతకాలపు నగల్ని, అన్నింటినీ బయటికి తీసి ఆ పిల్లకు దిగవేసింది శివారెడ్డి భార్య.

'పైనుంచి కిందిదాకా నగలే కనిపిస్తున్నాయి. ప్రణవి ముఖం కనిపించటం లేదు' చూసి చూసి ఉండబట్టలేక కామెంట్ చేసింది ప్రత్యూష.

'మా ఇంటి ఆడబిడ్డ ఎటువంటిదో అందరికీ తెలియాలి. ముఖం కనిపించకపోయినా ఫరవాలేదు. ఇవన్నీ ఉండాల్సిందే' కరాఖండీగా చెప్పి, ప్రణవిని డైనింగ్ హాల్లోకి తీసుకువచ్చింది ఆమె.

చిద్విలాసంగా కూర్చుని ఉన్న పిచ్చమ్మి కళ్ళు చెమ్మగిల్లాయి కూతుర్ని చూడగానే. గబుక్కున లేచి గట్టిగా కౌగలించుకుని, సరాసరి శివారెడ్డి గదిలోకి తీసుకుపోయింది.

'చూడరా... సరిగ్గా చూడు.. నీ చెల్లెలు..' అంటూ బెడ్ దగ్గర నిలబెట్టింది.

చటుక్కున బెడ్ మీదినుంచి దిగాడు శివారెడ్డి. అంతకుముందు ఎప్పుడూ అలా జరగకపోవటంతో అదిరిపడ్డాడు పొద్దున్నే వచ్చిన ఇంకో డాక్టరు. 'అయ్యయ్యో.. దిగకూడదు సారూ.. మీరు కదలకూడదు' అంటూ బలవంతంగా ఆపబోయాడు.

రకరకాల ట్యూబులు, వైర్లు కనెక్ట్ అయి ఉన్నాయి అతని బాడీకి. పక్కనే ఉన్న ఏవేవో ఎలక్ట్రానిక్ పరికరాలన్నీ అతను ఒక్కసారిగా కదిలేసరికి గడబిడ చేయటం మొదలెట్టాయి.

డాక్టరు తనను తిరిగి బెడ్ మీదికి చేర్చకముందే, తనే తనచేతులతో ఆ ఎక్స్‌టెన్షన్లన్నిటినీ పరపరా పీకి అవతల పడేశాడు శివారెడ్డి.

'నా చెల్లెమ్మ పెళ్ళి జరగబోతుండగా, నేను దిక్కూ-మొక్కూలేని వాడి మాదిరి బెడ్‌మీద వాటన్నిటినీ తగిలించుకుని పడుకోవటం జరగదు. చచ్చి పోవాల్సి వస్తే నా చెల్లి తలమీద అక్షింతలు వేసిన తర్వాతనే జరుగుతుంది ఆ పని' అంటూ ప్రణవి బుగ్గల్ని నిమిరాడు.

'బాజిరెడ్డి ఒత్తిడికి నేను ఎందుకు వంగిపోతున్నానో ఈసరికి అమ్మ నీకు చెప్పే ఉంటుంది. నన్ను చేతకాని వాడిగా అనుకుంటూ ఉండి ఉంటావు. క్షమిస్తావా నన్ను?' ఆర్ద్రంగా అడిగాడు.

అయిష్టంగానే అలంకరణలు చేయించుకున్నది ప్రణవి. ఏ మాత్రం సందుదొరికినా తన అయిష్టాన్ని అందరి ముందు పెద్దకంఠంతో బయల్పరచటానికే సిద్ధపడి ఉంది. ఒక్కసారిగా బుగ్గల మీదికి వచ్చేశాయి కన్నీళ్ళు. లేచి నిలబడిన శివారెడ్డి గుండెల మీద తలపెట్టుకుని బావురుమన్నది.

శివారెడ్డి కళ్ళు కూడా వర్షించబోతుండగా



కల్పించుకున్నది పిచ్చమ్మి... 'నోళ్ళు ముయ్యండి మీరిద్దరూ. శుభకార్యం జరగవలసిన ఇంట్లో ఏడుపులు మొత్తుకోళ్ళు చూడటానికి అసహ్యంగా ఉంటాయ్. హాల్లోకి నడవండి' ఖంగుమంటున్న కంఠంతో హెచ్చరించింది.

శివారెడ్డి... బెడ్ మీదినించి దిగలేని శివారెడ్డి, ఆక్సిజన్ మాస్క్ దగ్గర లేకపోతే గిలగిలలాడి పోయే శివారెడ్డి ఎన్నో నెలల నుంచీ బెడ్ మీది నుంచి కాలు కింద పెట్టకపోయినా, అదొక సమస్యే కాదన్నట్టు చెల్లెలి భుజం చుట్టూ చేతులు చుట్టి తనే తీసుకుపోయాడు హాల్లోకి.

బాండ్ మేళాన్ని, సన్నాయి వాద్యగాళ్ళని మాత్రమే కాదు వేరే పనివాళ్ళను కూడా పురమాయించాడు బాజిరెడ్డి. కల్యాణమండపం మాదిరి అలంకరించబడుతోంది ఆ హాలు.

'ఏడి బాజిరెడ్డి? ఇంకా రాలేదు?' ఒక కుర్చీలో ప్రణవిని కూర్చోబెట్టి తను పక్కన కూర్చుంటూ అడిగాడు శివారెడ్డి.

'గేటు బయట ఉన్నారు సారూ... ఎవరో కొత్త మనుష్యులు.. బాజిరెడ్డి సారుకు అడ్డంగా నిలబడి అరుపులు కేకలు..' నెమ్మదిగా వచ్చి వినయంగా చెప్పాడు శివారెడ్డి పరిజనంలో ఒక వృద్ధుడు.

తల తిప్పి భార్యవైపు చూశాడు శివారెడ్డి.

## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. రాయుడిపల్లిలో చౌడేశ్వరి విగ్రహానికి జరిగిన అపచారమేమిటో తెలుసుకుంటాడు వెట్టి. తిరిగి కదిరికి బయలుదేరిన వెట్టికి చౌడేశ్వరి ఆత్మశిల కనిపిస్తుంది. కడపనుంచి హైమారెడ్డి ఫోన్ చేసి, శివారెడ్డిని హెచ్చరిస్తాడు. సమస్యలన్నీ తాను సాల్వ్ చేస్తానని శివారెడ్డికి మాటిస్తాడు వెట్టి. పఠాన్ వల్ల వెట్టి ఎవరో తెలిసి పోతుంది బాజిరెడ్డికి. దాంతో అక్కడినుంచి బయటపడిన వెట్టికి హైమారెడ్డి కొడుకు రాకేష్ ప్రణవిని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నట్టు చెబుతాడు. ఇంతలో పఠాన్‌కి, ప్రణవికి తెల్లారితే పెళ్ళని అనౌన్స్ చేస్తాడు బాజిరెడ్డి. వెట్టికోసం హోటల్ కెళ్ళిన అతడికి హైమారెడ్డి కనిపిస్తాడు. వెంటనే అక్కడినుంచి నిష్క్రమిస్తాడు బాజిరెడ్డి. ముందు పఠాన్ పెళ్ళి జరిగిపోతే అన్నీ కుదురుకుంటాయని భావిస్తాడు. వెట్టి రాయుడిపల్లి బయలుదేరతాడు. ఈలోపు నాగమ్మతల్లి రవీంద్ర భార్యకి దర్శనమిస్తుంది. దాంతో అదే సూచనగా బుల్లెట్ బండి తీసుకుని వెట్టికి ఎదురొస్తారు రవీంద్ర బావమరిది, బండోడు. **ఆ తర్వాత...**

'నేను తెలుసుకుంటాను. మీరు టెన్షను పడకండి' అంటూ ముఖద్వారం దగ్గరికి పోయింది ఆమె.

***

'ఎస్టేట్‌ని మానేజ్ చేయమని శివారెడ్డి పవరాఫ్ అటార్నీ ఇచ్చాడు. ఎస్టేట్ ఖర్చుల కోసమే నేను మీ దగ్గర అప్పు తీసుకున్నాను. మీరు అడగాల్సింది నన్ను కాదు. శివారెడ్డినే' ఎర్రబడిన ముఖంతో చెప్పాడు బాజిరెడ్డి.

'ఏయ్ బాజిరెడ్డి... చదువుకోని మొద్దుమొఖాలతో మాట్లాడినట్టు మాట్లాడబోకు. ఎస్టేట్ తరపున అప్పు చేసే అధికారం ఉన్నప్పుడు ఆ అప్పును తీర్చే బాధ్యత కూడా నీకే ఉంటుంది' సీరియస్‌గా చెప్పాడు హైమారెడ్డి తమ్ముడు.

'ముందు పెళ్ళి జరగనీయండి. అయిపోయిన తర్వాత మాట్లాడుకుందాం' తను మొండిగా మాట్లాడితే వాళ్ళు మరింత మొండికేస్తారని అర్థమై కాస్తంత మెత్తగా చెప్పాడు బాజిరెడ్డి.

'ఏయ్ బాజిరెడ్డీ! బాకీల వసూళ్ళన్నీ ఇట్లాంటి సమయాల్లోనే తెగతెంపులు జరిగిపోవాలి. పెళ్ళంటూ జరిగితే ఈ ఆస్తిపాస్తులు ఎవరి దగ్గర్నించి ఎవరి దగ్గరికి వెళ్ళిపోతాయో ఎవరూ చెప్పలేరు. ముందు నా సంగతి తేల్చిన తర్వాతనే నువ్వు లోపలికి పోయేది. అంతే' అప్పటి వరకూ మౌనంగా ఉన్న హైమారెడ్డి కల్పించుకున్నాడు.

'బెదిరిస్తున్నారా? ఇది ఎవరి ఊరో మరచిపోయారా?' దురుసుగా అడిగాడు ఉన్నట్లుండి పఠాను.

అతను నోరు తెరవటం... మోతలు చేస్తూ ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్‌కు చెందిన వెహికల్స్ అక్కడికి రావటం ఒకేసారి జరిగింది.

'హల్లో బాజిరెడ్డి సారూ... మీ కొడుకుతో మాకు అర్జంటుగా మాట్లాడాల్సిన పనిపడింది. పంపించండి. రేపు ఈపాటికల్లా తీసుకువచ్చి ఇక్కడ దిగబెడతాం' అంటూ ముందున్న వెహికల్ నుంచి దిగాడు సబ్బిరెడ్డి.

చెమటలు ప్రత్యక్షమయ్యాయి బాజిరెడ్డి ముఖం మీద.

'మా వాడికి బెయిల్ ఇచ్చారు. బెయిల్ మీద ఉన్న మనిషిని మళ్ళా తీసుకుపోవాలంటే కోర్టు నుంచి తాకీదులు రావాలి... ఉన్నయ్యా?' అని అడిగాడు.

'తెలివి చూపించకు బాజిరెడ్డీ.. మీ వాడిని కోర్టు బయటికి పంపించలేదు. ఎప్పుడు పిలిస్తే అప్పుడు వచ్చి నిలబడతానని రాసిస్తే నేను వదిలి పెట్టాను. ఇప్పుడు పిలుస్తున్నా.. వచ్చి నిలబడాలి' అంటూ రెండో వెహికల్లో ఉన్న తన గార్డుల్ని పిలిచి, 'ఎక్కించండిరా' అన్నాడు సబ్బిరెడ్డి.

'సారూ.. మా వాడికి పెళ్ళి.. శివారెడ్డి చెల్లెలితో. పెళ్ళి అయిపోగానే వస్తాడు. రెండు గంటలు టైము ఇవ్వండి' ఒకటి కాదు రెండు కాదు ఒకేసారి పది మెట్లు కిందకి దిగి మాట్లాడాడు బాజిరెడ్డి.

'శివారెడ్డి చెల్లెలితో పెళ్ళా? మా అత్తమ్మ కూతురితోనా? నాకు తెలియకుండానే? ఏమిటి ఈ విచిత్రం' అంటూ మళ్ళీ తన గార్డుల్ని చూశాడు



సబ్బిరెడ్డి.

'నేను లోపలికి పోయి మాట్లాడి వస్తాను. అప్పటి దాకా ఇక్కడి నుంచి ఎవర్నీ కదలనీయకండి. మనకి కావాల్సిన ఈ పఠాన్‌ని అస్సలు ఒక్క అంగుళం కూడా జరగనీయకండి' అంటూ ఎవరి సమాధానం కోసం ఎదురు చూడకుండా గేటులోకి పోయాడు.

ఒకరివైపు ఒకరు చూసుకున్నారు హైమారెడ్డి, అతని తమ్ముడు.

'ఇది ఆ అబ్బయ్య పెట్టిన పెటకమే అంటావా?' చిన్నగా అడిగాడు హైమారెడ్డి.

'అనుమానం అనవసరం. మన బలం చాలదేమోనని ముందు జాగ్రత్తలు తీసుకుని ఉంటాడు' అన్నాడు తమ్ముడు.

'బలం అంటే గుర్తుకు వచ్చింది. మన సంగతేమిటి? ఈ బాజిరెడ్డిగాడు మొండికేస్తే?' చిన్నగా అడిగాడు హైమారెడ్డి.

'కడపకు ఫోను చేశాను. మనోళ్ళు బయలుదేరి చాలాసేపు అయింది. ఇక్కడి పోలీసోళ్ళకి చెప్పించాను. అవసరం అయితే వచ్చి కలగజేసుకుంటామన్నారట. ఆళ్ళందరూ అనవసరం. మనం సరిపోమా?' షర్టు చేతుల్ని పైకి ముడుచుకుంటూ అడిగాడు తమ్ముడు.

'అది నిజమేననుకో. కానీ..' అంటూ మాటల్ని ఆపాడు హైమారెడ్డి.

రెండు ఖరీదైన కార్లు వచ్చి, ఆ వీధి చివరగా ఆగటమే అందుకు కారణం. మొదటి కారులో నుంచి సూటుబూటు వేసుకుని ఉన్న ఒక పెద్దాయన దిగి నిలుచున్నాడు. ఆయన వెనుకే దిగాడు అటువంటి దుస్తులే ధరించి ఉన్న యువకుడు.

'అరెరే.. మన అబ్బయ్య... అక్కడెక్కడికో పోయి వస్తానని చెప్పి పోయినవాడు, ఇక్కడికి ఎలా వచ్చేశాడు? మన బాబీ ఏడీ? ఎక్కడ?' ఆశ్చర్యంగా అడుగుతూ ఆ వెహికల్స్ దగ్గరికి బయలు దేరాడు హైమారెడ్డి తమ్ముడు.

'హల్లో... ఇది శివారెడ్డిగారి ఇల్లేకదూ?' అతను తమ దగ్గరికి రాగానే అడిగాడు ముందు దిగిన పెద్దాయన.

'ఏమిటిది అబ్బయ్య? ఈ సూటు బూటేమిటి? మా బాబీ...' ఆయన పక్కన ఉన్న యువకుణ్ణి అడుగుతూ అదిరిపడి మాట ఆపేశాడు హైమారెడ్డి తమ్ముడు.

'మీరు మా విఠల్‌ని గురించి అడుగుతున్నారు. నేను విఠల్‌ని కాదు. వాడికి అన్నని! వాణ్ణి చదువుకోరా నాయనా అని ఇక్కడ వదిలిపెట్టి మేము అమెరికా పోతే, చదువు వదిలేసి నానా రకాల గొడవలు మొదలుపెట్టాడని తెలిసింది. వాడు మాకు ఫోన్ చేసి పది నెలలకు పైనే అయింది. వెతుక్కుంటూ వాడి కాలేజికి పోయి, అక్కడి నుంచి అటు తిరిగి ఇటు తిరిగి ఇక్కడి దాకా వచ్చాం' అన్నాడు ఆ యువకుడు.

'మా వాడు ఎక్కడ? ఈ జనం అందరూ ఎవరు?' అడిగాడు తనంతట తనే ఆ పెద్దయ్య.

భుజం మీది వస్త్రంతో ముఖం తుడుచుకున్నాడు హైమారెడ్డి తమ్ముడు.

'మాట్లాడవేంటి?' రెట్టించాడు ఆయన.

'ఏం మాట్లాడమంటారు సారూ.. అన్నీ తెలుసని అనుకుంటున్న మాకే ఏమీ తెలియదని అనిపిస్తోంది. మీరు కూడా వచ్చి మాతో నిలబడండి. మీ అబ్బయ్య ఇప్పుడో, ఇంకాసేపటికో వస్తాడు. వచ్చిన తర్వాత అన్నీ తనే చెపుతాడు. రండి' అంటూ రెండో వెహికల్ వైపు చూశాడు హైమారెడ్డి తమ్ముడు.

ఎవరెవరో పరిచయం లేని జనం ఒక అరడజను మంది దిగారు అందులోనుంచి. 'నేను విఠల్ బాబు రూమ్ దగ్గర కిళ్ళీబడ్డీ నడుపుకుంటూ ఉంటాను. జరిగిందేమిటో నాకు తెలిసినంత వరకూ నేనే చెప్పాను వాళ్ళిద్దరికీ' తనను అడగకపోయినా, తనను తను పరిచయం చేసుకుంటూ చెప్పాడు వారిలో ఒకతను.

'సరిసరి, పరిచయాలు తర్వాత. ముందు మనం గేటుకి అడ్డంగా నిలబడాలి' అంటూ వారందరినీ గేటు దగ్గరికి బయలుదేరదీశాడు హైమారెడ్డి తమ్ముడు.

**తళతళ మెరుపుల పట్టుచీరలో ఏడువారాల నగలు ధరించి దేవకన్యలా మెరిసిపోతున్నది ప్రణవి. రాకుమారిలాగా దర్జాగా ఉంది. పైనుంచి కిందిదాకా ఆభరణాలే కనిపిస్తున్నాయి తప్ప ఆమె ముఖం కనిపించటం లేదు. శివారెడ్డి గదిలోకి వెళ్ళి అతని ఆశీర్వాదం తీసుకుని హాల్లోకి వచ్చింది ఆమె. బ్యాండ్‌మేళాలు, సన్నాయి వాద్యాలు మారుమోగుతున్నాయి. కానీ పెళ్ళికొడుకు జాడ లేదు. అసలేం జరిగింది?**

ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు ఆ పెద్దాయన, పక్కనే ఉన్న యువకుడు.

'వెయిట్ చేసి చూద్దాం డాడీ... విఠల్‌గాడు వస్తాడని అంటున్నారుగా, చూద్దాం' అన్నాడు యువకుడు.

అందరూ కలిసి గేటు దగ్గరికి రావటాన్ని గమనించి అయోమయంగా తన డ్రైవర్ వైపు చూశాడు బాజిరెడ్డి.

'ఆలస్యం దేనికి సారూ? వేసేసి లోపలికి పోదాము' అంటూ గ్రానైట్ మైన్స్ జనంవైపు తిరిగి తల ఊపాడు డ్రైవర్.

తమ దుస్తుల్లో ఉన్న ఆయుధాల మీద చేతులు వేశారు వాళ్ళందరూ. అర్థమైపోయింది హైమారెడ్డికి. 'మనం ఇబ్బందుల్లో పడ్డాం రా చిన్నాడా? వాళ్ళని ఆపటం కష్టమేరా..' అంటూ పక్కకు చూసి, 'ఆళ్ళెవరురా?' అడిగాడు తమ్ముడిని.

తమ్ముడు చూశాడు. బాజిరెడ్డి చూశాడు. అతని జనం చూశారు. గ్రానైట్ మైన్స్ జనంలో ఉన్న వాళ్ళ లీడర్ ఉన్నట్లుండి, 'చౌడేశ్వరిగుడి పూజారి వస్తున్నాడేంటిరా? వాళ్ళని కూడా పిలిచారా?' అంటూ కన్ఫర్మేషన్ కోసం బాజిరెడ్డి వైపు చూశాడు.

దూరంగా ఆగిన లారీలో నుంచి, రెండు పాతకాలపు అంబాసిడర్ కార్లలో నుంచి ఎవరికీ తెలియని కొత్తమొఖాలు దిగి, చౌడేశ్వరి గుడిలో పూజలు చేసే కొత్త పూజారి ముందు నడుస్తూ ఉండగా గేటు దగ్గరికి వచ్చారు.

'బాజిరెడ్డి సారూ... మనం వెంటనే శివారెడ్డి సారుతో మాట్లాడి ఒకసారి గుడిదగ్గరికి పోవాలి. చాలా అర్జంటు' పూజారి పక్కనే ఉన్న ఒక పెద్దమనిషి చెప్పాడు.

'ఏమిటి అర్జంటు?' బలవంతంగా కోపం బిగపట్టుకుంటూ అడిగాడు బాజిరెడ్డి. ఆ పెద్ద మనిషికి బదులు పూజారి మాట్లాడాడు.

'పొద్దున పూజలు మొదలుపెట్టకముందే ఏదో జరిగిపోయింది. గుడిచుట్టూ ఉన్న పుట్టల్లో ఉన్న పాములన్నీ బయటికి వచ్చేశాయి. కంకర రోడ్డు నిండా అవే... మనిషి కదలిక కనిపిస్తే చాలు దారుణంగా బుసలు కొడుతున్నాయి' చెప్పాడు.

'పుట్టల్లో ఉండే పాములు బయటికి వస్తూనే ఉంటాయి. తిరిగి లోపలికి పోతూనే ఉంటాయి. అందులో వింత ఏముంది? కాస్సేపు ఆగితే అవే సర్దుకుంటాయి. ఆ మాట చెప్పటానికి ఇంత దూరం రావాలా?' చిరాకుగా అన్నాడు బాజిరెడ్డి.

'సర్దుకోవటం లేదు సారూ. మీది మీదికి వస్తున్నాయ్. దర్శనానికి వచ్చిన భక్తుల వెంటపడితే వాళ్ళు భయంతో పారిపోయారు' చెప్పాడు పూజారి.

'ఆ పిచ్చి పూజారిని పిలవచ్చు కదా' అన్నాడు బాజిరెడ్డి.

'నిన్న రాత్రి నుంచీ ఏమయిపోయాడో కనిపించడం లేదు. ధర్మకర్తలందరికీ కబురు చేశాను. శివారెడ్డి సారుకు కూడా చెపుదామని వచ్చాను' అన్నాడు పూజారి.

రెండు క్షణాలు ఆలోచించి, 'వచ్చినవాళ్ళు ఎలాగూ వచ్చారు. నా బిడ్డడికి శివారెడ్డి చెల్లెలితో పెళ్ళి. చూసిన తర్వాత భోజనాలు చేసి వెళ్ళండి' అన్నాడు బాజిరెడ్డి.

'మరి గుడి దగ్గర పాములు?' అడిగాడు పూజారి.

అతని మీదపడి కరిచినంత పని చేశాడు బాజిరెడ్డి. 'నీ పాములు నువ్వూ... నోరు మూసుకో. ముందు పెళ్ళి... తర్వాత పాములు' అంటూ తనవారివైపు తిరిగి 'పదండి లోపలికి' అని అరిచాడు.

ఎదుట ఉన్న హైమారెడ్డి గుండెల మీద చెయ్యి వెయ్యబోయాడు పఠాన్, అవతలికి నెట్టటానికి. తమ ఆయుధాల్ని బయటికి తీశారు గ్రానైట్‌మైన్స్ జనం.

తెల్లబోయారు సబ్బిరెడ్డితో వచ్చిన ఫారెస్ట్ గార్డులు. తాము కూడా తమ ఆయుధాల్ని అందుకోవాలో అందుకోకూడదో తెలియక అయోమయంగా చూసుకున్నారు ఒకరి వంక మరొకరు.

'అరేయ్... తీసుకున్న అప్పు తీర్చమని అడగటానికి వస్తే, ఒంటిమీద చెయ్యి వెయ్యబోతున్నావ్.. నరికి పోగులు పెడతాను. కడప హైమారెడ్డి అంటే కాకాహోటల్ నడుపుకునే వాణ్ణనుకుంటున్నావు కాబోలు' అంటూ కనిపించని వేగంతో కదిలి, పఠా

న్ని కిందికి నెట్టాడు హైమారెడ్డి తమ్ముడు. అంతటితో ఆగలేదు. అదే ఊపులో బాజిరెడ్డి భుజాల్ని పట్టుకుని దగ్గరికి లాగాడు. మెడచుట్టూ చేతిని చుట్టి కదలకుండా బిగించేశాడు.

'కొట్టండిరోయ్... కొట్టేయండి' అని అరుస్తూ ముందుకు జంప్ చేయబోయి... ఆగిపోయాడు డ్రైవర్.

హైమారెడ్డి పాదం ఒకటి కిందపడిన పఠాన్ గుండెలమీద ఉంది. అతని తమ్ముడి రెండవ చేతిలో తళతళ మెరుస్తున్న పేష్కప్ ప్రత్యక్షమై ఉంది. దాని మొన బాజిరెడ్డి బుగ్గల్ని ముద్దాడటానికి సిద్ధంగా ఉన్నది.

***

ఎగుడుదిగుళ్ళు, ఎత్తుపల్లాలతో నిండి ఉండే అడవిదారుల్లో బుల్లెట్ బండి నడపటం ఇంపాజిబుల్ అనుకున్నాడు గాని, అసలు అటువంటి ప్రదేశాల్లో ఆ బండినే ఉపయోగించాలని తెలిసి వచ్చేసరికి, తన అభిప్రాయాన్ని వెంటనే మార్చుకున్నాడు వెట్టి.

దారి ఎంత దారుణంగా ఉన్నా నలభైకి తగ్గలేదు వేగం. చూస్తూ చూస్తూ ఉండగానే, పఠాన్ బృందం చందనం చెట్లు నరికించిన ఏరియాను చేరుకున్నారు వాళ్ళు నలుగురూ.

సగం తెగినా కూడా సగర్వంగా నిలబడి ఉన్న చెట్టు దగ్గర బండిని వదిలేసి, అంతకుముందు బండోడు, తను ఇద్దరూ కలిసివెళ్ళిన తుప్పల్లోకి పరుగుతీశాడు వెట్టి.

'వచ్చేశాము కదన్నయ్యా.. ఇంకా తొందర దేనికీ? నెమ్మదిగా నడవవచ్చును కదా' అంటూ అతన్ని స్లో చేయటానికి ప్రయత్నించాడు రవీంద్ర బావమరిది.

'నీకు తెలియదు. అవతల అంతా రభసరభసగా ఉండి ఉంటుంది. ఈ తల్లి తన స్వస్థానానికి చేరుకుంటే తప్ప పరిస్థితులు మనకి అనుకూలంగా టర్న్ తీసుకోవు. శివారెడ్డికి పూర్తి శక్తి రావాలంటే మనం త్వరపడాల్సిందే' అంటూ ఉన్నట్లుండి ఆగిపోయాడు వెట్టి.

దారుణమైన బుసకొడుతూ అంతకుముందు కనిపించిన పాము మరోసారి పొదలో నుంచి బయటికి రావడమే అందుకు కారణం.

'అన్నయ్యా... నేను వెళ్ళి విరుగుడు పొద విరుచుకు వస్తాను. నువ్వు కదలకుండా నిలబడు' అన్నాడు ఆ పామును చూసిన వెంటనే బండోడు.

'లాగిపెట్టి కొడితే లేచి అవతలకు పోలేని ఒక పాముని చూసి భయపడటం ఏమిటి అన్నయ్యా?' అంటూ ముందుకు అడుగువేయబోయాడు బాబీ.

'ఓరి నాయనా... నువ్వు కొంచెం శాంతించు. ఇది నీకు అర్థం కాదు. ఇప్పుడు నువ్వు ఏదైనా చేస్తే నీ ఆశ అప్పడమై పోతుంది. మా కథంతా మళ్ళీ మొదటికి వచ్చేస్తుంది' అంటూ అతన్ని వెనక్కి నెట్టి, తను ముందుకు అడుగువేశాడు వెట్టి.

పూనకం వచ్చినట్టు చెలరేగిపోతున్న పాముకి నమస్కారం చేశాడు. 'ఇంతకుముందు వచ్చాను. అప్పుడు నువ్వు నన్ను ఆ తల్లిని చూడనిచ్చావు. ఇప్పుడు కూడా అదే పరిస్థితి. అమ్మవారిని తిరిగి గుడి దగ్గరికి తీసుకుపోవాలి. అడ్డు తప్పుకో' చిన్న కంఠంతో తన మాటను వినిపించాడు.

బుసలు ఆపిందా పాము. పడగ దించింది. పక్కకు జరిగి, చుట్టలు చుట్టుకుంది.

భయంగానే ఉన్నది వెట్టికి. అయినా ఆగేందుకు సరైన సమయం లేదు. అన్నిటికీ తెగించి పొద దగ్గరికి పోయాడు.

'బండోడు వచ్చేదాకా ఆగన్నయ్యా...' వణుకుతున్న కంఠంతో అతన్ని వారించటానికి ప్రయత్నించాడు రవీంద్ర బావమరిది.

బుస్సుమంటూ పడగెత్తి అతనివైపు చూసిందా పాము.

పొదలోకి చేతుల్ని పోనిచ్చి, అడ్డదిడ్డంగా పడివున్న కొండరాయిని అమాంతం చేతుల్లోకి ఎత్తుకుని, అర్జంటుగా వెనక్కి దూకాడు వెట్టి.

నాలుగు అడుగుల ఎత్తుకు లేచింది పాము పడగ... ఈతముళ్ళ వంటి కోరలు కనపడేటట్లు తెరుచుకుంది నోరు.

'జరిగిన తప్పును సరిచేయటానికి ప్రయత్నం చేస్తుంటే, ఇది ఇంతగా రెచ్చిపోతోందేమిటి?' అనుకుంటున్న వెట్టి తలమీది నించి, అతనికి పాముకి మధ్య అడ్డంగా పడింది బండోడు విసిరిన విరుగుడు పొద.

ముందుకు విసరబోతున్న పడగను వెంటనే వెనక్కి తీసుకుని, ఆరు అడుగుల దూరం అవతలికి వెళ్ళిపోయిందా పాము.

'మనల్ని కూడా బాజిరెడ్డి ముఠా వాళ్ళమే అనుకుంటోంది కాబోలు. నువ్వు వచ్చేయ్ అన్నయ్యా' రెండో చేతితో పట్టుకున్న ఇంకో పొదను అటూ ఇటూ ఊపుతూ అన్నాడు వెట్టితో బండోడు.

సగం నరకబడినా కూడా సగర్వంగానే నిలబడి ఉన్న చందనం చెట్టు దగ్గరికి పరిగెత్తాడన్న మాటేగాని, వెట్టి మనసును అల్లకల్లోలం చేయటం మాత్రం మానుకోలేదు ఒక అనుమానం.

ఒట్టొట్టి పాముల మాదిరి లేనిపోని గొడవకు దిగవు చౌడేశ్వరి గుడిని కానీ, ఆ తల్లికి సంబంధించిన వస్తువుల్ని కానీ కాపలా కాసే పాములు.

అంతకుముందు ఎంతో మర్యాద మన్నన చూపించిన ఈ పాము ఇప్పుడు ఉన్నట్లుండి తన మీదకి ఎగబడటానికి ఏదో ఒక కారణం ఉండే ఉంటుంది.

తనను అడ్డుకునే బాజిరెడ్డి సిటీలోనే ఉండి ఉండాలి తన లెక్కప్రకారం. వాడి కొడుకు కూడా వాడితోనే ఉండాలి. ఇద్దరూ కలిసి శివారెడ్డిని-హెరాస్ చేస్తూ ఉండాలి.

అటువంటి పనులు చేయకుండా వాళ్ళేమయినా తమ వెనుకే అడవిలోకి వచ్చి ఉంటారా? చౌడేశ్వరి ఆత్మశిల తన స్వస్థానానికి చేరుకుంటే తమ ఆటలు సాగవని గ్రహించి అడ్డుకునేందుకు ప్రయత్నాలు మొదలుపెట్టారా?

ఈ పాము అందుకే తనను తొందరపడవద్దని హెచ్చరించటం కోసం వైల్డ్‌గా ప్రవర్తించిందా?

స్టాండ్ వేసి ఉన్న బుల్లెట్‌ని స్టార్ట్ చేయబోతూ, ప్రశ్నార్థకంగా వెట్టి వైపు చూశాడు రవీంద్ర బావమరిది.

## పెళ్ళిని మరిచిన జేజమ్మ?

'బాహుబలి 2' తరువాత అనుష్క పెళ్ళి అన్న రూమర్లు అప్పట్లో బాగా వినిపించాయి. ఆమె అభిమానులు కూడా ఈ వార్త నిజమే అనుకున్నారు. కానీ అనుష్కకు ఆ ధ్యాసే లేనట్టుంది. ఈ సినిమా తరువాత అనుష్కకు బాలీవుడ్ నుంచి ఆఫర్లు క్యూ కడుతున్నాయట! దాంతో అనుష్క దృష్టి అటువైపు పెట్టింది. ప్రస్తుతానికి పెళ్ళిని వాయిదా వేసి బాలీవుడ్ మీద దృష్టి కేంద్రీకరించిందట! అంటే ఇప్పట్లో అనుష్క పెళ్ళి చేసుకోదన్నమాటే! అనుష్కకు వస్తున్న ఆఫర్లను చూసిన ఆమె పేరెంట్స్ కూడా పెళ్ళి మాట ఆమె దగ్గర ఎత్తడం లేదట!

'బండోడా...' అని పిలిచాడు వెట్టి చాలా చనువుగా.

నవ్వాడు బండోడు. 'ఏమిటన్నయ్యా?' అంటూ దగ్గరికి జరిగాడు.

'మనం మాత్రమే కాకుండా వేరే వాళ్ళు ఎవరయినా ఇటుగా రావటమో, రావటానికి ప్రయత్నిస్తూ ఉండటమో జరుగుతున్నట్టు నాకు అనుమానంగా ఉంది. నిజమో కాదో ఎలా తెలుస్తుంది?' అడిగాడు వెట్టి.

'రెండు నిమిషాలు ఇక్కడే ఉండు' అంటూ వేగంగా కదిలి పొదలమధ్యకు పోయాడు బండోడు.

బుల్లెట్ దగ్గరే నిలబడి అక్కడ జరుగుతున్న సంభాషణను అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు బాబీ.

తన గుండెలకు ఆనించుకుని పట్టుకున్న అమ్మవారి శిలను గబుక్కున అతనికి అందించాడు వెట్టి.

'నువ్వు ఈ అన్నయ్యతో కలిసి గుడి దగ్గరికి వెళ్ళు. పిచ్చిపూజారిని వెతికి పట్టుకుని అప్పగించేయ్' అంటూ రవీంద్ర బావమరిదికి తల ఊపాడు.




'మరి నువ్వు?' అడిగాడు అతను.

'నేను, బండోడు వెనకగా వస్తాము. ముందు మీరిద్దరూ వెళ్ళండి... ఆలస్యం చేయవద్దు' అన్నాడు వెట్టి.

బుల్లెట్‌ని స్టార్ట్ చేయబోయాడు రవీంద్ర బావమరిది.

'బండి వద్దు. దాని మోత బయటికి వినబడితే మీ ఉనికి బట్టబయలై పోతుంది' అంటూ వారించాడు వెట్టి.

'ఆ రాయి చాలా బరువుగా ఉంటుంది. మోయటం కుదరకపోతే నాకు ఇచ్చేయ్' అంటూ అడవిదారి వైపు తిరిగాడు రవీంద్ర బావమరిది.

'బాబీ మోకాళ్ళు బలహీనం. జాగ్రత్తగా తీసుకుపో. కాలిదారి వద్దు. అడ్డదారి చూసుకో' హెచ్చరించి అప్పటికప్పుడు బుల్లెట్ స్టార్ట్ చేశాడు వెట్టి.

బాబీ భుజం తట్టి పొదల్లోకి దారితీశాడు రవీంద్ర బావమరిది. బుల్లెట్ మోతను మరింతగా పెంచాడు వెట్టి. అరనిమిషం కూడా గడవకముందే సుడిగాలి మాదిరి వచ్చి పడిపోయాడు బండోడు. వస్తూనే చేయి జాచి డబడబమంటున్న బుల్లెట్‌ను ఆపేశాడు.

'అన్నయ్యా.. నీ అనుమానం కరెక్టు. పది మంది. ఇటే వస్తున్నారు. మనోళ్ళు కాదు. మన రాష్ట్రం కూడా కాదు. వాళ్ళ భాష మనది కాదు' అన్నాడు.

ముఖంమీద చరిచినట్టు గుర్తుకు వచ్చింది వెట్టికి మొట్టమొదటిసారిగా పఠాన్‌ని ఆ ప్రదేశంలో ఉండగా చూసిన దృశ్యం.

తాము నరికి సిద్ధం చేసిన చందనం దుంగల్ని శ్రీలంక నుంచి వచ్చే బయ్యర్స్‌కి సప్లయి చేస్తున్నట్టు మాట్లాడాడు పఠాన్.

వాళ్ళు వచ్చి సరుకు చూసిన తర్వాత తన బాధ్యత తీరిపోతుందన్నట్లుగా కూడా మాట్లాడాడు.

అతను బంధించబడినట్లు తెలియక ఆ బయ్యర్లు వస్తున్నారా అడవిలోకి?

నలిగిపోయినట్లు తయారైన దుస్తుల్ని దుమ్ము పోయేటట్లు చేతులతో దులుపుకుని, ముఖం మీద పడుతున్న జుట్టు చేతులతోనే సరిచేసుకుంటూ బండోడి వైపు చూశాడు.

'అమ్మవారు అవతలికి వెళ్ళిపోయారు. ఇప్పుడు వచ్చే ఎదవల్ని మనం కాసేపు ఇక్కడే నిలబెట్టి ఉంచితే ఎటువంటి ప్రాబ్లము ఉండదు' అన్నాడు.

'వాళ్ళ వాలకం నాకు అనుమానంగా ఉంది అన్నయ్యా. ఒట్టొట్టి మాటలతో వాళ్ళు తృప్తిపడి అవతలికి పోతారని నాకు నమ్మకం లేదు' అన్నాడు బండోడు.

తల ఊపి పాంటు జేబులో నుంచి సిగరెట్ పాకెట్ బయటికి తీశాడు వెట్టి. అదేపనిగా కాలుస్తూ ఉండటం వల్ల ఆల్‌మోస్ట్ ఖాళీ అయిపోయింది అది. ఒకే ఒక సిగరెట్ మిగిలింది.

'నన్ను చింతలపల్లి పోయి ఇంకో పాకెట్ తీసుకు రమ్మంటావా?' అతను తల విదిలించటం చూసి అడిగాడు బండోడు.

'వచ్చేవాళ్ళు నిన్ను భయపెడుతున్నారా?' అడిగాడు వెట్టి.

నవ్వాడు బండోడు. 'భయం కాదన్నయ్యా... నీకు ధైర్యం రావటానికి అవి అవసరమేమో అనుకున్నా. నీకు లేని భయం నాకెందుకు?' అన్నాడు.

'బండిని స్టార్ట్ చేయ్. మోత విని వాళ్ళు ఇంకాస్త త్వరగా వచ్చేస్తారు. తను అంతకుముందు బండిని ఎందుకు స్టార్ట్ చేసి ఉంచాడో అప్పుడు అతనికి అర్థం అయ్యేటట్టు చెప్పాడు వెట్టి.

బుల్లెట్ స్టార్ట్ చేశాడు బండోడు.

***

హైమారెడ్డి పేష్కప్ బాజిరెడ్డి బుగ్గలకు ఆనుకున్న మరుక్షణం చలనం వచ్చింది పూజారితో పాటు వచ్చిన జనానికి.

'ఏమిటి ఈ దారుణం? ఎవరని అనుకుంటున్నారు బాజిరెడ్డి సారు? శివారెడ్డి సారు తరపున మా అమ్మవారి గుడి బాగోగులు చూసే మనిషి' అంటూ ముందుకు వచ్చారు అందరూ.

అంతకుముందు బాజిరెడ్డి, అతని కొడుకు తమను అవతలికినెట్టి బలవంతంగా లోపలికి పోయే ప్రయత్నం మొదలుపెట్టబోయిన సంగతిని వారెవరూ గమనించలేదని అర్థమైంది హైమారెడ్డికి.

'నా బాకీ సంగతి తేల్చిన తర్వాత మీరు మాట్లాడండి' కరకరలాడుతున్న కంఠంతో అన్నాడు.

'బాకీ సంగతే మాట్లాడతాను. ఈ ఇంటిగుట్టు రచ్చకు ఎక్కకుండా ఉండటానికి ఇంతవరకు నేను పడిన శ్రమ అంతా ఎందుకూ పనికిరాకుండా పోయింది. పరిస్థితి నా చేయి దాటి పోయింది కాబట్టి మీ అందరికీ నేను ఒక విషయం చెప్పి తీరాలి' హైమారెడ్డి చేతుల్ని విదిలించి అవతలికి జరుగుతూ అరిచినంత పనిచేశాడు బాజిరెడ్డి.

'ఏమిటి సారూ ఆ గుట్టు?' ఆశ్చర్యంగా అడిగాడు ఒక మనిషి.

'మీరు అందరూ అనుకుంటున్నట్టు శివారెడ్డి తండ్రిగారు ధర్మాత్ముడు కాదు. ఆయన చేసిన పనులు ఎటువంటివో తెలిస్తే మీరందరూ ఆశ్చర్యపోతారు' అన్నాడు బాజిరెడ్డి.

ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు వచ్చిన జనం.

'ఈ విషయాలు బయటపెట్టకుండా ఉండటానికి శివారెడ్డి తన చెల్లెల్ని నా కొడుక్కి ఇచ్చి పెళ్ళి చేస్తానని అన్నాడు. కావాలంటే మీరందరూ వచ్చి శివారెడ్డినే అడగండి' అన్నాడు బాజిరెడ్డి.

మరింత అయోమయానికి గురైపోయినట్లున్నారు గుడి దగ్గర్నించి వచ్చిన జనం. 'ఇక్కడ ఇటువంటి దారుణం జరగబోతున్నదని తెలియటం వల్లనే గుడిచుట్టూ ఉండే పాములు రోడ్డు మీదికి వచ్చి ఉంటాయా?' ఏమీ అర్థం కానట్టు చూస్తూ నిలబడిన పూజారిని అడిగాడు ఒక పెద్దమనిషి.

'దారుణమో మరొకటో ఏదో జరగబోతున్నది. అందుకే ఆ తల్లి వాటిని పుట్టల్లోనుంచి బయటికి పంపింది' అన్నాడు పూజారి.

**(ఇంకా వుంది)**

# తల తిరిగే (వర్టిగో) సమస్య ఇక బాధించదు


**డాక్టర్ గోరంట్ల చంద్రశేఖరరావు**
ఎం.డి, పీహెచ్‌డీ (హోమియో)
డి.ఎస్‌సి. హోమియో (అమెరికా)
మేనేజింగ్ డైరెక్టర్, హోమియో ట్రెండ్స్
హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ, వైజాగ్
ఫోన్స్: 77 3000 1000, 77 3000 2000




తల తిరగడం అనేది ఈ ఆధునిక యుగంలో సాధారణ సమస్యగా మారింది. కానీ అది దీర్ఘకాలికంగా బాధిస్తున్నప్పుడు అది రావడానికి కారణాలు కచ్చితంగా కనుక్కుని చికిత్స ఇవ్వాలి. ఈ సమస్య రావడానికి రెండు ముఖ్య కారణాలుంటాయి. వీటిని సెంట్రల్ వర్టిగో మరియు పెరిఫెరల్ వర్టిగో అని చెప్పుకోవచ్చు.

## సెంట్రల్ వర్టిగో

కొన్నిసార్లు తలతిరగడానికి మెదడులోని సమస్యలు లేక నాడీమండలం కారణం కావచ్చు. ఈ కారణాల వల్ల తలతిరిగితే సెంట్రల్ వర్టిగో అంటారు.

**కారణాలు** : 1) సర్వైకల్ స్పాండిలోసిస్ (మెడనొప్పి), 2) పార్శ్వపు నొప్పి 3) పార్కిన్‌సోనిజమ్ మరియు నరాల బలహీనతలు 5) మూర్ఛతో పాటు వచ్చే వర్టిగో

**1) సర్వైకల్ స్పాండిలోసిస్ :** మెడనొప్పి తో పాటు, మెడ తిప్పినపుడు తలతిరిగి కొన్నిసార్లు తూలినట్టు అవుతుంది. వెన్నెముక మధ్యలో ఉండే డిస్క్ దెబ్బతిని నరాల మీద ఒత్తిడి వల్ల ఇలా జరుగుతుంది.

**2) పార్శ్వపునొప్పి :** ఈ వ్యక్తులలో ఒకవైపు తలనొప్పితో పాటు కొన్నిసార్లు తలతిరగడం కూడా ఉంటుంది. నొప్పితో పాటు వికారం, వాంతులు వంటి లక్షణాలుంటాయి. వీరు శబ్దాన్ని, కాంతిని భరించలేరు.

**హోమియో ట్రెండ్స్ ఎందుకు?**
**హోమియో వైద్యంలో ఉత్తమ ఫలితాలకు డాక్టర్ల ఎంపిక కీలకం. దక్షిణ భారతదేశంలో హోమియో వైద్య రంగంలో పిహెచ్‌డి చేసిన మొట్టమొదటి వైద్యుడు డా.గోరంట్ల చంద్రశేఖర్‌రావుగారి ఆధ్వర్యంలో డాక్టర్ల బృందం ప్రతికేసును క్షుణ్ణంగా పరిశీలించి అత్యుత్తమ ఫలితాలు ఇస్తున్నారు.**

## పెరిఫెరల్ వర్టిగో

ఇక్కడ తలతిరగడం చెవి సమస్యల వల్ల వస్తుంది. చెవిలోపలి భాగంలో వెస్టిబ్యులార్ సిస్టమ్ అనే భాగం ఉంటుంది. ఈ సిస్టమ్‌లో సెమిసర్క్యులర్ కెనాల్స్, వెస్టిబ్యులార్ మరియు వెస్టిబ్యులార్ నరం ఉంటాయి. ఈ భాగాలలో ఏదైనా సమస్య వస్తే పెరిఫెరల్ వర్టిగో వస్తుంది. ప్రధాన కారణాలు ఇవి.

**1) బిపిపివి (బినైన్ పారాక్సిస్మల్ పొజిషనల్ వర్టిగో):** 32 శాతం మందిలో తలతిరగడానికి ప్రధాన కారణం ఇదే. చెవిలోపలి భాగంలో చిన్న కాల్షియం లాంటి పదార్థం ఏర్పడి ఈ సమస్యను కలగజేస్తుంది. ఒక్కొక్కసారి పడుకుని లేక కూర్చుని లేచి నడిచినపుడు తలతిరిగి బ్యాలెన్స్ తప్పినట్టు అయి తూలుతున్నట్లు అవుతుంది.

**2)మినియర్స్ డిసీజ్ :** తలతిరగడం, చెవిలో హోరుమని శబ్దాలు , చెవి వినికిడి తగ్గడం లాంటి మూడు లక్షణాలుంటాయి. మొదట ఒక చెవిలో ఈ లక్షణాలు కనిపించి , కాలక్రమేణా రెండో చెవికి కూడా లక్షణాలు కనిపిస్తాయి. ఈ లక్షణాలు చెవిలోపలి భాగంలో ఎండోలింఫ్ అనే ద్రవపదార్థం ఎక్కువ ఉత్పత్తి కావడం వల్ల వస్తుందని భావిస్తుంటారు.

**హోమియో చికిత్స** తలతిరగడం ఎందువల్ల వస్తుందో తెలుసుకోవాలి. ఈ లక్షణాలతో పాటు రోగి మానసిక, శారీరక లక్షణాలను తెలుసుకుని చికిత్స ఇవ్వాలి. దీనిని తత్వచికిత్స అంటారు. ఎటువంటి దుష్ఫలితాలు లేని ఈ చికిత్స వల్ల అత్యుత్తమ ఫలితాలు వస్తాయి.

# హెచ్‌ఐవి, హెర్పిస్‌ల కట్టడి సాధ్యమే


**డాక్టర్ టి.ప్రభాకర్,** MD హోమియో
MS సైకాలజీ & కౌన్సెలింగ్,
పీజీ డిప్లొమా ఇన్ సెక్సాలజీ
బెస్ట్ డాక్టర్ 2016, హోమియో ట్రెండ్స్
హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ, వైజాగ్
ఫోన్స్: 77 3000 3000 , 77 3000 4000




**హెర్పిస్ :** ఒకరినుంచి మరొకరికి వ్యాపించే వ్యాధి ఇది. వైరస్ కారకము. జీవిత పర్యంతం చికిత్స తీసుకున్నా బాధిస్తూనే ఉంటుంది.

**వ్యాప్తి :** కల్సి భోజనంచేయడం, ఒకే గ్లాసు, ఒకే కంచం, ముద్దుల ద్వారా వ్యాప్తి చెందును. సెక్సువల్ కాంటాక్ట్స్, సెక్సువల్ ఫ్లూయిడ్స్ ద్వారా వ్యాపించును.

రకాలు :హెచ్‌ఎస్‌వీ 1, హెచ్‌ఎస్‌వీ2 .

**వయస్సు :** ఏ వయస్సు వారికైనా రావచ్చు, పెద్దల నుంచి చిన్న పిల్లల వరకు.

ఎవ్వరికి రావచ్చును?

1) పరస్త్రీలతో సంబంధాలు 2) హెర్పిస్ వ్యాధి గ్రస్తులు

3) రోగనిరోధక శక్తి తగ్గిన వారిలో

4) హెర్పిస్ తల్లి గర్భం ద్వారా, జననాంగాల ఇన్‌ఫెక్షన్ల ద్వారా వ్యాప్తి చెందును.

**వ్యాధి నిర్ధారణ :** నోటిలో పొక్కులు, మూత్రవిసర్జనలో నొప్పి, పెదాలపై కురుపులు, పొక్కులు దురద ఉంటుంది. లింఫ్‌గ్రంథుల వాపు.

**హోమియో చికిత్స :** వ్యాధి మూలాలకు చికిత్స అందించడం ద్వారా వ్యాధిని సమూలంగా నిర్మూలించవచ్చు. ఎలాంటి సైడ్‌ఎఫెక్ట్స్ ఉండవు. 38 సంవత్సరాల అనుభవం, పరిశోధన, నిపుణత కల్గిన వైద్యులచే హోమియో ట్రెండ్స్ నందు చికిత్స అందించబడును.

## హెచ్‌ఐవి

ఇది ఒక విధమైన రోగనిరోధక వ్యవస్థను దెబ్బతీసే వైరస్. హెచ్‌ఐవి( హ్యూమన్ ఇమ్యునో డెఫిసియెన్సి వైరస్) దీర్ఘకాలంలో ఎయిడ్స్(అక్వైర్డ్ ఇమ్యునో డెఫిసియెన్సి సిండ్రోమ్)గా మారుతుంది. ఇన్‌ఫెక్షన్ సోకిన వెంటనే ఫ్లూలాంటి జ్వరం లక్షణాలు వస్తాయి. తరువాత తగ్గిపోయినట్టుంటుంది. ఇన్‌ఫెక్షన్ పెరిగిన తరువాత ఇతర అవకాశవాద బ్యాక్టీరియా, న్యుమోనియా, బరువు తగ్గడం వంటివి జరుగుతాయి.

**తొలి ఇన్‌ఫెక్షన్ ఫలితం :** 1 వారం. ఇన్‌ఫ్లూయెంజా లాంటి ఒళ్లనొప్పులు, జ్వరం, లింఫ్‌గ్రంథుల వాపు, గొంతునొప్పి, చర్మంలో దురదలు, దద్దుర్లు, తలనొప్పి, వికారం, వాంతులు, కళ్లు తిరగడం.

**తరువాత మలిప్రయాణంలోకి :** 3 నుంచి 20 ఏళ్ల వరకు. బరువు తగ్గడం, జీర్ణాశయ సమస్యలు, కండరాల నొప్పులు, లింఫ్‌గ్రంథుల వాపు, నొప్పి, వ్యాధి తీవ్రతను సీడీ4 కౌంట్ ద్వారా తెలుసుకోవచ్చు.

**ఎయిడ్స్ :** సీడీ 4 కౌంట్ 200 కన్నా తగ్గినపుడు

1) న్యుమోనియా 2) బరువు తగ్గడం(ఎముకల గూడు) 3) గొంతులో క్యాండిడియోసిస్ ఇన్‌ఫెక్షన్లు 4) ఇతర అవకాశవాద బ్యాక్టీరియా, వైరస్, ఫంగస్, పారాసైట్ ఇన్‌ఫెక్షన్లు వస్తాయి.

**హోమియోట్రెండ్స్‌లో చికిత్స :** నూతన పరిశోధన ఫలితాలు, మందుల ద్వారా భరోసా అయిన చికిత్సతో అదుపు చేయవచ్చు. రోగలక్షణాలు, శరీరతత్వము, మానసిక లక్షణాలను క్షుణ్ణంగా పరిశీలించి హోమియో రంగంలో నలభై సంవత్సరాల అనుభవం, నిపుణత, అవగాహన కలిగిన వైద్యులచే చికిత్సను ఇవ్వడం జరుగుతుంది. ఎలాంటి సైడ్‌ఎఫెక్ట్స్ ఉండవు. సీడీ 4 కణాల సంఖ్య పెరుగుతుంది. మానసిక, శారీరక ఆరోగ్యం మెరుగుపడుతుంది.




# వ్రేపల్లెజీవనం:పూతనసంహారం

**దేవి హెచ్చరిక గుండెను చీల్చేస్తోంటే ఆందోళన చెందాడు కంసుడు. కాసేపు అచేతనుడయ్యాడు. తర్వాత తేరుకుని, దేవకీవసుదేవులకు బంధవిముక్తి కలిగించాడు. సమీపానికి రప్పించి, ఆ ఇద్దరినీ అనేకవిధాల గౌరవించాడు. వారికి పాదనమస్కారం చేశాడు. బతిమాలుకున్నాడిలా.**

**మహాపాపిని నేను! మీ పసిపాపలను సంహరించాను. నా ప్రాణాపాయాన్ని తప్పించుకునేందుకు మిమ్మల్ని బంధించి హింసించాను. నన్ను క్షమించండి. పూర్వజన్మకర్మలను అనుసరించి పుణ్యపాపాలు చేస్తున్నారంతా. నేను ఏ జన్మలో చేసుకున్న పాపమో, ఇలా ప్రవర్తించాను. నన్ను మన్నించండి. ఎప్పటిలాగే ఆత్మీయునిగా మీ అక్కున చేర్చుకోండి!**

అన్నా అన్నది దేవకీదేవి. కన్నీరుపెట్టుకున్నది.

నువ్వు అన్నట్టుగానే ఏ జన్మలో చేసిన పాపమో నేను ఈ కడుపుకోత అనుభవించాను. ఇందులో నువ్వు చేసిందేమీ లేదు అన్నది. అతన్ని ఓదార్చింది.

మానవులం మనం. లోభమోహాంధులై అనేక దుష్కర్మలాచరిస్తున్నాం. తప్పదు. భగవంతుడు రాసిన దానికి తిరుగులేదు. నీ తప్పులేదు అన్నాడు వసుదేవుడు. కంసుణ్ణి దగ్గరగా తీసుకున్నాడు. వెళ్ళి రా అన్నాడు. కంసుడు నిష్క్రమించాడప్పుడు. అతనలా నిష్క్రమించడంతో వసుదేవుడు ఇలా నందుని ఇంట ప్రవేశించాడు. కొడుకు పుట్టాడని ఆనందిస్తున్న నందుణ్ణి అభినందించి, చెప్పాడిలా.

నందా! బాలసూర్యునిలా ప్రకాశిస్తున్న ఈ బాలుణ్ణి తీసుకుని నువ్వు వెంటనే వ్రేపల్లెకు వెళ్ళిపో! అక్కడ రోహిణీదేవికి కూడా ఓ కుమారుడు పుట్టాడు. ఆ కుమారుణ్ణి పెద్దవానిగా, ఈ కుమారుణ్ణి చిన్నవానిగా భావించి, ఇద్దరినీ పెంచి పెద్ద చెయ్యి. అనుక్షణం పిల్లలిద్దరినీ వేయికళ్ళతో కనిపెట్టుకుని ఉండు. ఎందుకంటే...వ్రేపల్లె చుట్టూ కారడవి ఉందికదా, అందులోని క్రూరమృగాలు పల్లెలోకి వచ్చి, పిల్లలపై దాడి చెయ్యవచ్చు. అలాగే రాక్షసి పూతన కూడా పిల్లల్ని మట్టుబెట్టే యత్నంలో ఉంటుంది. అప్రమత్తంగా ఉండు. వెళ్ళు! తెల్లవారక మునుపే వ్రేపల్లెకు చేరుకో! కంసునికి కప్పం కట్టడానికే కదా, నువ్వు ఈ మధురానగరానికి వచ్చింది. ఆ పని అయిపోయింది కదా, వెళ్ళు! వేగంగా వ్రేపల్లెకు చేరుకో! అదిగో! పక్షుల కలకలం వినవస్తున్నది. తెల్లవారుతున్నది. ఆలస్యం చెయ్యకు, బయల్దేరు.

సరేనని, బయల్దేరేందుకు సిద్ధమయ్యాడు నందుడు. పురిటిపిల్లాణ్ణి తొట్టెలో పడుకోబెట్టాడు. ఎద్దులు పూన్చిన బండిని ముందుకు నడిపించాడు. భార్య, పరివారంసహా వ్రేపల్లెకు బయల్దేరాడు.

నదీతీరం ఇరువైపులా విస్తరించిన వ్రేపల్లెలో వేకువ కలకలం రేగింది. పక్షుల కలవరం మారుమ్రోగింది. మంచుతో తడిసిన పచ్చిక మేసి, నెమరులు వేస్తున్న గోవులను ఎలుగెత్తి పిలువనారంభించారు గోపాలకులు. పాడి ఆవుల అంబారావాలు ఆలకించినంతనే తల్లిని చేరుకునేందుకు లేగ దూడలు చెంగుచెంగున పరుగులారంభించాయి. నల్లనల్లని మెడలతో, వేలాడుతున్న గంగడోళ్ళతో, పెనురంకెలతో ఆబోతులు, ఎదకొచ్చిన ఆవులను అనుసరిస్తున్నాయి. జబ్బుపడ్డ పశువులకు మందులూ, మాకులూ ఇచ్చి, చికిత్సలు చేస్తున్నారు గోపకులు కొందరు. పడుచులు కడవలు భుజాలపై ఉంచుకుని, యమునలో ప్రవేశించారు. కొందరు పడుచులు పెరుగు చిలకడం ప్రారంభించారు. ఇంకొందరు పాలు, పెరుగు, వెన్న, నెయ్యి అమ్ముతూ వ్రేపల్లెలో తిరగనారంభించారు. పిల్లలకు చల్దులు పెడుతున్నారు తల్లులు. అలాంటి వేళ...ఆనందాలహేలలో నందుడు పిల్లాడిసహా వ్రేపల్లెలో ప్రవేశించాడు.

**చిన్నారి ఏమైపోయాడో అని ఆందోళన చెందాడు నందగోపుడు. ఆ సరికి పల్లెప్రజలంతా చేరి కృష్ణునికోసం వెదకసాగారు. దూరంలో ఏదో పెద్ద చెట్టు కూలినట్టుగా కనిపిస్తే అటుగా పరుగుదీశారంతా. చూశారు. బండిచక్రాల్లాంటి కళ్ళతో, పెద్ద పెద్ద చెట్లలాంటి కాళ్లూ చేతులతో, ముక్కలైన ఎముకలతో మాంసంముద్దగా పడి ఉన్న మృతదేహాన్ని చూశారంతా. భయాశ్చర్యాలతో నిశ్చేష్టులయ్యారు.**

నందునికి ఎదురేగారు గోపప్రముఖులు. కుశల ప్రశ్నలు వేసి, అభిమానాల్ని వ్యక్తం చేశారు.

ఎన్నినోములు నోచిందో! యశోదమ్మ మగ పిల్లాణ్ణి కన్నది. రండి రండి, చూసి వద్దాం అని బయల్దేరారు గోపికలు. గుంపులుగుంపులుగా రాసాగారు. రకరకాల కానుకలను అందించసాగారు.

నవ్వుతున్న పసిపాపణ్ణి ఒడిలోనికి తీసుకున్నారు. నూనెరాసి తలంటారు. శ్రీహరిరక్షపెట్టారు. తొట్టెలో పట్టుపొత్తిలిలో పడుకోబెట్టారు. దీవెనలిచ్చి, మంగళాక్షతలు జల్లారు. కర్పూరనీరాజనాలిచ్చారు. జోల పాటలు పాడారు. లోకాలను జోకొట్టగలిగిన మహనీయునికి గోపమ్మలు జోలపాటలు పాడి జోకొట్టినంతనే, నిద్రవచ్చిందతనికి. అదే అవకాశంగా భార్యసహా నందగోపుడు, రోహిణీదేవిని కలసి, ఆమెకు అనేక బహుమతులు అందజేశాడు. ఆమెబిడ్డను అందుకుని, యశోదకు చూపించాడు. ముద్దులు కురిపించాడు.

రోజులు గడుస్తున్నాయి. యశోదముద్దులపట్టి, రోహిణిచిన్నారి దినదినప్రవర్ధమానం కాసాగారు.

అంతలో కంసుని ఆజ్ఞప్రకారం వ్రేపల్లెలో రాక్షసి పూతన ప్రవేశించింది. గర్భస్థుల సంహారం, పసిపాపలవధ ఆమె పని. అర్ధరాత్రి వారి అన్వేషణలో పడిందామె. నందుని ఇంట యశోదాదేవి పక్కలో వెల్లకిలా పడుకుని ఉన్నాడు చిన్నికృష్ణుడు. కళ్ళు మూసుకుని ఉన్నాడు. గాఢనిద్రలో ఉన్నాడు. చూసింది పూతన. పిల్లాడి తేజస్సు చూసి భయపడింది.

ఈ పాపడు సామాన్య శిశువు కాదు. వీడు కంసభూపతి సంహారం కోసం పుట్టినవాడే! అనుమానం లేదు అనుకున్నది పూతన. ఈ పాపణ్ణి సంహరించి తీరాల్సిందే! తప్పదు అనుకున్నది. కోపోద్రేకంతో వివశురాలైంది. పటపటమని పళ్ళు కొరికింది. గట్టిగా హూంకరించింది. అలా హూంకరించినంతనే ఆమె కళ్ళు రెండూ చండ్రనిప్పులు చెరిగాయి. కోరల నుండి పెనుమంటలు లేచాయి. చేతులు జాచి కృష్ణుణ్ణి అందుకున్నది పూతన. అందుకుని విషంతో నిండిన తన చనుమొనలను అతనినోటిలో ఉంచి, గట్టిగా అదిమింది ఆ రాక్షసి.

గొంతులో పూతన చనుమొన దిగినంతనే చిన్నారికృష్ణుడు కెవ్వుమన్నాడు. ఏడ్చాడు. తర్వాత ఆమె చనుమొనను గొంతు వరకూ దిగమింగాడు. దిగమింగి, నెత్తురు, మాంసం, మజ్జ మొదలైన సప్తధాతువుల్నీ, పంచప్రాణాలనూ ఒకే గుక్కలో కబళించాడు. బాధ తట్టుకోలేకపోయింది పూతన. పెద్దగా కేకలు వేసింది. మొదలు నరికిన చెట్టులా కూలిపోయింది. వినవచ్చిన ఆర్తనాదానికి వ్రేపల్లె ప్రజలంతా మేలుకున్నారు. పరుగు పరుగున వచ్చారు. పూతన ఆర్తనాదానికి యశోదకూడా మేల్కొంది. పిల్లాడికోసం చూసింది. లేదక్కడ. ఆందోళన చెందింది.

భర్తను లేపి, గొల్లుమంది.

చిన్నారి ఏమైనాడు? నందగోపుడు ఆందోళన చెందాడు. ఆసరికి అక్కడకి పల్లెప్రజలంతా చేరుకున్నారు. అందరూ కృష్ణునికోసం వెదకసాగారు. దూరంలో ఏదో పెద్దచెట్టు కూలినట్టుగా కనిపిస్తే అటుగా పరుగుదీశారంతా. చూశారు. బండిచక్రాల్లాంటి కళ్ళతో, పెద్దపెద్ద చెట్లలాంటి కాళ్ళూ చేతుల్తో, ముక్కలైన ఎముకలతో, మాంసం ముద్దగా పడి ఉన్న పూతన మృతదేహాన్ని చూసి, భయాశ్చర్యాలు చెందారు. నిశ్చేష్టులయ్యారు. ఆ మృతదేహమ్మీద బోర్లాపడి ఉండి, సన్నగా రోదిస్తున్న చిన్నారి కృష్ణుణ్ణి చూసింది యశోద. ఒక్క ఉదుటన అందుకున్నది ఆ పసివాణ్ణి. గుండెలకు హత్తుకున్నది.

నాయనా! నా చిట్టితండ్రీ! నీకెంత కష్టం వచ్చిందిరా? అని వలవలా ఏడ్చింది. నందగోపునికి ఏదీ అంతుచిక్కకుండా ఉన్నది. ఈ రాక్షసి ఎవరు? ఎక్కణ్ణుంచి వచ్చింది? ఇక్కడ ఎలా చనిపోయింది? చనిపోయిన రాక్షసి మృతదేహమ్మీద తన చిన్నారి ఎందుకు ఉన్నాడు? యశోద పిల్లాణ్ణి ఎలా విడిచిపెట్టింది?

సమయాసమయాలు ఆలోచించలేదు నందగోపుడు. యశోదను పట్టిపట్టి ప్రశ్నించాడు. ఆమెపై కోపగించాడు.

నా చిట్టితండ్రిని నేనెందుకు విడిచిపెడతాను? ఆకలి వేసి ఏడుస్తోంటే కడుపునిండా పాలు పట్టాను. నిద్రపోతాడని జోకొట్టాను. దీపం పెద్దగా ఉంచితే నిద్రపోడనీ, చిన్నది చేశాను. అయినా నిద్రపోలేదు. ఆడుకుంటూ, నవ్వుకుంటూ ఉన్నాడు. ఇంతలో నాకు నిద్రపట్టింది. ఇలా కళ్ళు మూశానో లేదో అలా కేకలు వినవచ్చాయి. అంతే అన్నది యశోద. పిల్లాణ్ణి మరోసారి గట్టిగా గుండెలకు అదుముకున్నది. అక్కణ్ణుంచి నడచి వస్తూ ఆలోచనలో పడ్డది.

ఈ రాక్షసి ఎవరు? ఎక్కణ్ణుంచి వచ్చింది? దీనికి నా బిడ్డడే ఎందుకు కావాల్సి వచ్చాడు? రాక్షసి చేత పడినా నా బిడ్డ బతికి బయటపడ్డాడంటే...నేనెంత అదృష్టవంతురాలినో! ఆలోచిస్తోంటే అంతా మహామాయగా ఉంది. లేకలేక కలిగిన బిడ్డ. రాక్షసి చేత బడినా ఏమాత్రం వాడని పువ్వులా ఉన్నాడు. నా పూజలు ఫలించి, నా ఒడి చేరాడు మళ్ళీ. ఇంతకన్నా ఆనందం లేదు. నా పాపడు దీర్ఘాయుష్మంతుడు. కలకాలం జీవిస్తాడు అనుకున్నది యశోద. చిన్నారిని పదేపదే ముద్దాడింది.

యశోదను చుట్టుముట్టారు పల్లెప్రజలు. చిన్ని కృష్ణుణ్ణి ఒకరొకరుగా చేరదీసి ముద్దుచేశారు. ఎంత ప్రమాదం తప్పింది? ఎంత ఘోరం జరిగింది? అసలు ఆ రాక్షసి ఎవరు? కృష్ణుడే దానికి ఎందుకు కావాల్సి వచ్చాడంటూ మాట్లాడారు. జాగ్రత్తమ్మా! జాగ్రత్త అంటూ యశోదకు జాగ్రత్తలు చెప్పారు. రాత్రికి రాత్రే పూతన మృతదేహాన్ని పల్లెకి చాలా దూరం ఈడ్చుకుపోయారు. అక్కడ పారవేశారు. తిరిగివచ్చి యమునలో స్నానాలు చేశారు. ఆసరికి తెల్లవారింది. తెల్లవారగానే ఎవరిపనిలో వారు పడ్డారు.



గోమయంతో పొదిపిన ఎర్రమన్నుని చిన్నారి కృష్ణుని నుదుటి మీద తిలకంలా దిద్దాడు నందుడు. వేదమంత్రాశీర్వచన చేశాడు.

నాయనా! ఆ మహావిష్ణువు నీ పురోభాగాన్ని (ముఖాన్ని) ఎల్లప్పుడూ సంరక్షిస్తాడు. అలాగే నీ వెనుకభాగాన్ని ఆ పరమేష్ఠి సంరక్షిస్తాడు. నీ కుడి ఎడమల ఎప్పుడు ఆ పరమశివుని కుమారులు కాపాలాకాస్తారు. నీ మీది కింది నెలవుల్ని చంద్రుడూ, వాసుకీ రక్షిస్తారు. మిగిలిన నీ ప్రదేశాల్ని ఆ ఎనిమిది దిక్కులూ, వాయుదేవుడూ మహాప్రేమతో కాపాడతారు. పరమశివుడు నిన్ను అన్నివేళలా అంటిపెట్టుకుని ఉంటాడు. మన కులానికి ఐశ్వర్యం ప్రసాదించే పినాకపాణి, మంగళ స్వరూపిణులు ధేనువులు, మహాపుణ్యాత్మురాలు భూమాత నిన్ను అనుక్షణం కాపాడతారు అన్నాడు.

ఆ దేవతలతో పాటు నందుడు కూడా ఆ క్షణం నుంచి కృష్ణుణ్ణి కంటికి రెప్పలా కాపాడసాగాడు. కొన్నాళ్ళకు వసుదేవుని ఆజ్ఞమేరకు అక్కడకు బ్రాహ్మణుడు గర్గుడు వచ్చాడు. రోహిణీయశోదల పిల్లలిద్దరికీ జాతకకర్మ సంస్కారం జరిపించాడు. ఆ శుభసమయంలో రోహిణి కుమారునికి బలరాముడు అని, యశోద కుమారునికి శ్రీకృష్ణుడని నామకరణం చేశాడు. చేసి, తాను వ్రేపల్లెకు వచ్చినట్టుగాగానీ, పిల్లలకి నామకరణం చేసినట్టుగాగానీ ఎవరికీ తెలియరాదన్నాడు. నందుణ్ణి ఆ విషయమై హెచ్చరించి మరీ అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

పూతన మరణవార్త వేగులు ద్వారా విని కంసుడు భయాందోళనలు చెందాడు. చంపిందెవరు? నందగోపుని కుమారుడు. వాడు అసామాన్యుడు అనుకున్నాడు. దేవి చెప్పిన మాటలు నిజమవుతాయా? కిందుమీదులయ్యాడు కంసుడు. శకటాసురుడు, తృణావర్తుడుసహా మరికొంతమంది రాక్షసుల్ని కేకేసి, త్వరలోనే నందగోపుణ్ణీ, అతని కుమారుణ్ణీ హతమార్చమని ఆదేశించాడు. రాజాజ్ఞ స్వీకరించి శకటాసురుడు వ్రేపల్లెను చేరాడు. అక్కడ వరుసగా నిలబెట్టిన నందగోపుని శకటాలలో ఒక దానిలో ఆవేశించాడు. ఎవరూ కనిపెట్టని విధంగా, జాగ్రత్తగా అందులో దాగున్నాడు.

కృష్ణుడిప్పుడు పదేపదే బోర్లాపడుతున్నాడు. చూసి ఆనందిస్తున్నది యశోద. పిల్లాడికి ఆరోజు అభ్యంగనాన్ని ఉత్సవంగా చేయదలచిందామె. పల్లెలోని పడుచులందరినీ పిలిచింది. వేదమంత్రఘోషతో కృష్ణునికి తలంటి, బ్రాహ్మణుల ఆశీర్వచనాలు అందించింది. వారికి గోవులు, బంగారం బహూకరించింది. కృష్ణునికి పాలిచ్చి జోకొట్టింది. నిద్రపోయాడు కృష్ణుడు. చల్లనిచెట్ల నడుమ, ఓ శకటం దిగువన మెత్తని పానుపుపై పిల్లాణ్ణి పడుకోబెట్టి, స్నానానికి పడుచులసహా యమునకు వెళ్ళింది యశోద.

—అరణి

# ప్రాణాలు రక్షించే రహస్యం



భయంకరమైన యుద్ధాలు గెలిచి రాజ్యాలేలిన రాజుల్ని ఆరాధిస్తాం. లక్షల మందిని పొట్టన పెట్టుకున్న ప్రమాదాలు, ప్రకృతి వైపరీత్యాల నుంచి తప్పించుకుని బతికి బయటపడిన వ్యక్తుల్ని అదృష్టవంతులుగా భావిస్తాం. ఆ దుర్ఘటనల నుంచి వాళ్లను కాపాడిందెవరు? వాళ్లు చేసిన పుణ్యాలా? వాళ్లు నమ్ముకున్న దేవుళ్లా?

## న్యూరో సైన్స్ నిజం

ఓ భయంకరమైన భూకంపం సంభవిస్తుంది. వేలాదిమంది ప్రాణాలు కోల్పోతారు. ఒక్కొక్కటిగా శిథిలాలను తొలగించటం మొదలుపెడితే పదుల సంఖ్యలో శవాలు బయటపడుతూ ఉంటాయి. ఊపిరాడక కొందరు, భయంతో ఇంకొందరు, ఆకలితో మరికొందరు... ఇలా ఎంతోమంది ప్రాణాలు కోల్పోయి కనిపిస్తారు. ఇక ఏ ఒక్క ప్రాణం మిగల్లేదని నిట్టూరుస్తూ వెనుదిరుగుతుంటే అట్టడుగున్న శిథిలాల నుంచి మూలుగు వినిపిస్తుంది. క్రేన్ల సహాయంతో వాటిని తొలగించి చూస్తే ఒంటి మీద చిన్న దెబ్బ కూడా తగలని ఓ వ్యక్తి కనిపిస్తాడు. అతన్ని చూసిన సహాయక సిబ్బంది ఆశ్చర్యపోతారు. అన్ని రోజులుగా నీరు, ఆహారం లేకుండా ఆ వ్యక్తి ఎలా బ్రతకగలిగాడు? అదో పెద్ద సంచలన వార్త. అదే స్థితిలో చిక్కుకున్న వేలాదిమంది ప్రాణాలు కోల్పోతే ఆ ఒక్క వ్యక్తి ఎలా ప్రాణాలు నిలబెట్టుకోగలిగాడు? ఇలాంటి సంఘటనలకు ఆధ్యాత్మిక రంగును పులమకుండా వైజ్ఞానిక కోణంలో ఆలోచించగలిగితే సమాధానం తేలికగానే దొరుకుతుందని పరిశోధకులు అంటున్నారు. ఓ ప్రమాదకర సంఘటన నుంచి తప్పించుకోగలిగే నేర్పరితనం మనిషికి తన పూర్వీకుల నుంచి సంక్రమించిందనేది వారి వాదన. ప్రమాదాన్ని పసిగట్టి దాన్నుంచి తెలివిగా బయటపడగలిగే మెళకువలు, స్పందించే గుణాలు కాలానుగుణంగా పరిణామక్రమంలో భాగమై మనిషి మెదడును తదనుగుణంగా మలుస్తూ వచ్చాయి. ఆధునిక యుగంలో భయంకరమైన ప్రమాదాల నుంచి తప్పించుకున్న వ్యక్తుల అనుభవాలను అధ్యయనం చేసినప్పుడు ఎన్నో ఆసక్తికర అంశాలు వెలుగులోకొచ్చాయి. ఆ సందర్భంలో వారి మానసిక, భావోద్వేగ నైజాలు సదరు ప్రమాదం నుంచి తప్పించుకోగలిగే లేదా బ్రతికి ఉండగలిగే మార్పులు ఆ సమయంలో వారి మెదళ్లలో చోటు చేసుకున్నాయని పరిశోధనల్లో తేలింది.





## విభిన్నమైన 'దృష్టి కోణం'

ప్రకృతిలోని అన్ని జంతువుల్లాగే మనకూ రెండు కళ్లున్నాయి. తల ముందువైపుండే ఈ రెండు కళ్లు వేర్వేరు దృశ్యాలను చూస్తాయి. విజువల్ కార్టెక్స్, ఎక్స్‌ట్రాసెట్రెయిట్ కార్టెక్స్ అనే ఈ విజువల్స్ రెండూ కలిసి ఒకే దృశ్యంగా మనకి కనిపిస్తుంది. అందుకే మనిషి చూపును 'బైనాక్యులర్ విజన్' అంటారు. ఈ చిత్రమైన నిర్మాణం వల్ల మనం దృశ్యంలోని లోతును, వస్తువుల మధ్య దూరాన్ని, కోణాన్ని స్పష్టంగా అంచనా వేయగలుగుతున్నాం. చీకట్లో నుంచి పొడుచుకొచ్చే సన్నని వెలుగును చూడగలం, అస్పష్టమైన దృశ్యంలోని నిర్దిష్ట వస్తువునూ గమనించగలం. ఇందుకోసం మన రెటీనాల్లోని 'ఎమ్ సెల్స్' అనే న్యూరాన్స్ వేగంగా కదిలే దృశ్యాన్నీ స్పష్టంగా కనిపెట్టగలుగుతాయి. కాబట్టే ఒకప్పుడు దగ్గరకొచ్చే బాణాన్నీ కనిపెట్టగలిగాం, ఇప్పుడు మన ముందు నుంచి వేగంగా దూసుకెళ్లిన కారునూ గుర్తుపట్టగలుగుతున్నాం, ఈ అపూర్వ లక్షణమే మన పూర్వీకుల ఆహార వేటకు, ప్రాణాలు దక్కించుకుని మనుగడ సాగించటానికి దోహదపడ్డాయి.

## ఆశ్చర్యపరిచే ఆలోచనా శక్తి

చాలా సమయాల్లో మనం ఒంటబట్టించుకునే తీరు క్రమక్రమంగా పెరుగుతూ పోతుంది. అంటే.. చర్యలు, సంఘటనల మధ్య కనెక్షన్ ఏర్పడటానికి సమయం పడుతుంది. కానీ కొన్ని విపత్కర సందర్భాల్లో ఈ తీరు పూర్తిగా మారిపోతుంది. 'వన్ షాట్ సిస్టమ్' తరహా నేర్పరితనానికి మారిపోతాం. ప్రమాదాన్ని గ్రహించి త్వరిత నిర్ణయాలు తీసుకుంటాం. ఉదాహరణకు...ఓ రకం పుట్టగొడుగులు తిన్నప్పుడు ఆరోగ్యం పాడైతే నిజానికి ఆ అనారోగ్యానికి పుట్టగొడుగులే కారణమని నిర్ధారణ కాకపోయినా ఆ తర్వాత అలాంటి రూపం ఉన్న ఏది తినాలన్నా అయిష్టపడతాం. మానవ సంబంధాల్లో నమ్మకాలు కొరవడటానికి ఇలాంటి వన్ షాట్ సిస్టమే కారణం. ఎప్పుడో ఒకరివల్ల మోసపోతే అదే రూపం ఉన్న వేరే వ్యక్తినీ అనుమానిస్తాం. ఇలాంటి మన ప్రవర్తన, ప్రతిస్పందనలకు ఆయా సందర్భాల్లో ప్రేరేపితమయ్యే మెదడులోని ప్రిఫ్రాంటల్ కార్టెక్స్, హిప్పోకాంపస్ ప్రదేశాలలో కలిగే మార్పులే కారణాలు.

## ప్రమాదం నుంచి గట్టెక్కించే 'సెన్సరీ సిస్టమ్'

శత్రు జాతుల నుంచి, అడవి జంతువుల నుంచి తమను తాము కాపాడుకోగలిగే మన పూర్వీకుల సహజసిద్ధమైన సన్నాహం, ఇంద్రియ జ్ఞానం మానవ పరిణామక్రమంలో భాగంగా అభివృద్ధి చెందుతూ మన దాకా వచ్చింది. అలా వాళ్లు పరిస్థితులకు తగ్గట్టుగా మెళకువలు అలవరుచుకోలేకపోతే ఇప్పుడింతటి స్థాయికి పరిణామం చెంది ఉండేవాళ్లం కామేమో! అలా వాళ్ల నుంచి అంది పుచ్చుకున్న ఇంద్రియ జ్ఞానాల్లో ప్రధానమైనది 'దృష్టి'.

## విస్తుపరిచే 'వినికిడి'

సర్వైవల్ టెక్నిక్‌లో మనకు తోడ్పడే మరో అంశం 'వినికిడి'. మనం దృష్టికి అందని విషయాలను వినికిడితో కనిపెట్టగలం. కారు చీకట్లో దాగిన దొంగనీ గమనించగలం. మూలల్లో నక్కిన పాము ఉనికినీ తెలుసుకోగలం. ఈ నేర్పరితనం వినికిడి శక్తిని మెరుగుపరుచుకున్న మన మెదడు నుంచి పొందుతున్నాం. నిజానికి దృశ్యపరమైన సమాచారం కంటే వినికిడి సమాచారం 20 నుంచి 100 రెట్లు వేగంగా మన మెదడుకు చేరి ఆలోచనా స్ఫృహను ప్రేరేపిస్తుంది. ప్రమాదాన్ని మన మెదడు పసిగట్టినప్పుడు లేదా ఓ ఇబ్బందికరమైన సంఘటనను ఎదుర్కోవలసి వచ్చినప్పుడు సర్వైవల్ మోడ్‌లోకి చేరుకుంటాం. అది ఎంత చిన్న ప్రమాదమైనా మన మెదడులో ప్రతిస్పందన మొదలై కార్టిసాల్, అడ్రినలిన్ హార్మోన్లు విడుదలవుతాయి. తార్కిక ఆలోచనకు, రీజనింగ్‌కు తోడ్పడే మెదడులోని ఫ్రొంటల్ లోబ్‌లోకి న్యూరోకెమికల్స్ ఉధృతంగా చేరుకుంటాయి. దాంతో ఫైట్ ఆర్ ఫ్లయిట్..అంటే ఆ సందర్భంతో పోరాడటం లేదా పారిపోవటం అనే రెండు అంశాలే తక్షణ ప్రాధామ్యాలవుతాయి. ఇలాంటి ఒత్తిడితో కూడిన సందర్భాల్లో మన దృష్టి కోణం కూడా మారుతుంది. ఓ సొరంగంలోకి చూస్తున్నట్టు మన చూపు ప్రమాదం నుంచి తప్పించుకోగలిగే సులువైన, వేగవంతమైన మార్గం మీదే కేంద్రీకృతమవుతుంది. మన మెదడులోని సర్వైవల్ ఎక్విప్‌మెంట్ ఆ మార్గాన్ని వెతికే పనిలో నిమగ్నమవుతుంది. దారి తప్పి అడవిలో సంచరించే మన పూర్వీకులకు, అడ్రస్ దొరకక ప్రతి సందూ తిరిగే మనకూ ఉపయోగపడుతున్నది ఈ సర్వైవల్ ఎక్విప్‌మెంటే! మన మెదడులోని హిప్పొకాంపస్ అనే ప్రదేశంలోని న్యూరాన్లు జ్ఞాపకాల నుంచి సమాచారాన్ని సేకరించి దారి కనిపెట్టటానికి తోడ్పడతాయి. మెదడులోని ఎంటార్హినల్ కార్టెక్స్ అనే మరో ప్రదేశంలో ఉండే గ్రిడ్ సెల్స్, ఆ ప్రదేశానికి నమూనా రూపాన్నిచ్చి గ్రాఫ్ పేపర్‌లా తయారుచేసుకుంటాయి.







## సక్సెస్‌ఫుల్ 'సర్వైవల్ టెక్నిక్స్'

సహజంగా పుణికిపుచ్చుకున్న సర్వైవల్ ఎక్విప్‌మెంట్‌తోపాటు క్లిష్ట సమయాల్లో కొంతమంది ఇతరుల కంటే మెరుగ్గా స్పందించే తత్వాన్ని అలవరుచుకుంటారు. తుపాన్లు, భూకంపాలు, రోడ్డు ప్రమాదాలు...ఇలాంటి భయంకరమైన సంఘటనల నుంచి బతికి బయటపడిన వ్యక్తుల మీద జరిపిన పరిశోధనలో ఆయా సమయాల్లో వాళ్ల ప్రవర్తన ఒకే తీరులో ఉన్నట్టు పరిశోధనల్లో తేలింది. ప్రమాదానికి గురైనప్పుడు షాక్‌కు లోనై కంగారులో మెదడు మొద్దుబారిపోయి, తమకు కలిగిన కష్టానికి కుంగిపోయేవారికి భిన్నంగా వాస్తవాన్ని చటుక్కున ఆకళింపు చేసుకుని అందుకు తగ్గట్టు స్పందించే గుణం, రక్షణ కోసం ఎంచుకోవాల్సిన మార్గాన్వేషణ ఈ వ్యక్తుల్లో కనిపించాయి. అంతేకాదు...ఈ వ్యక్తులు ఆ పరిస్థితిని అధిగమించటానికి తమకున్న శారీరక పరిమితుల పట్ల స్పష్టమైన అవగాహన కూడా కలిగి ఉంటున్నారు. కాబట్టే ఎంత శక్తిని నిల్వ చేసుకోవాలి, ఎప్పుడు అవసరానికి మించి శ్రమించాలి అనే విషయాల్లో వాళ్లకి స్పష్టత ఉంటుంది. అదే సమయంలో అవసరమైనప్పుడు నియమాలు ఉల్లంఘించేందుకూ వెనకాడని స్వేచ్ఛాపూరిత ఆలోచనాపరులై కూడా ఉంటారు. అన్నిటికంటే ముఖ్యంగా అలా ప్రమాదాల నుంచి బయటపడిన వాళ్లు బలమైన కుటుంబ సంబంధాలు కలిగినవాళ్లై ఉంటున్నారు. తమ వాళ్లని తిరిగి చూడాలనే బలమైన కోరిక కూడా ఆ దుర్ఘటన నుంచి నిలదొక్కుకోగలిగే మానసిక స్థైర్యాన్ని వాళ్లకిస్తోంది. విపత్కర పరిస్థితిలో చిక్కుకున్నప్పుడు దాన్నుంచి బయటపడే మార్గానికి అడ్డుపడే డిస్ట్రాక్షన్స్, భయాలను తప్పించుకుని పరిస్థితులను విశ్లేషించే నేర్పరితనం ఉండటాన్ని కూడా పరిశోధకులు గుర్తించారు. ఇలాంటి వ్యక్తులు తమ ఆధీనంలోకి తెచ్చుకోగల అంశాల మీద మాత్రమే దృష్టి పెట్టి పరిస్థితిని మెరుగుపరిచే పనులను ఎంచుకుంటారు. కొందరు ఇందుకు పూర్తి విరుద్ధం. ఆపదొస్తే భయంతో అన్ని దిశల్లో పరిగెత్తి పరిస్థితిని మరింత క్లిష్టం చేసుకుంటారు. ఇలాంటి పరిస్థితిలోనే ఇంకొందరు చురుగ్గా ఆలోచిస్తారు. తమ చుట్టూ జరిగే విషయాల్ని ఆకళింపు చేసుకుని తప్పించుకునే మార్గాన్ని నిర్దేశించుకుంటారు. ఇలాంటి అతికొద్దిమంది వ్యక్తులే మనం అనుకునే అదృష్టవంతులు. ఫైట్ ఆర్ ఫ్లయిట్ సందర్భాల్లో ఉవ్వెత్తున ఉరకలేసే అడ్రినలిన్ హార్మోన్‌ను సద్వినియోగం చేసుకుని తత్ఫలితంగా మార్గాన్ని అన్వేషించే ఈ అదృష్టవంతులే మనకు భూ శిధిలాల మధ్య, సముద్రాల్లో, ఎడారుల్లో, అడవుల్లో, తుపానుల్లో ప్రాణాలు దక్కించుకున్న అపూర్వ వ్యక్తులు.

## పోటీ పడటం కాదు, సహకరించాలి

మరో సర్వైవల్ టెక్నిక్...ఇతరులతో కలిసి సమస్యతో పోరాడటం. మానవ జాతి పరిణామానికి ముఖ్యమైన కారణం ఇదే! 2,00,000 ఏళ్ల నుంచి క్రమక్రమంగా సమాజపరమైన క్లిష్టతలను డీల్ చేస్తూ, ఉన్నతమైన మానవ జాతిగా పరిణామం చెందటానికి తోడ్పడింది ఈ నైజమే! కాబట్టే మిగతా జంతువులతో పోలిస్తే మన ప్రీఫ్రొంటల్ కార్టెక్స్ కాలక్రమేణా పెద్దదిగా ఎదుగుతూ వచ్చింది. పూర్వీకుల నుంచి వంశపారంపర్యంగా మనకు కొంత బ్రెయిన్ ప్రోగ్రామింగ్ సంక్రమించినా, కాలక్రమేణా అదే మెదడులో ఇతర సర్క్యూట్‌లు అభివృద్ధి చెందాయి. మనం తప్ప మరే ఇతర జంతువూ తన జాతికే చెందిన ఇతర గుంపుతో కలవదు. మనుషుల్లా జంతువులు సమిష్టిగా ఓ సమస్యకు వ్యతిరేకంగా పోరాడలేవు.

అయితే ప్రమాదాల నుంచి బయటపడిన వ్యక్తుల పట్ల సమాజం తీరు వాస్తవానికి దూరంగా ఉంటోంది. వ్యక్తికి ప్రకృతిసిద్ధంగా అబ్బిన నైపుణ్యాలు, మెళకువలు, వాటిని ఉపయోగించే తెలివితేటలు, తార్కిక శక్తి...వీటిని పక్కనపెట్టి ఆ శక్తికి కారణం కూడా దైవమేననే అర్థం లేని తర్కం వెలికితీయటం అలవాటైపోయింది. పరిస్థితులు పగబడితే అగచాట్లు తప్పవనే ధోరణి నుంచి...తలచుకుంటే మనిషికి అసాధ్యమైనదేదీ లేదనే తత్వాన్ని అలవరుచుకుని, ప్రమాదాల నుంచి ప్రాణాలు రక్షించుకోగలిగిన వ్యక్తుల ధీరత్వాన్ని అభినందించాలి.

—గోగుమళ్ల కవిత



# జర్నీ

-అనపర్తి సీతారామ్



**రైలు మెల్లగా కదిలి క్రమంగా వేగం పెంచుకుంటోంది. తన లగేజి మరోసారి చెక్ చేసుకొని విండో పక్కన సీట్లో కూర్చుంటూ ఎదురుగా కూర్చున్న యువతివైపు చూసింది కాంచన. సన్నగా, పొడుగ్గా, నాజూకుగా ఉంది. గోధుమ రంగు చాయ, మోములో చంద్రకాంతి ఆమెనిట్టే ఆకర్షించాయి.**

**విశాల నయనాలు, గులాబీరంగు పెదవులపై సహజమైన చిరునవ్వుతో చక్కని ఆర్గండీచీరలో హుందాగా ఉంది.**

**కాంచన ఆమెని పరిచయం చేసుకోవాలనుకుంది.**

ఆమె మాత్రం సీరియస్‌గా పుస్తకం చదువుకుంటోంది. దాంతో డిస్టర్బ్ చేయాలనిపించలేదు.

అయిదుగంటలు నిరంతర ప్రయాణం. ప్రయాణంలో ఉన్నప్పుడు నోరు మూసుకొని కూర్చోవడం తనకి అలవాటులేదు. ఇద్దరు ఆడవాళ్ళు గలగలా కబుర్లు చెప్పుకుంటూ, ముచ్చటించుకుంటూ కలిసి ప్రయాణించడమంటే తనకెంతో ఇష్టం. అర్జెంటుగా పుట్టింట్లో పనిబడి ఒంటరిగా బయలుదేరింది తప్ప ఆయన గానీ, పిల్లలుగానీ వెంట లేనిదే తానెక్కడికీ వెళ్ళదు.

ప్రయాణంలో ఎందరో వ్యక్తులు ఎదురవుతారు. కొందరు పరిచయమవుతారు. కొందరి పరిచయం పెరిగి పెద్దదై స్నేహితులవుతారు. కొందరు మాటల మధ్యలో బీరకాయపీచు బంధుత్వమేదో కలిపి తామూ బంధువులై పోతారు.

అయినా ఇద్దరు ఆడవాళ్ళ మధ్య పరిచయం పెరగటానికి ఏమంత సమయం పట్టదు. కానీ ఇక్కడ పరిస్థితి భిన్నంగా ఉంది. రైలు కదిలి అర గంట గడిచినా ఇద్దరిమధ్యా ఒక్కమాట కూడా పొర్ల లేదు. అసలు ఆ యువతి తనని చూసినట్టు లేదు.

ఆమె సంగతి సరే, తానైనా ముందు మాట్లాడి పరిచయం చేసుకోవచ్చుగా. ఈ పిల్లధోరణి చూస్తే ఎవరితోనూ మాట్లాడేలా లేదు. ఒకవేళ అహంకారమా? అనుకుంటే మనిషి అలా కనిపించటం లేదు. పర భాష పిల్లా కాదు. అచ్చమైన తెలుగమ్మాయేనని కట్టూ బొట్టూ స్పష్టం చేస్తున్నాయి.

ఆలోచిస్తూ ముందుగా తానే పలకరించి పరిచయం చేసుకుందామనుకుంది కాంచన. కాని ఆ యువతి ఆమెవైపు చూస్తేనా! వెంటనే కాంచన ఏమనుకుందో మరి ఆ యువతిని పలకరించే ప్రయత్నం మానుకుని చూపుమరల్చి బయట

ప్రకృతిదృశ్యాలవైపు దృష్టి సారించింది.

అరనిమిషం గడిచేసరికి తనకు తెలియకుండానే కాంచన దృష్టి మళ్ళీ ఆ యువతిమీదకు మళ్ళింది. బోగీలో ఎంతోమంది ప్రయాణికులున్నా ఎందుకో ఆ యువతితోనే మాట్లాడాలనిపిస్తోంది. ఇద్దరి మధ్యా పరిచయం పెరిగి హాయిగా నాలుగుమాటలు మాట్లాడుకుని కబుర్లతో ప్రయాణం కొనసాగిస్తే ఇద్దరికీ ఎంతో ఆనందదాయకంగా ఉంటుంది కదా! ప్రయాణంలో మాటామంతీ కలవటానికి వెనుకటి పరిచయాలు, పలకరింపులు అక్కరలేదు. చిన్న చిరునవ్వు, ఒక్కమాట చాలు.

ట్రైన్ ఏదో స్టేషన్‌లో ఆగింది.

ఆ విషయం ఆ యువతికి పట్టలేదు. పుస్తకంలో నుంచి తలెత్తలేదు. ట్రైన్ ఆగిందన్న విషయం కాంచనకీ పట్టలేదు. ఆ యువతిమీద నుండి చూపు మరల్చలేదు.

ఎంత అందంగా, ఒద్దికగా కూర్చుంది. మాట్లాడక్కరలేదు. చూపులతోనే తనని పలకరించవచ్చు కదా. అయినా తనేమైనా మగవాడా ఆమె అంత బెట్టుగా కూర్చోవటానికి.

అయ్యో! అది బెట్టు కానట్టుంది. ఎదుటివారిని పట్టించుకోని తత్త్వమూకాదు. సరేలే. ఏదో పరీక్షలకు ప్రిపేరవుతోందని అనుకోవటానికీ లేదు. ఎందుకంటే ఆమె చదువుతున్నది ఆరుద్ర 'త్వమేవాహం'.

ఇక ఉపేక్షించి లాభంలేదు. తనను తాను పరిచయం చేసుకుని పేరు అడుగుదాం. తర్వాత ఏ ఊరు వెళుతోందో ప్రశ్నించి ఆమె చదువుతున్న పుస్తకం గురించి కాసేపు చర్చిద్దాం. ఆరుద్రత్వమేవాహం తనూ చదివి ఆనందించిందిగా. అనుకున్నదే తడవుగా కాస్త ముందుకి జరిగి చప్పున అంది.

"ఆరుద్రగారి సాహిత్యమంటే నాక్కూడా చాలా ఇష్టం".

కనురెప్పల్ని అలవోకగా పైకెత్తి అలాగా అన్నట్టు చిరునవ్వుతోచూసి తిరిగి పుస్తకంలో లీనమైంది.

అయ్యో రామా! చూస్తే ఈ పిల్లకి కాస్త పొగరు ఎక్కువలాగే ఉంది. ట్రైన్ ఎక్కిందిమొదలు చుట్టూ ఉన్న మిగిలిన ప్రయాణికుల సంగతి పక్కనబెడితే ఎదురుగా ఉన్న తనతోనూ మాట్లాడలేదు, కన్నెత్తి చూడలేదు.

చూస్తే ఇంకా పెళ్ళి కానట్టుంది. ఇప్పుడే ఇంత పొగరుంటే ఇక పెళ్ళయ్యాక మొగుడు ఏ పెద్ద ఆఫీసరో అయితే ఇక చెప్పేదేముంది? అసలు ఏం చూసుకుని అంత నిర్లక్ష్యం?

ఆ విషయమే తెలుసుకుందామనుకుంటే పుస్తకం తప్ప ఆమెకి మరో ప్రపంచం లేనట్టుంది. సరదాగా కాలక్షేపం అవుతుందనుకుంటే తనంటే పట్టనట్టే కూర్చుంది.

సరే! మరోసారి ప్రయత్నిద్దాం.

అప్పటికీ మాట్లాడకపోతే నాలుగు మాటలు దులిపేద్దాం. చెడామడా తిట్టేద్దాం అని గట్టిగా తీర్మానించుకుంది. మాట్లాడటం ఎందుకు? చేతిలో పుస్తకం లాక్కుంటే అప్పుడేం చేస్తుంది? బోరుకొట్టి చక్కగా మాట్లాడుతుంది, అనుకున్నదే తడవుగా కాంచన,

"హలో! ఒకసారి ఆ పుస్తకం ఇస్తారా?" అని అడిగింది.

ఆ యువతి మల్లెపువ్వు విచ్చుకున్నట్టు నవ్వి ఇబ్బంది లేనట్టుగా తను చదువుతున్న పేజీనెంబరు గుర్తు పెట్టుకొని పుస్తకంమూసి కాంచనకి అందించి కిటికీలో నుండి బయటకు చూడసాగింది. అడగ్గానే అంత నమ్రతగా పుస్తకం ఇచ్చినందుకు ఏమనటానికీ కాంచనకి నోరు రాలేదు. అయినా ఎప్పుడూ పుస్తకం మొహం చూడనట్టుగా ఆ పిల్లనే అడగాలా తను? ఎందరో మహారచయితల సాహిత్య గ్రంథాలు ఎన్నో కొని చదివి ఇంట్లో దాచుకుంది తను. త్వమేవాహం ఇప్పటికి రెండుసార్లు చదివింది. ఆమె పుస్తకంతో ఇక తనకేం పని?! అనుకుంటూ అటూఇటూ రెండుసార్లు పుస్తకం తిరగేసి "ఇదిగోనండి మీ పుస్తకం మీరు తీసుకోండి" అని ముఖం మీద కొట్టినట్టుచెప్పి విసురుగా పుస్తకం ఆమె చేతిలో పెట్టి కిటికీలోనుంచి దూరంగా కనిపిస్తున్న పచ్చటి పైరుని ఎత్తైన కొండల్ని చూస్తూ ఉండిపోయింది.

ఆ యువతి పుస్తకం అందుకుని పోయిన ప్రాణం తిరిగొచ్చినట్టు భావించి క్షణంలో పుస్తకంలో లీనమైపోయింది. ఆ చర్యకి తల గిర్రున తిరిగింది కాంచనకి. అప్పటికే ఆమె అహం దెబ్బతింది. మనసులో పరిపరివిధాల ఆలోచనలు చోటు చేసుకున్నాయి.

ఏదో కాస్త అందంగా, చూడముచ్చటగా కనిపిస్తే ఆమె మాట్లాడకపోయినా తనక్కూడా కాలక్షేపంగా ఉంటుందని చొరవ తీసుకొని పలకరించబోతే ఎంత బెట్టు చేస్తోంది. అందం ఉంటే సరిపోయిందా? అందమైన మనసు కూడా ఉండాలి. అయినా అంత అందంగా ఏం లేదు!

సన్నగా ఉందేగానీ ఆరోగ్యంగా కనిపించటం లేదు.

పొడుగ్గా ఉందేగానీ శరీరంలో పొందికలేదు.

చీర కట్టుకుందికాబట్టి ఆ మాత్రమైనా చూడగలుగుతున్నాం. ఇక మోడ్రన్‌డ్రెస్‌లో అయితే అసలు చూడలేం? అసలు ఆమేదీ ఒక అందమేనా! ఆమెతో తను పరిచయం కోరుకుందేగానీ ఈ బోగీలో ఒక్కరైనా ఆమెని కన్నెత్తి చూశారా? ఆ మాటకొస్తే ఆ చివరకూర్చున్న కాలేజీ యువకుడు వైజాగ్‌లో ట్రైన్ బయలుదేరినప్పటి నుండి చూపులతో తనని తినేస్తున్నాడు. యువతిని వదిలిపెట్టి పెళ్ళై ఇద్దరు పిల్ల

## యంగ్ హీరోతో రకూల్ ప్రేమాయణం?

ఆ హీరో కమ్ విలన్ పేరు ప్రస్తుతం దేశవ్యాప్తంగానే కాకుండా, ప్రపంచ వ్యాప్తంగా మారుమ్రోగిపోతోంది. ఒక భాష అని కాకుండా అన్ని భాషల్లోనూ ఆయన గారి అభిమానుల సంఖ్య రోజురోజుకీ పెరిగిపోతోంది. అలాంటి సెలబ్రిటీ మీద మనసు పారేసుకుంది రకూల్‌ప్రీత్ సింగ్! ఇద్దరూ చెట్టాపట్టాలేసుకుని తెగ తిరుగుతున్నారట! ప్రస్తుతం చేతిలో ఉన్న సినిమాలతో రకూల్ ఎంత బిజీగా ఉన్నా కాస్త సమయం అన్నా అతగాడికి కేటాయిస్తోందట! దాంతో వీరిద్దరి మధ్యా సమ్‌థింగ్ సమ్‌థింగ్ నడుస్తోంది అంటున్నారు సినీజనాలు.

**రైలు ఎక్కింది కాంచన. ఎదురుగా అందమైన అమ్మాయి. ఎంతో పొందికగా కూర్చుని చక్కగా పుస్తకం చదువుకుంటోంది. ఆమెను పరిచయం చేసుకోవాలని తహ తహలాడి మాట కలిపే ప్రయత్నం చేసింది. కానీ సాధ్యపడలేదు. అహం కారిలా లేదు, కట్టూ బొట్టూ తెలుగమ్మాయి లానే ఉంది. మరేంటబ్బా! అనుకుని ఆమె చేతిలో పుస్తకం లాక్కునేందుకు తెగించింది కాంచన! తర్వాత ఏమైంది?**

లున్న తననే ఆ కుర్రవాడు పదేపదే చూస్తున్నాడంటే ఆమెకంటే తనే అందంగా ఉందని అనుకోవచ్చు కదా! ఆ పిల్ల మాట్లాడకపోతేనేం కాలక్షేపానికి ఆ కుర్రాణ్ణి చూపులతోనే ఆట పట్టించవచ్చు అని కాంచన లోలోన సతమతమవుతూ ఒక చూపు అటు విసిరి దృష్టి బయటకు సారించింది.

పసిపిల్లల కేరింతలు, యువతీయువకుల అంతర్జాతీయ చర్చలు, మగవాళ్ళ రాజకీయ తగవులు, ఆడవాళ్ళ మధ్య అంతులేని కబుర్లు, వృద్ధులు వల్లె వేస్తున్న అనుభవాలతో కంపార్టుమెంటు సందడిగా ఉంది. అవేవీ కాంచన కంటికి కనిపించడంలేదు. చెవులకి వినిపించడంలేదు.

ప్రవాహంలా సాగిపోతున్న ట్రైన్‌కి తుని స్టేషన్‌లో బ్రేక్ పడింది.

అప్పటికే సమయం మధ్యాహ్నం రెండు దాటింది.

పద్నాలుగేళ్ళ కుర్రవాడు కంపార్టుమెంటులోకి ప్రవేశించాడు. మాసిపోయిన నిక్కరు, చిరిగిపోయిన చొక్కా, తైలసంస్కారం లేని జుట్టు, మొహంలో నిర్మలమైన బాల్యం, చేతిలో ఈతచెట్టు ఆకులతో కట్టిన చీపురుకట్ట. ఆ కుర్రవాడు రావటమే ఆలస్యం గబగబా తన పనిలో నిమగ్నమయ్యాడు. మోకాళ్ల మీద కూర్చుని సీట్ల కిందకిదూరి చెత్తంతా ఒకచోట చేర్చి బయట పారబోశాడు. అంతా శుభ్రంగా తుడిచి చీపురుకట్ట డోర్ దగ్గర వదిలి ప్రయాణికుల ముందుకు వచ్చి చేయిచాచి దీనంగా అడగసాగాడు.

టీ, టిఫిన్, అరటిపండ్లు, బ్రెడ్ ఆమ్లెట్.. ఎవరికి కావలసినవి వారు కొనుక్కుని తింటున్నారు. ఎవరూ ఆ కుర్రాణ్ణి పట్టించుకోవటం లేదు.

కాంచన నాలుగు అరటిపండ్లు కొని రెండు ఆ కుర్రవాడికిచ్చి, రెండు తన దగ్గరుంచుకుంది ఆకలి వేసినప్పుడు తినొచ్చులే అని. ముందుసీట్లో కూర్చున్న యువతి పుస్తకం పక్కనబెట్టి వ్యానిటీ బ్యాగ్ తెరిచింది. ఆ కుర్రవాడికి డబ్బులిస్తుంది కాబోలు అనుకుంది కాంచన ఆమెనే గమనిస్తూ.

## అమ్మ నీరసించినప్పుడు ...!

**కవిత**

ఎనభై ఏళ్ళ  అలుపెరుగని ప్రవాహం
అనంతరం ఇప్పుడో  విరామం...
అమ్మ నీరసించి
మునుపటిలా ఉండలేక పోతుంది
కుటుంబ వాక్యపు అక్షరాల్ని కూర్చుకుని
ప్రేమతో పెంచి, లాలించి, మురిసింది
కోట్ల కొద్దీ జ్ఞాపకాల్ని



కొంగున కట్టుకు తిరిగింది
చిన్నప్పుడే నాన్న వీడ్కోలంటూ
మా చిటికెన వేలు విడిచి వెళ్ళాక ...
మేము ఆమె గుండె గూటిలో పక్షులమై
వెచ్చటి రెక్కల్ని దిద్దుకుని
ఆకాశపు మైదానంలోకి వచ్చిన వాళ్ళమే..
అన్ని బాధ్యతల ఒంటరి పోరులో గెలిచి
సహనానికి నిలువెత్తు సాక్ష్యంగా నిలిచి
అందరిముందు కుటుంబపు
శిరసు శిఖరమంత ఎత్తులో నిలిపి
అలసిందేమో ... ?

ఎందుకనో..
ఇప్పుడు  మాటల పొదుపరి అయింది
మౌన రాగం ఆలపిస్తుంది ..
నీరసించానంటూ నిస్సహాయతతో
మంచానికి అతుక్కుంది
ఇప్పుడు నేను
నా ప్రపంచాన్ని బహిష్కరించి
ఆమెనే  చూస్తున్నా
అమ్మ దగ్గరే ఉంటున్నా  ..
ప్రేమ భాషను ఆమె నుండే నేర్చుకున్నా కదా
మాతృ పరిమళం మరింతగా గుండె కెత్తుకున్నా
కనుక
అన్నీ విడిచి ధైర్యంగా ఆమె ప్రపంచంలోకి
వెళ్తున్నా
నాకిప్పుడు మరేదీ ముఖ్యం కాదు
జ్ఞాపకాల నెమరవేతలో వున్న
అమ్మ తప్ప ...!!

—డా పెరుగు రామకృష్ణ
9849230443

డబ్బులిస్తే ఆ కుర్రవాడు ఏం చేస్తాడో తనకి తెలుసు. అసలే నా అనే మనిషిలేని అనాథలు. ఏది మంచో, ఏది చెడో తెలియని పసివాళ్ళు. దానికి తోడు చేతిలో డబ్బులుంటే సిగరెట్టు, బీడీలు తాగుతారు. అందుకే తను అరటి పండ్లిచ్చింది. పెద్ద బడాయి, డాబుగా డబ్బులిస్తుంది కాబోలు.

"వేడివేడి భోజనం, వెజిటబుల్ మీల్స్ కావాలా మేడమ్, ప్లేటు యాభై రూపాయలు" అటుగా వచ్చిన సర్వర్ అడిగాడు ఆ యువతి బ్యాగ్ తెరవటం చూసి. ఆమె ఒకటి అన్నట్టుగా వేలు చూపించి యాభై రూపాయలిచ్చింది. ఆ కుర్రవాడు యువతి ముందు కొచ్చి చెయ్యి చాచేసరికి తను ఆర్డరిచ్చిన భోజనం వచ్చింది. ఆమె ఆ పార్సిల్ అందుకుని కుర్రవాడికిచ్చి భోజనం చెయ్యమన్నట్టుగా సైగ చేసింది.

ఆ కుర్రవాడు ఆశ్చర్యచకితుడై నమ్మలేనట్టు చూశాడు. నీకే తిను అన్నట్టుగాచూసి ఆ పార్సిల్‌ని మరింత ముందుకు జరిపింది ఆ యువతి.

ఆ కుర్రవాడి కళ్ళు కన్నీళ్ళతో తడిసిపోతుంటే ఎవరూ ఊహించలేనంత వేగంగా ముందుకువంగి ఆ యువతి పాదాలకు నమస్కరించి, పార్సిల్ జాగ్రత్తగా పట్టుకుని హుషారుగా బయటకు నడిచాడు. ఆమె నవ్వుకుంది.

ఆ నవ్వులో ఏదో తృప్తిని గమనించింది కాంచన.

అంతలో ట్రైన్ కదిలింది. సర్దుకుని కూర్చుంది కాంచన.

ఆ యువతి బ్యాగ్‌తెరచి బిస్కెట్ ప్యాకెట్ తీసి రేపర్స్ విప్పి కాంచనకి ఆఫర్ చేసింది. కాంచన అప్రతిభురాలై ముభావంగానే అరటిపండు అందించింది. ఆ యువతి నవ్వుతూనే అరటిపండు తినేసి రెండు బిస్కెట్లు తీసి కాంచనకు అందించింది. కాంచనకి తీసుకోక తప్పలేదిక.

ఈ అమ్మాయి ఉద్దేశమేమిటి? తనతో మాట్లాడదు. తనని మాట్లాడనివ్వదు. కానీ ప్రేమగా ఉంటుంది. మాట్లాడవలసిన సమయంలో కూడా మాట్లాడదు. బోగీ తుడిచిన కుర్రాడితో, భోజనం తెచ్చిన సర్వర్‌తో ఎవరితోనూ మాట్లాడలేదు. అంటే... ఆ యువతి...? కాంచన ఆలోచనల వేగం ఇంకా తగ్గలేదు. ట్రైన్ వేగంతగ్గి రాజమండ్రి స్టేషన్‌లో ఆగింది. ఓ యువకుడు పరుగు పరుగున తమ కంపార్టుమెంటు దగ్గరికివచ్చి కిటికీ దగ్గర నిలబడి ఆ యువతిని చూసి చిరునవ్వు నవ్వాడు. ఆ యువతి కూడా బదులుగా నవ్వింది. ఇద్దరినీ గమనిస్తోంది కాంచన. ఆమె మాట్లాడుతున్నట్టుగా తన పెదవుల్ని కదిలిస్తూ అతనికేవో సైగలు చేసింది. ఆ యువకుడు శ్రద్ధగా వింటున్నట్టు తలూపి తనూ ఏవేవో సైగలు చేసి కాంచనవైపు తిరిగి చెప్పసాగాడు.

"ఈమె నా చెల్లెలు. పేరు అభిషిక్త. తను క్షమించమని మిమ్మల్ని వేడుకుంటోంది. వైజాగ్‌లో ట్రైన్ ఎక్కిన దగ్గర్నుండి తనతో మాట్లాడాలని మీరు చాలా ప్రయత్నాలు చేశారట. ప్రయాణంలో కొందరి పరిచయాలు స్నేహానికి దారి తీస్తాయి. నా చెల్లెలు మీతో స్నేహం చెయ్యగలదేగానీ మాట్లాడలేనందుకు అపార్థం చేసుకోవద్దని వేడుకుంటోంది" అన్నాడు. మళ్ళీ తన చెల్లెలువైపు తిరిగి, 'నువ్వు చెప్పమన్నట్టుగానే చెప్పాను' అన్నట్టుగా సైగల ద్వారా తెలియజేశాడు. ఆ యువతి స్వచ్ఛంగా నవ్వుతూ కాంచనకి షేక్ హేండిచ్చి బయటకు నడిచింది. ట్రైన్ కదిలింది. కాంచన సీట్లోంచి కదల్లేదు. స్థాణువైపోయింది. నిశ్శబ్దం హృదయం చుట్టూ, కోటలా కట్టేసి మాటలు రానట్టుగా గొంతు మూగబోయింది. అప్పటికే తన ముందు సీటును ఎవరో భర్తీ చెయ్యటం తెలుస్తోంది. ఎవరా అని చూసింది కాంచన. కొంతసేపటి క్రితం ఆ యువతిపై పేరుకున్న కోపంతో అనాలోచితంగా తను విసిరిన చూపును ఆసరాగా తీసుకొని ఇప్పుడు తన ఎదురుగా కూర్చుని తనతో మాట కలపాలని అప్పుడే విశ్వప్రయత్నాలు మొదలు పెట్టాడు కాలేజీ యువకుడు.

*సెల్: 85009 32614*

# భుజం నొప్పి మళ్లీ గుర్తుకురాలేదు

భుజంనొప్పి మూలంగా ఉద్యోగం మానేస్తారా? అంటే మానేస్తారనే చెప్పాలి. ఎందుకంటే నేను భుజం నొప్పి మూలంగానే ఉద్యోగం మానేసాను. నెలకు పాతికవేల జీతం. కానీ ఏం లాభం. భుజంనొప్పి నన్ను బండి తీయనీయలేదు. వృత్తిరీత్యా నేను మార్కెటింగ్ మేనేజర్. రోజూ బండి మీద తిరగాల్సిందే. పదేళ్ల క్రితం ఉద్యోగంలో చేరిన నేను అంచెలంచెలుగా ఎదుగుతూ మేనేజర్ స్థాయికి చేరాను. పగలనకా, రాత్రనకా బండి మీద ఎంత దూరమైనా వెళ్లిపోయే వాణ్ణి. అప్పుడు నా ఆరోగ్యం గురించి కన్నా ఉద్యోగం పైనే నా ఆలోచనంతా ఉండేది. అదే నా పాలిట శాపంగా మారింది. రెండేళ్ల క్రితం భుజం నొప్పి మొదలయింది. చివరకు చేయి పైకి ఎత్తలేనంత స్థితికి వచ్చేశాను. దానికి తోడు తీవ్రమైన మెడ నొప్పి, కళ్లు తిరగడం. అలాంటి స్థితిలో ఉద్యోగానికి ఎలా వెళతాను. డాక్టర్ దగ్గరకు వెళితే పెయిన్ కిల్లర్స్ రాశారు. ఏడాది పాటు ఆ మందులతో నెట్టుకొచ్చాను. చివరకు సర్జరీ అన్నారు. మా ఇంట్లో వాళ్లు సర్జరీకి ఒప్పుకోలేదు. కానీ అదే మంచిదయింది. ఆ సమయంలోనే నా భార్య ఆదివారం పుస్తకంలో వచ్చిన డాక్టర్ రవికిరణ్ ఆర్టికల్ చదివింది. ఒక సారి వెళ్లి చూపించుకోండి అని పట్టు పట్టింది. నిజానికి నాకు హోమియో అంటే నమ్మకం లేదు. కానీ నా భార్య ఒత్తిడితో వెళ్లాను. సరిగ్గా ఆరు నెలలు మందులు వాడమన్నారు డాక్టర్‌గారు. ఆయన చెప్పినట్టుగానే వాడాను. ఆరు నెలల్లో నా భుజం నొప్పి పూర్తిగా తగ్గింది. తలతిరగడం, మెడ నొప్పి సమస్య కూడా పోయింది. హోమియో అంటే నమ్మని నేను ఇప్పుడు వీరాభిమానిగా మారాను.

# హెర్పిస్ తగ్గదని భయపడ్డాము

లైంగిక వ్యాధులను దాయడం వల్ల ఎంతటి అనర్థాలు వస్తాయో చెప్పేందుకు మా జీవితం మంచి ఉదాహరణగా నిలుస్తుంది. నాపేరు ముత్తయ్య. మా ఊరు పిఠాపురం. నేను ప్రభుత్వ ఉద్యోగిని. నాకు వ్యాధుల గురించి పెద్దగా అవగాహన లేదు. ఒకరోజు జననాంగం దగ్గర పొక్కుల మాదిరిగా వస్తున్నాయని మా ఆవిడ చెబితే వేడి పొక్కులు అవే తగ్గుతాయిలే అని చెప్పా. నైసిల్ పౌడర్ తెచ్చి ఇచ్చా. నాలుగు రోజుల్లో తగ్గిపోయాయి. అక్కడితో అయిపోందని అనుకున్నా. నెల రోజుల తరువాత మళ్లీ వచ్చాయి. ఈసారి గతంలో కన్నా ఎక్కువగా వచ్చాయి. డాక్టర్ దగ్గరకు వెళ్దామంటే మొహమాటం. ఏం చెప్పాలని. అలా గడుస్తుండగానే నాక్కూడ అదే సమస్య మొదలయింది. అంగం దగ్గర పొక్కుల మాదిరిగా వచ్చాయి. విపరీతమైన దురద, మంట. ఇంకా దాస్తే లాభం లేదని అనుకున్నాం. డాక్టర్ దగ్గరకు వెళితే హెర్పిస్ అని చెప్పారు. మందులు వాడమని ఇచ్చారు. వారం రోజుల్లో తగ్గిపోయాయి. కానీ నెలరోజుల్లోనే మళ్లీ పొక్కులు కనిపించాయి. మళ్లీ డాక్టర్ దగ్గరకు వెళితే హెర్పిస్ శాశ్వతంగా పోదని, వ్యాధి నిరోధక శక్తి తగ్గినప్పుడల్లా వస్తూనే ఉంటుందని, భరించాల్సిందేనని అన్నాడు. మాకు ఏం చేయాలో పాలుపోలేదు. ఆ సమయంలోనే పేపర్లో డాక్టర్ రవికిరణ్‌గారి ఆర్టికల్ చదివాం. వెంటనే అపాయింట్‌మెంట్ తీసుకుని డాక్టర్‌ని కలిసాం. పరిస్థితిని వివరిస్తే మూడు నెలల్లో మళ్లీ కనిపించకుండా పోతాయని భరోసా ఇచ్చారు. అన్నట్టుగానే మూడు నెలల మందులు వాడిన తరువాత ఇద్దరికీ హెర్పిస్ పూర్తిగా తగ్గింది. ఇది జరిగి దాదాపు ఆరు నెలలు దాటింది.

**Dr. K Ravikirane**
**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
**మాస్టర్స్ హోమియోపతి**
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



# ఏయిడ్స్ రోగులకు కొత్త జీవితం

నా పేరు కుమార్. పెళ్లయి పదేళ్లవుతోంది. నాకు భార్య, ఇద్దరు పిల్లలున్నారు. ఎంతో సంతోషకరమైన కుటుంబం మాది. కానీ మా జీవితంలో ఉపద్రవం వచ్చిపడింది. అదీ నా మూలంగానే. వృత్తిరీత్యా వ్యాన్ డ్రైవర్ అయిన నేను ఒకరోజు పరస్త్రీతో శృంగారంలో పాల్గొన్నాను. ఆ తప్పు నాకు హెచ్‌ఐవి రూపంలో పెద్ద శిక్షే వేసింది. అది తెలుసుకునే నాటికే నా భార్యకు కూడా సోకింది. డాక్టర్ దగ్గరకు వెళితే ఏం చేయలేం. ఈ వ్యాధికి మందులు లేవని నీకు కూడా తెలుసుగా అని ఎదురు ప్రశ్నించాడు. బరువు బాగా తగ్గిపోవడం మూలంగా ఇంటికే పరిమితమయ్యాను. ఇల్లు గడవడం కూడా కష్టమయింది. మేమిద్దరం చనిపోతే పిల్లలు ఏం కావాలనే భయం పట్టుకుంది. ఆ సమయంలోనే డాక్టర్ రవికిరణ్‌గారి గురించి తెలిసింది. వెంటనే ఆలస్యం చేయకుండా డాక్టర్ దగ్గరకు వెళ్లాను. మరేం భయం లేదని హెచ్‌ఐవి ఉన్నా అందరిలా ఆరోగ్యంగా జీవనం సాగించవచ్చని డాక్టర్ గారు వివరించారు. మాకు ఆశ్చర్యమేసింది.మాకు నమ్మబుద్ధి కాలేదు. అదే విషయాన్ని డాక్టర్‌గారిని అడిగితే హోమియోలో మంచి మందులున్నాయని ఆరు నెలలు వాడితే మంచి ఫలితం ఉంటుందని అన్నాడు. డాక్టర్‌గారిచ్చిన భరోసాతో క్రమం తప్పకుండా మందులు వాడటం మొదలుపెట్టా.

డాక్టర్‌గారి దగ్గరకు వెళ్లినపుడు సీడీ4 కౌంట్ 220 ఉంది. ఏం తిన్నా వాంతులు అవుతున్నాయి. బలహీనంగా ఉన్నాను. కొద్దిదూరం కూడా నడవలేని పరిస్థితి. ఒక నెల మందులు వాడిన తరువాత పరిస్థితిలో చాలా మార్పు వచ్చింది. ఆకలి పెరిగింది. నీరసం తగ్గింది. సరిగ్గా ఆరు నెలల తరువాత చేయిస్తే సీడీ కౌంట్ 1500 దాటింది. జీవితం ముగిసింది అనుకున్న సమయంలో డాక్టర్ రవికిరణ్‌గారు మాకు దేవుడిలా దొరికారు. మా పిల్లల కోసం మా ప్రాణాలు నిలబెట్టారు.

# హెపటైటిస్ బాధ ఇలా తగ్గింది

నాపేరు నారాయణ. మాది మిర్యాలగూడ దగ్గర ఉన్న చిన్న పల్లెటూరు. ఆర్టీసీ డ్రైవర్‌గా పనిచేస్తున్న నాకు అనుకోని సమస్య ఎదురయింది. నా విషయంలో ఎందుకలా జరిగిందో తెలియదు. అప్పటి వరకు బాగానే ఉన్న నాకు మెల్లగా వాంతి వచ్చినట్లుగా వికారంగా అనిపించడం మొదలయింది. ఆకలి వేయకపోయేది. ఆహారం సహించకపోయేది. మూత్రం పచ్చగా వచ్చేది. జ్వరంగా అనిపించేది. ఒళ్లు నొప్పులు ఉండేవి. చూసిన వాళ్లు కళ్లు పచ్చగా ఉన్నాయని అనేవారు. కామెర్లనుకుని డాక్టర్ దగ్గరకు వెళ్లాను. జాండిస్ అని చెప్పి మందులు రాసిచ్చాడు. నెల రోజులు వాడాను. కానీ ఫలితం లేదు. నాటు వైద్యంతో తగ్గుతుందని చెబితే అదీ వాడాను. ఈలోగా వ్యాధి బాగా ముదిరిపోయింది. ఇక లాభం లేదనుకుని టౌన్‌లో కార్పోరేట్ హాస్పిటల్‌కు వెళ్లాను. అక్కడ పరీక్షలన్నీ చేసి హెపటైటిస్ వైరస్ ఉందని తేల్చారు. అది పూర్తిగా పోదని, కాకపోతే మందుల వల్ల ఈ లక్షణాలన్నీ తగ్గిస్తామని చెప్పారు. ఆ సమయంలో నా మానసిక సంఘర్షణ చెప్పనలవి కాదు. ఆ హాస్పిటల్‌లో ఉండగానే డాక్టర్ రవికిరణ్ గారి లైవ్ ప్రోగ్రాం టీవీలో వస్తోంది. నా అదృష్టం కొద్దీ ఆ రోజు హెపటైటిస్ గురించి డాక్టర్‌గారు వివరిస్తున్నారు. డాక్టర్ గారి మాటలు విన్నాక వెంటనే కొంచెం ధైర్యం వచ్చింది. మరుసటి రోజే వెళ్లి కలిసాను. డాక్టర్ గారితో మాట్లాడాక హెపటైటిస్‌పై పూర్తిగా అవగాహన వచ్చింది. హెపటైటిస్‌పై డాక్టర్‌గారు చేసిన రీసెర్చ్ తెలుసుకుని ఆశ్చర్యపోయాను. మందులు వాడటం మొదలుపెట్టాక చాలా ఫలితం కనిపించింది. కామెర్లు తగ్గిపోయాయి. ఆకలి పెరిగింది. బరువు పెరిగాను. మళ్లీ పూర్వ జీవితాన్ని పొందగలిగాను. ఇదంతా డాక్టర్ రవికిరణ్‌గారి చలవే. ఆయనకు ఎప్పటికీ రుణపడి ఉంటాను. హెపటైటిస్ భయం లేకుండా ఇప్పుడు సాధారణ జీవితం గడుపుతున్నాను.

ADVT




# విలక్షణ వ్యవహార శైలి

**ప్రధానిగా మోదీ ఓ అయిదారు నాయకత్వ లక్షణాలను ఒంటబట్టించుకున్నారు. ఈ మూడేళ్ల కాలంలో ఈ లక్షణాలే ఆయనను తిరుగులేని నాయకుడుగా నిలబెడుతున్నాయి.**

నరేంద్ర మోదీ అధికారం చేపట్టి ఈ నెలతో మూడేళ్లు పూర్తయింది. ఈ మూడేళ్లలో ఆయన సారథ్యంలోని ప్రభుత్వం సాధించిందేమిటి? ఆయన వ్యవహార శైలి ఎలా ఉంది? వెనుకటి ప్రధాన మంత్రులకు, మోదీకి తేడా ఏమిటి? విశ్లేషకులు మాత్రం వెనుకటి ప్రధానమంత్రులకూ, ఆయనకూ సహస్రాంతరం తేడా ఉందనే చెబుతున్నారు. ముఖ్యంగా నిర్వహణ, ఆధిపత్యం, నాయకత్వం వంటి అంశాల్లో వెనుకటి ప్రధాని మన్మోహన్ సింగ్‌కూ, ఆయనకూ ఎంతో తేడా ఉందని వారు చెబుతున్నారు. ముఖ్యంగా, బ్యూరాక్రసీ మీద పూర్తిస్థాయి పట్టు, వేగంగా నిర్ణయం తీసుకోవడం, సమస్యల పట్ల అవగాహన, కమ్యూనికేషన్ నైపుణ్యాలు, వివిధ పథకాల మెరుగుదల వంటి కీలక అంశాల్లో ఆయనది విభిన్న ధోరణి అని అంతర్జాతీయ స్థాయి విశ్లేషకులు సైతం సోదాహరణంగా వ్యాఖ్యానిస్తున్నారు.

ఒకరి నాయకత్వ లక్షణాలను పరిశీలించి, అభిప్రాయం వ్యక్తం చేయడానికి నిజానికి మూడేళ్ల కాలం ఎక్కువ కాలమే. సుమారు పదిహేనేళ్ల పాటు దేశాన్ని పాలించిన ఇందిరాగాంధీ వ్యవహార శైలికీ, మోదీ వ్యవహారశైలికీ పోలికలున్నాయని పలువురు రాజకీయ పరిశీలకులు భావిస్తున్నారు. ఇద్దరూ శక్తిమంతమైన నాయకులే. దేశంలోని సాధారణ ప్రజానీకంతో మమేకం చెందినవారే. అధికారాన్నీ, శక్తియుక్తుల్నీ ఎప్పుడు ఎలా ఉపయోగించుకోవాలో ఇద్దరికీ క్షుణ్ణంగా తెలుసు. ఇద్దరూ రాజకీయ చాతుర్యం కలిగినవారే. అయినప్పటికీ ఇందిరాగాంధీ పాలనకూ, మోదీ పాలనకూ మధ్య ఎంతో తేడా ఉందనడంలో సందేహం లేదు. మోదీ నాయకత్వ లక్షణాలలో కొన్ని ఇందిరాగాంధీ లక్షణాలతో సరిపోలి ఉండొచ్చు. కానీ, మోదీ నాయకత్వ లక్షణాలలో కొన్ని ఆధునికత సంతరించుకోవడం, కొత్త కోణాలను స్పృశించడం, కొత్త పుంతలు తొక్కుతుండడం గమనించాల్సినవి.

అధికారగణం మీద ఆయనకు ఉన్న పట్టు తిరుగులేనిది. అధికారానికి వచ్చిన కొద్ది కాలంలోనే ఆయన బ్యూరాక్రసీ మీద పూర్తి పట్టు సంపాదించేశారు. కేంద్ర లేదా జాతీయ రాజకీయాలతో అంతగా సంబంధం లేని మోదీ ప్రధానిగా పదవి చేపట్టేనాటికి ఆ పదవికి పూర్తిగా కొత్తవారు. కానీ, వచ్చీ రాగానే బ్యూరాక్రసీ మీద దృష్టి కేంద్రీకరించారు. అతి తక్కువ కాలంలోనే అధికార గణాన్ని తన అధీనంలోకి తెచ్చుకున్నారు. ఎక్కడా మధ్యవర్తిత్వానికి అవకాశమివ్వలేదు. ఉన్నతాధికారులతో ప్రత్యక్ష సంబంధాలే తప్ప పరోక్ష సంబంధాలకు ఆస్కారమివ్వలేదు. మన్మోహన్ సింగ్ హయాంలో మాదిరిగా ఉన్నతాధికారుల నియామకాన్ని ఆయా శాఖల మంత్రులకు వదిలిపెట్టకుండా, ఆ బాధ్యత తను స్వయంగా భుజాలకెత్తుకున్నారు. ముఖ్యమైన మంత్రిత్వ శాఖలన్నిటికీ కార్యదర్శి స్థాయి అధికారులను తానే స్వయంగా ఎంపికచేసి నియమించారు. అధికారులను నియమించడంలో ఆయనదే తుది మాట. తమ శాఖలోని అధికారులందరికీ నేరుగా ప్రధానితో ప్రధాని కార్యాలయంతో సంబంధాలు ఉన్నాయన్న వాస్తవాన్ని ప్రతి ముఖ్యమైన మంత్రీ మనసులో పెట్టుకోవడం తప్పనిసరి అయింది.

### బ్యూరాక్రసీపై గట్టి పట్టు

ఈ రకమైన వ్యవహార శైలి సహజంగానే ఉన్నత స్థాయి అధికారులలో జవాబుదారీతనాన్ని పెంచింది. ఉన్నతాధికారులతో నేరుగా సంబంధాలు పెట్టుకోవడం వల్ల ప్రధానికి ఏ శాఖలో ఏం జరుగుతోందో, తన పథకాలు, కార్యక్రమాలు ఏమేరకు పురోగతి చెందుతున్నాయో ఎప్పటికప్పుడు తెలుసుకోవడానికి అవకాశం కలిగింది. ప్రభుత్వం ప్రకటించిన పథకాల పురోగతిని తెలుసుకోవడానికి ఫోన్లు, కంప్యూటర్లతో పాటు, వీడియో కాన్ఫరెన్సులు, సమావేశాలు కూడా ఎంతగానో దోహదపడుతున్నాయి. వివిధ శాఖలకు చెందిన ఉన్నతాధికారులతో తరచూ సమావేశాలు ఏర్పాటు చేయడం, అధికారులతో ప్రతి అంశం గురించీ లోతుగా చర్చించడం వంటి విధానాలవల్ల ప్రధానికి తన శాఖలోనే కాకుండా, ప్రభుత్వంలో ఏం జరుగుతోందనేది వెనువెంటనే తెలుసుకోవడానికి అవకాశం కలుగుతోంది. ఈ సమావేశంలో మంత్రులు కూడా పాల్గొంటే పాల్గొనవచ్చు. కానీ, ఉన్నతాధికారులు మాత్రం అసలు 'బాస్' ఎవరన్నది తెలుసుకోవడానికి ఎంతో కాలం పట్టలేదు. కేంద్ర ప్రభుత్వంలో తమ మంత్రి కన్నా ప్రధానమంత్రి మాటే సర్వత్రా చెల్లుబాటవు



తుందనే సంగతి అధికారులకు అర్థమైపోయింది.

బడ్జెట్, వస్తుసేవల పన్ను (జీఎస్టీ), నోట్ల రద్దు వంటి కీలక విధానాలపై నిర్ణయాలు తీసుకునే సమయంలో కూడా మోదీ సంబంధిత ఉన్నతాధికారులతో నేరుగా చర్చించారు. ఉన్నతాధికారులందరినీ విశ్వాసంలోకి తీసుకున్నారు. వారి తోడ్పాటుతోనే విధానాలను రూపొందించారు. వారితో కలిసి మెలిసి పని చేశారు. విధానాల రూపకల్పనలోనే కాదు, వాటిని అమలు చేయడంలోనూ, పురోగతిని సమీక్షించడంలోనూ ఆయన అధికారులతో ప్రత్యక్ష సంబంధాలు పెట్టుకున్నారు. ఈ విషయంలో మన్మోహన్ సింగ్‌కూ, ఆయనకూ ఎంతో తేడా ఉంది. దేశాన్ని సుమారు పదేళ్ల పాటు పాలించిన మన్మోహన్ తాను ప్రత్యక్షంగా కాకుండా, ప్రధాని కార్యాలయం ద్వారా, మంత్రుల ద్వారా, ఫైళ్ల ద్వారా అధికారులతో సంబంధాలు పెట్టుకునేవారు.

నిర్ణయాలు తీసుకోవడంలో కూడా మోదీకి మోదీయే సాటి. ఆయన నిర్ణయాల ప్రభావం ప్రభుత్వం మీద స్పష్టమైన ప్రభావాన్ని కనబరుస్తుంటుంది. పీవీ నరసింహారావు ప్రధానిగా ఉన్నప్పుడు, ఆయన చేపట్టిన సంస్కరణల పట్ల అతి కొద్దిమంది మంత్రు




లకు మాత్రమే అవగాహన ఉండేది. కొందరు మంత్రులకు ఈ సంస్కరణలు నచ్చలేదని, వారు బహిరంగంగానే తమ వైముఖ్యం ప్రదర్శించేవారని అప్పట్లో అనుకునేవారు. మోదీ ప్రభుత్వంలో అటువంటి దానికి ఆస్కారమే లేదు. ప్రతి సంస్కరణా ప్రతి మంత్రికీ, ప్రతి అధికారికీ సంపూర్ణంగా అవగతమయ్యే ఉంటోంది. మోదీ ఎటువంటి నిర్ణయం తీసుకున్నా అది చివరివరకూ వెడుతుంది. ప్రతి అధికారీ ఆమోదం తెలిపిన తరువాతే అది బహిర్గతమవుతుంది. ప్రతి అధికారితోనూ ప్రత్యక్ష సంబంధాలు నెరపే మోదీ ప్రతి మంత్రికీ ప్రతి విషయమూ అవగతమయ్యేందుకు కూడా చర్యలు తీసుకుంటుంటారు.

## ఏకపక్ష నిర్ణయాలు

ప్రభుత్వంలో అనేక సమావేశాలు మోదీ ఆధ్వర్యంలోనే జరుగుతాయి. ఏ విధాన నిర్ణయంపైనైనా, ఏ కుంభకోణానికి సంబంధించిన నివేదిక పైనైనా ఆయన నాయకత్వంలోనే చర్చ జరుగుతుంది. ఓ నివేదికను బహిర్గతం చేయాలా వద్దా అన్న అంశంపై కూడా మోదీ ఆధ్వర్యంలోనే చర్చ జరిగి తుది నిర్ణయం జరుగుతుంది. మంత్రివర్గ సమావేశాల తీరుతెన్నులను చూస్తే మోదీ ఎంతగా ఉక్కు పిడికిలితో ప్రభుత్వాన్ని నిర్వహిస్తున్నారో అర్థమవుతుంది. మంత్రివర్గ సమావేశంలో ఆయన నిర్ణయమే తుది నిర్ణయం. మంత్రివర్గ సహచరుల



నుంచి ఎక్కడా ఎటువంటి అసంతృప్తులూ, అసమ్మతులూ బయటికి రాకూడదు. పెద్ద నోట్ల రద్దు నిర్ణయంపై మంత్రివర్గ సమావేశం జరిగింది కానీ, చర్చ మాత్రం తక్కువే. ప్రముఖుల కార్ల మీద ఎర్ర బుగ్గలు, నీలం బుగ్గలు ఉండాలా వద్దా అన్న దానిపై కూడా మోదీ ముందే నిర్ణయం తీసుకుని సమావేశానికి వచ్చారు. మంత్రివర్గ సమావేశం ఆమోద ముద్ర వేయడం మాత్రమే మిగిలింది.

ఆయన నాయకత్వంలోని మరో విలక్షణమైన కోణమేమిటంటే, అవసరమైతే తన నిర్ణయాలు, అభిప్రాయాలు మార్చుకోవడానికి మోదీ సంశయించరు. మూడేళ్ల క్రితం ఆయన తన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తున్నప్పుడు, అభివృద్ధి, ఉద్యోగాల సృష్టి, నల్లధనం ఏరివేతలను ఆయన తన ప్రాధాన్యాలుగా పేర్కొన్నారు. అయితే, అభివృద్ధి అనేది ఇప్పటికిప్పుడు జరిగేది కాదని, ఇదొక దీర్ఘకాలిక ప్రణాళిక అనీ ఆయనకు మొదటి రెండేళ్లలోనే అర్థమైంది. అలాగే, ఉద్యోగాలను సృష్టించడం కూడా ప్రస్తుత ఆర్థిక పరిస్థితుల్లో స్వల్పకాలంలో జరిగేది కాదని ఆయన మొదట్లోనే గ్రహించారు. మొదటగా నల్లధనానికి పగ్గాలు వేస్తే ఆర్థిక రంగం మెరుగుపడి, అభివృద్ధి, ఉద్యోగాల సృష్టి సులభం అవుతాయని ఆయన అర్థం చేసుకున్నారు. దాంతో ఆయన అన్నిటినీ వదిలిపెట్టి నల్లధనాన్ని నిర్మూలించడం మీద దృష్టి పెట్టారు.

ఆ తరువాత నుంచి ఆయన ఉద్యోగాల కల్పన గురించి మాట్లాడడం తగ్గించారు. ప్రాథమిక సౌకర్యాల కల్పనకు విధానపరంగా అత్యంత ప్రాధాన్యం ఇవ్వడం ప్రారంభించారు. అభివృద్ధికి సంబంధించిన లక్ష్యాలను 2022 నాటికి పూర్తి చేయగలమని ప్రకటించారు. వచ్చే ఎన్నికల తర్వాత మూడు నాలుగేళ్లకు తప్ప అభివృద్ధి లక్ష్యాలను చేరుకోవడం జరిగే పని కాదని ఆయన భావిస్తున్నారు. ఇక నల్లధనాన్ని వెలికి తీయడానికి ఆయన నోట్ల రద్దు అనే పిడుగులాంటి నిర్ణయాన్ని తీసుకున్నారు. డిజిటల్ చెల్లింపుల దిశగా ఆర్థిక రంగాన్ని నడిపించడం కూడా నల్లధన నిర్మూలనలో భాగమని ఆయన అభిప్రాయపడ్డారు. అభివృద్ధిని, ఉపాధి కల్పనను లక్ష్యంగా తీసుకుని ఉంటే తాను విఫలం కావడం ఖాయమని అర్థమయ్యే ఆయన మొదటగా నల్లధనం నిర్మూలన వైపు మొగ్గు చూపారు.

## అసమ్మతికి దూరం

సంభాషణా చాతుర్యం, కమ్యూనికేషన్ నైపుణ్యానికి ఉన్న ప్రాధాన్యాన్ని ప్రధానమంత్రి బాగా అర్థం చేసుకున్నారు. ఈ విషయంలో వెనుకటి ప్రధానమంత్రులు బాగా వెనుకబడ్డారనే అనుకోవచ్చు. సంభాషణా చాతుర్యమంటే, అవతలివారి అభిప్రాయాలు కూడా వినడం అనుకుంటే పొరపాటే. ఆయన ఎంతో నైపుణ్యంతో, పడికట్టు మాటలతో తాను చెప్పదలచినది చెప్పగలరన్నదే ఇక్కడ అర్థం చేసుకోవాలి. ఆయన సాధారణంగా పత్రికా విలేకరుల సమావేశాలను నిర్వహించరు. తనను ఎవరైనా ప్రశ్నలతో 'వేధించడం' ఆయనకు ఇష్టముండదు. తాను చెప్పదలిచినది సోషల్ మీడియాలోనే ఆయన చెబుతారు. ప్రభుత్వం చేయాలనుకుంటున్న కార్యక్రమాల గురించి, ప్రభుత్వ నిర్ణయాల గురించి, ప్రభుత్వ సాఫల్యాల గురించి ఆయన సామాజిక మీడియాలోనే వివరిస్తుంటారు. ఆయన తత్వానికి అదే సరిగ్గా సరిపోతోంది. ఆయనకు, ఆయన ప్రభుత్వానికి అసమ్మతి అన్నా, అసంతృప్తి అన్నా సరిపడని విషయాలు.

> **సుమారు పదిహేనేళ్ళు దేశాన్ని పాలించిన ఇందిరాగాంధీ శైలికీ, మోదీ శైలికీ పోలికలున్నాయని పలువురు రాజకీయ పరిశీలకులు భావిస్తున్నారు. ఇద్దరూ శక్తిమంతమైన నాయకులే. సాధారణ ప్రజానీకంతో మమేకమైనవారే. అధికారం, శక్తియుక్తులు ఎప్పుడు ఉపయోగించుకోవాలో ఇద్దరికీ క్షుణ్ణంగా తెలుసు. అయినప్పటికీ మోదీ నాయకత్వ లక్షణాలలో ఆధునికతతోపాటు కొత్త కోణాలు స్పృశించడం గమనార్హం.**

ఇక ఇప్పటికే అమలులో ఉన్న పథకాలను మార్చి, మెరుగుపరచి, అమలు చేయడంలో మోదీకున్న నైపుణ్యం సాటిలేనిది. దీనివల్ల వెనుకటి ప్రభుత్వాల ఆనవాళ్లను రూపు మాపినట్టూ ఉంటుంది. తాను కొత్త పథకాలు ప్రవేశపెట్టినట్టూ ఉంటుంది. అటువంటి పథకాలను ఆయన చిత్తశుద్ధితో, ప్రణాళికాబద్ధంగా అమలు చేస్తుంటారు. అంతేకాదు, ఆ పథకాలూ, వాటి అమలూ పూర్తిగా మోదీతోనే మమేకం చెంది వుంటాయి. ఎల్‌ఈడీ బల్బులు, గ్రామీణ ఉపాధి హామీ, ఆధార్ గుర్తింపు, పేదలకు బ్యాంక్ ఖాతాలు వంటి పథకాలు ఈ కోవకు చెందినవే. ఇంతవరకూ పేర్కొన్న ప్రధాన లక్షణాలే మోదీ నాయకత్వ లక్షణాలను ప్రతిబింబిస్తుంటాయి. ఇవే లక్షణాలతో ఆయన మూడేళ్లుగా తిరుగులేకుండా దేశాన్ని పాలిస్తున్నారు. ఎన్నికల్లో గెలుస్తున్నారు. ప్రజలకు చేరువవుతున్నారు. బహుశా మరో రెండేళ్లు కూడా ఇదే విధంగా గడిచిపోతుందేమో తెలియదు.



# మనసుగతి ఇంతే! 5

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**"హాయ్, వెల్‌కమ్! వాట్ కెన్ ఐ గెట్ ఫర్ యూ టుడే?" పిజ్జాహట్ కౌంటర్లో ఉన్న యువకుడు చిరునవ్వుతో అడిగాడు.**

**"మీడియం ఆర్ లార్జ్?"**

**'మీడియం వెజ్జీ. వన్ ఈజ్ ఇనఫ్" వినయ్ అన్నాడు.**

**"మీడియం? లార్జ్ పిజ్జా తీసుకుందాం" సంధ్య అంది.**

**వినయ్ చిరునవ్వు నవ్వాడు. "లార్జ్ పిజ్జా. పన్నెండు స్లైసెస్. తినలేం. మీడియం అంటే ఎనిమిది స్లైసెస్ – చాలు మనకు".**

"ఆకలి చంపేస్తోంది. లార్జ్ పిజ్జా కావాలి!" సంధ్య కంఠంలో పట్టుదల ధ్వనించింది.

వినయ్ సంధ్యవైపు క్షణకాలం చూశాడు. "తినలేమేమో... ఆల్‌రైట్" అంటూ కౌంటర్‌లోని యువకుడి వైపు తిరిగాడు.

"మేకిట్ లార్జ్ వెజ్జీ ప్లీజ్"

"ఓకే. ఎనీథింగ్ ఎల్స్?"

"యా. టూ స్మాల్‌కోక్స్" వినయ్ ఆర్డరిచ్చాడు.

"ఐ వాంట్ లార్జ్‌కోక్" సంధ్య సీరియస్‌గా అంది.

"ఓకే... నో ప్రాబ్లం... వన్ లార్జ్ కోక్, వన్ స్మాల్ కోక్" వినయ్ కౌంటరతనితో అన్నాడు.

"ఓకే. ప్లీజ్ సిడౌన్"

వినయ్ సంధ్య మోచేతిని పట్టుకుని, మూలలో ఉన్న టేబుల్ వద్దకు నడిపించాడు. ఆమె కోసం కుర్చీని వెనక్కి లాగాడు. సంధ్య హుందాగా కూచుంది. వినయ్ ఆమె ఎదురుగా కూచుని, చిరునవ్వుతో చూశాడు.

సంధ్య అరచేత్తో నుదురు అదుముకుని, విసుగ్గా చూసింది.

"తలనొప్పా?" వినయ్ ప్రేమగా అడిగాడు.

"ఆ.. తల పగిలిపోతోంది." సంధ్య కంఠంలో విసుగు ధ్వనించింది. ఆమె కళ్ళు వినయ్ ముఖం లోకి చూశాయి. "నాకు ఏం కావాలో తెలుసుకుని ఆర్డరివ్వడం మంచిది."

వినయ్ క్షణం పాటు ఆశ్చర్యంగా చూశాడు. అడగకుండా ఆర్డరిచ్చి హర్ట్ చేశాడా తను? "సారీ, సంధ్యా.. ఇక్కడ దొరికే పిజ్జాల సైజు గురించి నీకు తెలీదనుకుని, నీ కోసం నేను ఆర్డర్ చేశాను. అంతే!"

"అలా ఎందుకన్నానంటే ఒకరి అభిరుచినీ, అభిప్రాయాన్నీ మరొకరి మీద రుద్దకూడదని నా నమ్మకం".

"యూ ఆర్ రైట్. నీ నమ్మకం మంచిదే!" వినయ్ చిరునవ్వుతో అన్నాడు.

"లార్జ్ పిజ్జా ప్లీజ్!" కౌంటరతను అరిచాడు. వినయ్ పైకి లేచాడు.

"వాణ్ణే తెమ్మను!" సంధ్య వినయ్‌ని హెచ్చరించింది.

"నో! ఇక్కడ అది జరగదు. సెల్ఫ్ సర్వీస్!" అంటూ వినయ్ కౌంటర్‌వైపు వెళ్ళాడు. డెబిట్ కార్డుతో బిల్లు చెల్లించి పిజ్జాను, కోక్స్‌ను టేబుల్ మీదకు చేరవేశాడు.

ఇద్దరూ తినడం ప్రారంభించారు. వినయ్ సంధ్య వైపే చూస్తున్నాడు. సంధ్య పిజ్జా ముక్కను వేళ్ళకొసల్తో సున్నితంగా పట్టుకుని, నాజూకుగా తింటోంది. వినయ్ తృప్తిగా నవ్వుకున్నాడు. నడుస్తున్నా, కూచున్నా, తింటున్నా, తాగుతున్నా సంధ్య అందం కనువిందు చేస్తూ ఉంటుంది.

రెండు ముక్కలు తిని, సగం కన్నా తక్కువగా కోక్ తాగి, సంధ్య కుర్చీలో వెనక్కి వాలింది. వినయ్ కోక్‌బాటిల్ కింద పెట్టి, ఆమె వైపు చూశాడు.

"తిను సంధ్యా".

"చాలు"

"బాగా ఆకలిగా ఉందన్నావ్?"

"ఆర్డరిచ్చినప్పుడు ఉంది. వాడు పిజ్జా తెచ్చేసరికి చచ్చిపోయింది" సంధ్య కోక్ దూరంగా తోసింది.

"సంధ్యా, ఒక చిన్న సవరణ చెప్పనా?"



వినయ్ చిరునవ్వు నవ్వుతూ అడిగాడు.

"చెప్పండి"

"ఇప్పటికి రెండుసార్లు కౌంటర్ యువకుణ్ణి 'వాడు, వాడు' అన్నావ్. మనం చదువూ సంస్కారం ఉన్నవాళ్ళం. అపరిచితుడైనా, మన భాష అర్థం కానివాడైనా ఎదుటి వ్యక్తిని, వాడు అని అనకూడదు. 'అతను' అనాలి. ఓకే?"

సంధ్య వినయ్ ముఖంలోకి నిదానించి చూసింది. ఆమె పెదవులు మెల్లగా కదిలాయి. "ఓకే! పాఠం నేర్చుకున్నా!"

***

"ఏమండీ, ఓసారిలా వస్తారా?"

మాస్టర్ బెడ్‌రూంలో బెడ్‌స్ప్రెడ్ సర్దుతున్న వినయ్ సంధ్య పిలుపు విని, గుమ్మం వద్దకు వెళ్ళాడు. సంధ్య సెకండ్ బెడ్‌రూం గుమ్మంలో నిలబడి ఉంది. ఆమె ఇంకా డ్రెస్ మార్చు కోలేదు. పిజ్జాహట్‌కెళ్ళిన డ్రెస్‌లోనే ఉంది.

"పిలిచావా సంధ్యా?"

"ఆ.. ఒకసారిలా రండి".

"వెనుతిరిగి గది లోపలికి వెళ్ళిపోతున్న సంధ్యనే చూస్తూ సెకండ్ బెడ్‌రూం వైపు వెళ్ళాడు వినయ్. చిన్న స్టోర్‌రూం తలుపు తెరిచి ఉంది. లైటు వెలుగుతోంది. ఇండియా నుంచీ తెచ్చిన సూట్‌కేసులు ఒకదాని మీదొకటి దొంతరగా ఉన్నాయి. సంధ్య వాటివైపు చూస్తూ నిలుచుంది.

"ఏమిటి సంధ్యా?"

"కింది నుంచీ రెండో సూట్‌కేసు కావాలి నాకు, తీసిస్తారా?" సంధ్య అతనివైపు చూడకుండానే అంది.

పైనున్న సూట్‌కేసుల్ని దింపి, అడుగునుంచి రెండోదాన్ని తీసి, సంధ్య ముందు పెట్టాడు వినయ్.

## జరిగిన కథ

ఒకదాని తరువాత ఒకటిగా కంప్యూటర్ స్క్రీన్‌మీద ఫోటోలు జరిగిపోతున్నాయి. అన్నీ సంధ్య ఫోటోలే! అతనికి ఎటుచూసినా ఆమే కనబడుతుంది. ఆమెనే మంత్రముగ్ధుడిలా చూస్తూ తన తీయటి గతంలోకి జారుకుంటాడు వినయ్. అమెరికాలో ఉన్న వినయ్ ఇండియా వచ్చి సంధ్యని పెళ్ళి చేసుకుంటాడు. శోభనం రాత్రి గదిలోకి అడుగుపెట్టిన సంధ్య ఒక్కసారిగా కుప్పకూలిపోతుంది. హాస్పిటల్‌కి తీసుకువెళతారు. అయితే ఆమెకేమీ సమస్య లేదని, రెండుమూడు రోజులు విశ్రాంతి తీసుకుంటే సరిపోతుందని చెబుతారు డాక్టర్లు. మరునాడు అమెరికా వెళతారనగా, రెండోసారి మొదటిరాత్రి ఏర్పాట్లు చేస్తారు. అయితే రెండోరాత్రి కూడా వినయ్‌కి నిరాశే మిగులుతుంది. ఇద్దరూ అమెరికా చేరుకుంటారు. రెంటెడ్ ఫ్లాట్ తీసుకుని, అందులోకి షిఫ్ట్ అవుతారు. అక్కడికి వెళ్ళాక కూడా సంధ్య వినయ్‌ని దూరంగానే ఉంచుతుంది. **ఆ తర్వాత....**

"దాన్ని కొంచెం తెరుస్తారా?"

వినయ్ నేలమీద కూచుని, లాక్స్ రిలీజ్‌చేసి, సూట్‌కేసు తెరిచాడు. నిండుగా సంధ్య బట్టలున్నాయి.

"ఏం కావాలి? నైటీయా?"

"ఆ బట్టల్ని తీయండి, చెప్తాను".

వినయ్ ఒక్కొక్కటిగా సూట్‌కేసులోని బట్టల్ని తీసి, కార్పెట్ మీద పెట్టసాగాడు.

'ఆ ప్యాకెట్ ఇలా ఇవ్వండి' సూట్‌కేసు అడుగున ఉన్న ప్యాకెట్ కనబడగానే అంది సంధ్య.

సూట్‌కేస్ అడుగున ఒకే ఒక ప్యాకెట్ ఉంది. వినయ్ దాన్ని ఆశ్చర్యంగా చూశాడు. 'విస్పర్ శానిటరీ నాప్‌కిన్స్ ప్యాకెట్.

"ఇదేనా?!"

"ఇంకో ప్యాకెట్ ఏదీ లేదుగా! అదే. ఇలా ఇవ్వండి" సంధ్య అంది.

వినయ్ విస్పర్ ప్యాకెట్‌ని అందించాడు.

'ఆ బట్టలన్నీ సర్దేసి, సూట్‌కేసుని స్టోర్‌రూంలో పెట్టేస్తారా?' 'విస్పర్‌ని అందుకుంటూ అంది సంధ్య "నేను మోయలేను".

"నేనున్నాగా!" అంటూ వినయ్ బట్టల్ని సూట్‌కేసులో సర్ది, మూతవేసి, స్టోర్‌రూంలోకి చేర వేశాడు. సంధ్య వైపు తిరిగి, చిరునవ్వుతో చూశాడు.

సంధ్య పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. "ఎప్పుడు అవసరమవుతుందో అని, ముందు జాగ్రత్తగా తెచ్చుకున్నాను. ఇప్పుడవసరమైంది".

వినయ్ తల పంకించాడు మౌనంగా.

"కొంచెం బైటికివెళ్తారా? నేను.... నేను.. బట్టలు మార్చుకోవాలి" సంధ్య తల వాల్చుకుని, నేల చూపులు చూస్తూ అంది.

"ఓ... సారీ" అంటూ వినయ్ గుమ్మం వైపు వెళ్ళాడు.

"ఏమండీ..."

సంధ్య పిలుపు వినయ్‌ని ఆపింది. తలతిప్పి సంధ్య వైపు చూశాడు, ప్రశ్నార్థకంగా.

"అయాం సారీ.. మిమ్మల్ని మళ్ళీ డిజప్పాయింట్ చేస్తున్నాను" సంధ్య కళ్ళు దించుకుని అంది.

"ఇట్సాల్‌రైట్! ఆడవాళ్ళకి అది సహజం." వినయ్ చిన్నగా నవ్వాడు.

"ఏది? డిజప్పాయింట్ చేయడమా?" సంధ్య నవ్వుతూ అడిగింది.

"ఛఛ! కాదు! అది... అదే.. నెలలో మూడు రోజులు.."

సంధ్య చిరునవ్వు నవ్వింది.

వినయ్ గది బైటకు వచ్చి తలుపు మూశాడు.

***

వినయ్ తలగడలకు ఆనుకుని వాలుగా పడుకున్నాడు. ఎందుకో అతనికి చిరాగ్గా ఉంది. ఎందుకిలా జరుగుతోంది? తనూ, సంధ్యా శారీరకంగా ఏకం కాకుండా ఏ శక్తి అవరోధాలు కల్పిస్తోంది! తన వివాహానికి పరిపూర్ణత సిద్ధించకుండా ఏ శక్తి అడ్డుపడుతోంది?

ఇండియాలో తన అత్తవారింట్లో శోభనం గదిలో సంధ్య స్పృహ కోల్పోయి పడిపోయింది. 'రెండవ తొలిరాత్రి' వాంతులు చేసుకుని, నీరసించి నిస్సహాయంగా పడుకుంది. అమెరికాలో, కిరణ్ ఇంట్లో ఆ దంపతులు ఏర్పాటుచేసిన శోభనం సెట్టింగ్‌లో మళ్ళీ సంధ్యకు వాంతులు, అనారోగ్యం. కిరణ్ ఇంట్లో ఉన్నన్ని రోజులూ తనకు విశ్రాంతి కావాలన్న సంధ్య ఆంక్ష, పోనీ అభ్యర్థన. ఇప్పుడు కొత్తకాపురం ప్రారంభించాక ఇంటికి దూరం ఇల్లాలు!

అనారోగ్యం, అనారోగ్యం, అనారోగ్యం, నెలసరి.... ఎందుకిలా జరుగుతోంది? కారణం ఎవరు? తనా? కాదు. సంధ్యా? కాదనే అనుకోవాలి. అనారోగ్యాన్నీ, నెలసరినీ కోరి తెచ్చుకోలేదుగా! కళ్ళకు కనిపించే తామిద్దరూ కారకులు కారు. కళ్ళకు కనిపించని ఆ శక్తి విధి కారణమా? ఏమో? కావొచ్చేమో?

నేరం విధి మీదకు నెట్టేస్తున్న తన బలహీనతకు నవ్వుకున్నాడు వినయ్. తన విచారానికీ, బాధకూ, ఓటమికీ విధిని కారకుడుగా చేయడం మనిషికి అలవాటే! వినయ్ బరువుగా నిట్టూర్చి, పక్కకి తిరిగాడు. పెళ్ళయ్యాక ప్రతిరాత్రీ తన నిద్రలేమికీ, నిరాశకూ, అశాంతికీ కారణమవుతోంది.

సంధ్య తన హృదయంలో ఉంది. అయితే, తన ఎద మీదకు చేరకుండా ఉంది. దాంపత్య పరిపూర్తి కోసం తాను పెళ్ళయిన నాటినుంచీ ఎదురుచూస్తున్నాడు. సంధ్య కూడా ఎదురు చూస్తోందా? ఎందుకు ఎదురుచూడదు? ప్రతీ కన్నెపిల్లా కనే కల అది!

భార్య సమీపంలోనే ఉంటూ ఏకాంతాన్నీ, ఆ ఏకాంతం అందించే నిరాశనూ భరిస్తూ తను ఇంకా మూడు రాత్రులు గడపాలి. రాత్రులు లెక్కపెడుతున్న తన బలహీనతకు మరోసారి నవ్వుకున్నాడు వినయ్.

***

ఆఫీసుకు వెళ్ళబోతూ కారు తాళం చెవి తీసుకుని, ఏదో గుర్తుచేసుకుంటూ ఆగాడు వినయ్. తను మరిచే పోయాడు. సంధ్య నగల్ని బ్యాంకు లాకర్లో పెట్టాలి.

రెండో బెడ్‌రూం తలుపు వద్దకు వెళ్ళి పిలిచాడు "సంధ్యా!"

మరోసారి పిలుస్తూ తలుపు హేండిల్ తిప్పి తోశాడు. తలుపు లోపలికి జరిగింది. వినయ్ బెడ్‌రూంలోకి వెళ్ళాడు. సంధ్య లేదు. బాత్‌రూంలో ఉందా? వినయ్ బాత్‌రూం తలుపు దగ్గరగా నడిచాడు. లోపల్నించీ నీళ్ళ చప్పుడు వినిపించడం లేదు. సంధ్యకు ఏమైనా అయిందా? స్పృహ కోల్పోయిందా? వాంతులు చేసుకుందా? ఆందోళనను శిఖరస్థాయికి

**వినయ్‌కి చిరాగ్గా ఉంది. ఎందుకిలా జరుగుతోంది? తామిద్దరూ కలవకుండా ఏ శక్తి అడ్డుపడుతోంది? అని ఆలోచిస్తున్నాడు. ప్రతీసారీ ఏదో ఒక అవరోధం... అసలు ఇలా జరగటానికి కారణం ఏమిటి? తనయితే కాదు. మరి సంధ్యా? కోరి పెళ్ళి చేసుకున్న ఆమె ఎందుకిలా చేస్తుంది? ఆలోచనలు పరిపరి విధాల సాగుతున్నాయి. అతని ఆలోచనలు ఎటువైపు సాగాయి? చివరికి ఎవరిని దోషిని చేశాడు?**

చేరుస్తూ వినయ్ ఆలోచనలు దూసుకెళ్ళాయి. సంధ్య బాత్‌రూం గొళ్ళేన్ని లాక్ చేసిందేమో.. వినయ్ డోర్ హేండిల్ని తిప్పాడు. హేండిల్ పూర్తిగా తిరిగింది. తేలిగ్గా ఊపిరి పీల్చుకుంటూ, తలుపు లోపలికి తోశాడు. బాత్‌రూంలోకి అడుగుపెట్టి, చలనం లేకుండా నిలబడిపోయాడు. ఎదురుగా కనిపించిన దృశ్యం అతని గుండెను డప్పులా మార్చింది. వినయ్ ఊపిరి పీల్చుకోవడం మరిచిపోయాడు. రెప్పపాటు మరిచిపోయాడు.

స్నానం ముగించిన సంధ్య సింక్‌పైన గోడనంతా ఆక్రమించిన వెడల్పాటి అద్దం ముందు నిలుచుని, బాబ్డ్‌హెయిర్ని తుడుచుకుంటోంది టవల్‌తో. నూలుపోగు లేని సంధ్య నిసర్గ సౌందర్యం అద్దంలోంచీ వినయ్ ముందు సాక్షాత్కరించింది. సహధర్మచారిణి సాక్షాత్కార దర్శనం, అనాచ్ఛాదితంగా.. వినయ్ ఏదో భావావేశంతో విగ్రహంలా నిలబడి చూస్తూ ఉండిపోయాడు. చిన్నప్పుడు రాత్రివేళల్లో ఆకాశంలో వెలిగే నిండు చంద్రుణ్ణి చూసినప్పుడు కలిగిన భావావేశం లాంటిది. చిన్నప్పుడు తరంగ నాట్యవిన్యాసం చేస్తున్న మహాసముద్రాన్ని చూసిన క్షణాల్లో కలిగిన భావావేశం లాంటిది. దుస్తులు ధరించినప్పటి సంధ్య అందాన్ని వెయ్యింతలు, లక్ష రెట్లు, కోటి రెట్లు చేసి చూపుతున్న సౌందర్య విశ్వరూపం అది!

మంత్రముగ్ధుడిలా సంధ్య ప్రతిబింబం చూస్తూ నిశ్చలంగా నిలబడిపోయిన వినయ్ కళ్ళు చెదిరాయి. అద్దంలోని అందాలబొమ్మ కళ్ళు తనవైపు చూశాయి. మరుక్షణం ప్రతిబింబం ముందున్న బింబం కెవ్వుమని అరిచింది. ప్రతిబింబం చేతుల్లోని తువ్వాలు కిందపడి పోయింది. వినయ్ చూపులు ప్రతిబింబం మీద నుండీ బింబం మీదికి మళ్ళాయి. నేలమీద మూట కట్టుకుని కూచున్న సంధ్య తల తిప్పి అతని వైపు చూస్తోంది. ఆమె విశాల నేత్రాలు సిగ్గుకీ, ఆగ్రహానికీ పట్టిన అద్దాల్లా ఉన్నాయి.

"గెటౌట్!" సంధ్య బిగ్గరగా అరిచింది.

"సంధ్యా!"

"గెటౌట్!"

"అయాం సారీ.." వినయ్ చూపుల్ని కిందికి దించుతూ అన్నాడు.

మోకాళ్ళ చుట్టూ చేతుల్ని అల్లుకుని కూచున్న సంధ్య పెదవులు అదిరాయి. "వెళ్ళవతలకి! సిగ్గులేదూ?"

సంధ్య అరుపు కమ్చీదెబ్బలా తాకింది వినయ్‌ని. వినయ్ రెప్పపాటులో బాత్‌రూం గుమ్మం దాటి అవతలికి పరుగెత్తాడు, ఎవరో తరుముతున్నట్టు.

***

వినయ్ చేతులు యాంత్రికంగా స్టీరింగ్ వీల్‌ని తిప్పుతున్నాయి. సాధారణంగా వినయ్ డ్రైవింగ్‌లో వేగంగా దూసుకెళ్ళే ఆడీ ఇప్పుడు నెమ్మదిగా రోడ్డు మీద జారుతోంది. వినయ్ చూపులు ఎదురుగా ఉన్న కారు అద్దం మీదే ఉన్నాయి. అయితే, అతని కళ్ళకి రోడ్డు కనిపించడం లేదు. పక్క లేన్స్‌లో దూసుకెళ్తున్న వాహనాలు కనిపించడం లేదు. కారు అద్దం మీద సంధ్య శరీరం కనిపిస్తోంది. బంగారం బొమ్మలా ఉన్న ఆమె శరీరం మీద నీటి బిందువులు ముత్యాల్లా కనిపిస్తున్నాయి. రెండు చేతుల్తో తల తుడుచుకుంటున్న ఆమె శరీరం గాలికి స్పందించే తీగలా స్పందిస్తోంది.

ఉన్నట్టుండి వెనకవైపు నుండి ఆత్రంగా ధ్వనించిన కారు హారన్ వినయ్‌ని ఊహల్లోంచి ఇవతలికి లాగింది. పక్కలేన్‌లోకి దురాక్రమణ చేసిన 'ఆడీ'ని దార్లో పెట్టాడు వినయ్.

బాత్‌రూంలో సంధ్యను చూసి తను తప్పుచేశాడా? భర్త భార్యను అలాచూడ్డం తప్పవుతుందా? తప్పయితే ఇంక భార్యాభర్తల దాంపత్యసంబంధానికి అర్థం ఏముంటుంది? నిర్దేశిత స్థలంలో, సమయంలో తప్ప, ఇతర స్థలాల్లో, సమయాల్లో అర్ధాంగిని అనాచ్ఛాదితంగా చూడకూడదా? వినయ్ తల విదిల్చి, అల్లిబిల్లిగా అల్లుకుంటున్న ఆలోచనల్ని తరిమే ప్రయత్నం చేస్తూ ఆఫీసు పార్కింగ్‌లో ఆడీని ఆపాడు.

***

తలుపు తెరిచిన సంధ్యను చిరునవ్వుతో చూశాడు వినయ్. సంధ్య రెప్పలు కళ్ళమీదికి వాలాయి. ఆమె వెనుదిరిగి నడవసాగింది. లేత నీలం రంగు చీర. అదే రంగు చేతుల్లేని జాకెట్. సహజసిద్ధమైన వయ్యారాన్ని సొంతం చేసుకున్న నడక ఆమె అందానికి ఆకర్షణను జతచేస్తోంది. తలుపుమూసి, దానికి వీపు



ఆన్చి నిలుచున్న వినయ్ రెప్పవేయకుండా సంధ్యను చూస్తూ ఉండిపోయాడు.

సంధ్య తిన్నగా వెళ్ళి సోఫాలో కూచుని, రిమోట్ నొక్కి టీవీ ఆన్‌చేసింది. వినయ్ షూస్ తీసేసి, ల్యాప్‌టాప్ సంచిని టేబుల్ మీదపెట్టి ఆమె దగ్గ రగా నడిచాడు.

"మీ కాఫీ ఫ్లాస్కులో ఉంది" సంధ్య టీవీనే చూస్తూ, ఛానల్స్ మారుస్తూ అంది.

వినయ్ కిచెన్ వైపు నడిచాడు. కిచెన్‌నీ హాలునీ వేరుచేస్తున్న చిన్న గోడ మీదున్న ఫ్లాస్కు, రెండు కప్పులు అందుకుని సోఫావైపు వెళ్ళాడు. ఫ్లాస్కునీ, కప్పుల్నీ టీపాయ్ మీద పెట్టి, సంధ్య ఎదురుగా కూచున్నాడు. కాఫీని రెండు కప్పుల్లోకి పోశాడు.

"కాఫీ తీసుకో" అన్నాడు ఒక కప్పు సంధ్య వైపు జరుపుతూ.

"నేను తాగాను."

టీవీ వైపే చూస్తున్న సంధ్యవైపు నిరుత్సాహంగా చూశాడు వినయ్. సంధ్య ఛానల్సు మారుస్తూనే ఉంది. వినయ్ చొరవగా ఆమె చేతిలోంచీ రిమోట్ తీసుకుని, టీవీ బంద్ చేశాడు.

"సంధ్యా, అయామ్ సారీ!"

సంధ్య చూపుల్ని అతని వైపు తిప్పింది.

"నేను రావాలని బాత్‌రూంలోకి రాలేదు".

"రావాలని రాలేదు. కావాలని వచ్చారు" సంధ్య కళ్ళు తీక్షణంగా చూశాయి.

"నో!" వినయ్ నొక్కుతూ అన్నాడు. "లాకర్లో పెట్టడానికి నీ నగలు తీసుకోడానికి వచ్చాను. బెడ్‌రూం తలుపూ, బాత్‌రూం తలుపూ గొళ్ళేలు బిగించకుండా వదిలేసి ఉంటావని నేను అనుకోలేదు."

"వదిలేయలేదు. తొందరలో మరిచినట్టున్నాను".

"నీ ఆరోగ్యం పాడై ఉంటుందన్న భయంతో వచ్చాను. నిజం! నన్ను నమ్ము. నువ్వు స్నానం చేస్తున్నట్టు నాకు తెలీదు సంధ్యా".

"చూడాల్సింది చూసేశారుగా! ఇంక వదిలేయండి. గుర్తుచేసి నన్ను బాధపెట్టొద్దు" సంధ్య తల వాల్చు కుని అంది.

"మళ్ళీ చెప్తున్నాను సంధ్యా. రావాలనిగానీ, కావా లనిగానీ నేను అక్కడికి రాలేదు. నువ్వు చదువు కున్న దానివి. నేను చదువుకున్న వాడిని. నువ్వూ నేనూ భార్యాభర్తలం. భార్యాభర్తలు ఒకర్నొకరు ఆ స్థితిలో చూసుకోవడం తప్పుకాదు; జీవితంలో తప్పేదీ కాదు.."

"కావచ్చు. అది నాకు నచ్చదు!" సంధ్య అడ్డొస్తూ అంది.

"ఓకే.. మళ్ళీ అలా జరగదు. ఈసారికి ఎక్స్‌క్యూజ్ చెయ్యి" వినయ్ నవ్వుతూ అన్నాడు. "జరిగింది మరిచిపో!"

"సర్లెండి"

"థాంక్స్. మరిచిపోయి ఉంటే కాఫీ తీసుకో. నా కాఫీని నీతో పంచుకోవాలనుకుంటున్నాను."

సంధ్య మాట్లాడకుండా కాఫీ కప్పు అందుకుంది.

"రాత్రికి వంట చేశావా?" వినయ్ అడిగాడు.

"చేశాను".

"ఆ వంట మరిచిపో. ఇవాళే 'ఆంధ్రాభవన్' హోటల్ ప్రారంభించారు. భోజనానికి వెళ్దాం. సినిమా పాటలతో సంగీత విభావరి కూడా ఉంది".

"వద్దులెండి. నాకు ఓపిక లేదు" సంధ్య చేతులు నలుపుకుంటూ అంది.

"ఉదయం ఎపిసోడ్ మరిచిపోయి, నన్ను మన్నిం చడం నిజమైతే నువ్వు హోటల్‌కి రావాలి".

"సరే.." సంధ్య నిరుత్సాహంగా అని పైకి లేచింది. రెండో బెడ్‌రూం వైపు వెళ్ళసాగింది.

"సంధ్యా..." వినయ్ పిలిచాడు.

సంధ్య ఆగి, తిరిగి చూసింది.

"చీరలో కళ్ళు చెదిరేలా ఉన్నావ్! డ్రెస్ మార్చు కోవద్దు".

"అలాగే... మీ ఇష్టం.." సంధ్య చిరునవ్వు నవ్వి వెనుదిరిగింది.

"సంధ్యా.." వినయ్ మళ్ళీ పిలిచాడు.

సంధ్య మళ్ళీ ఆగి, మళ్ళీ తిరిగి చూసింది.

"నన్ను 'మీరు' అని మర్యాదగా అంటూంటే మన మధ్య దూరం పెరుగుతున్నట్టనిపిస్తోంది. ఆ దూరాన్ని దూరంచెయ్. 'నువ్వు' అను. 'వినయ్' అను. అమెరికా వెళ్ళాక ఏకవచనం ఉపయోగి స్తానని మాటిచ్చావు. మరిచిపోయావా?"

"లేదు..."

"అయితే.. ఆ 'మీరు'ను మరిచిపో! ఓకే?" వినయ్ చిరునవ్వుతో అన్నాడు.

సంధ్య చిరునవ్వుతో చూసింది. "ఓకే వినయ్! నువ్వు డ్రెస్ మార్చుకో".

బెడ్‌రూంలోకి వెళ్తున్న సంధ్యను చిరునవ్వుతో తృప్తిగా చూస్తూ ఉండిపోయాడు. సంధ్య తనను "నువ్వు" అంది. 'వినయ్' అంది, మొదటిసారిగా! పెళ్ళయినప్పట్నుంచీ యాదృచ్ఛికంగా తమ మధ్య చోటు సంపాదించుకున్న దూరం, ఇద్దర్నీ ఎడంగా ఉంచిన దూరం మాయమై పోయింది. ఉదయం తనను ఆ స్థితిలో చూసిన సంఘటన సంధ్యలో మార్పుతెచ్చి, పరోక్షంగా తనకు దగ్గరగా వస్తోందా?

'ఎనీథింగ్ షుడ్ బీ హార్డ్ ఎర్న్‌డ్' దేన్నయినాసరే కష్టపడి సాధించుకోవాలి అనే సిద్ధాంతాన్ని విద్యా ర్థిగా ఉన్నప్పట్నుంచీ నమ్మిన తనకు దాంపత్య సౌఖ్యం, సహధర్మచారిణి సాహచర్యం కష్టపడి సాధించుకున్నవిగా దక్కుతున్నాయా! భర్తగా తనూ, భార్యగా సంధ్యా ఇన్నాళ్ళు అనుభవించిన స్వల్పకాలిక విరహం అంతర్ధానం కానుందా! యస్! తమ తాత్కాలిక విరహం దూరం కానుంది. ఇద్దరూ దగ్గర కానున్నారు. సందేహం లేదు. అందుకు తగిన సంకే తాల్ని సంధ్య సప్లై చేసింది. 'నువ్వు', 'వినయ్' అనే సంబోధనతో!

వినయ్ హుషారుగా సోఫాలోంచి లేచాడు. విజిల్ వేసుకుంటూ మాస్టర్ బెడ్‌రూంలోకి దూరాడు.

***

వినయ్ ఎడమచేత్తో తలుపుతాళం తెరిచాడు. తలుపును లోపలికి తోశాడు. అంతసేపూ సంధ్య భుజాన్ని చుట్టి ఉన్న అతని కుడిచెయ్యి నెమ్మదిగా ఆమె వీపు మీదికి జరిగింది. సున్నితంగా తోస్తూ ఆమెను గుమ్మం దాటించింది.

సంధ్య వేగంగా అడుగులు వేస్తూ సెకండ్ బెడ్ రూంలోకి వెళ్ళింది. ఆ కాస్సేపు ఆమె నడకను చిరు నవ్వుతో గర్వంగా చూసిన వినయ్ మాస్టర్ బెడ్ రూంలోకి వెళ్ళాడు. జీన్సూ, షర్టూ తీసేసి, టవల్ చుట్టుకుని బాత్‌రూంలోకి వెళ్లాడు.

బ్రష్ చేసుకున్నాడు. పర్ఫ్యూమ్ స్ప్రే చేసుకు న్నాడు. బెడ్‌రూంలోకి వచ్చి, అమెరికన్ నైట్ డ్రెస్ కాసేపు చూసి, నాన్న ప్రత్యేకంగా కొనిచ్చిన మెత్తటి వైట్ కాటన్ లుంగీని కట్టుకుని, సిల్కు జుబ్బా వేసుకు న్నాడు. నాలుగైదు రోజులుగా నలిగిన బెడ్‌స్ప్రెడ్‌ని తీసేసి, బంగారు రంగు ఈజిప్షియన్ కాటన్ బెడ్ స్ప్రెడ్‌ని డబుల్‌బెడ్ మీద వేశాడు. తలగడల్ని మ్యాచింగ్ కవర్స్‌లోకి మార్చాడు. అనాలోచితంగా మంచంమీద కూచున్నాడు. క్షణంలో వినయ్ చిన్నగా

## దేవసేన పాత్రలో కార్తీక!

దేవసేన పేరు తలుచుకోగానే ముందు గుర్తుకొచ్చేది అనుష్క! అలాంటిది ఆ పాత్రను తెలుగులో ఎప్పుడో అవుట్‌డేటెడ్ అయిపోయిన కార్తీక చేయడం ఏమిటి? అనే అనుమానం రావడం సహజమే! అయితే కార్తీక చేయబో తోంది వెండితెర మీద కాదు, బుల్లితెర మీద. విజయేంద్రప్రసాద్ బుల్లితెరకు అందిస్తున్న ఓ సీరియల్‌లో 'దేవసేన' పాత్రని కార్తీక చేయ బోతోంది. వెండితెర మీద ఎలాగూ సక్సెస్ కాలేకపోయిన కార్తీక బుల్లితెర మీదనైనా సత్తా చాటాలని చూస్తోంది. తన తల్లి వారసత్వాన్ని ఏమాత్రం పుణికి పుచ్చుకోలేని కార్తీక బుల్లితెర మీద ఎలా మెప్పిస్తుందో అని కొందరు అను మానం వ్యక్తం చేస్తున్నారు.



నవ్వుకున్నాడు. తను రెండు మూడు 'తొలి రాత్రుల' ఆనందంతో అసంకల్పితంగా సంధ్య కోసం ఎదురు చూస్తున్నాడు.

వినయ్ నవ్వుకుంటూ మంచం దిగాడు. తనకు తెలుసు. సంధ్య ఇక్కడికి రాదు. ఆమె సిగ్గును తరిమేస్తూ, తనున్న గదిలోకి సున్నితంగా తోయడానికి ఇక్కడ ఎవరూ లేరు. మొదటిసారిగా, ఏకాంతంలో ఉన్న భర్త దగ్గరకు రావాలంటే స్త్రీ సహజంగా సిగ్గుపడుతుంది. సంధ్యను సిగ్గు దుప్పటిలా కప్పేసి ఉంటుంది. తాను స్వయంగా వెళ్ళాలి. తమ జాయింట్ బెడ్‌రూంలోకి ఆమెను తీసుకురావాలి. భుజాల చుట్టూ ప్రణయ పాశంలా చేతిని అల్లి నడిపించుకు రావాలి!

వినయ్ నాలుగురోజులుగా సంధ్య నిద్రపోతున్న సెకండ్ బెడ్‌రూం వైపు నడిచాడు. హ్యాండిల్ తిప్పి, తలుపు లోపలికి తోశాడు. గదిలో లైటు వెలుగుతోంది. అతని చూపులు మంచం వైపు పరుగెట్టాయి. సంధ్య అతనికోసం ఎదురుచూస్తూ మంచం మీద కూచుని లేదు. సంధ్య మంచం మీద నిద్రపోతోంది. వెల్లకిలా పడుకుని, ఆదమరిచి నిద్రపోతోంది. వినయ్ రిస్టువాచీ చూసుకున్నాడు. పన్నెండు కావొస్తోంది. అందుకే సంధ్య అలసటతో నిద్ర పోతోంది.

వినయ్ ప్రేమగా సంధ్యవైపు చూశాడు. సాయంత్రం కట్టుకున్న నీలం రంగు చీరలోనే పడుకుంది, చీరలో అద్భుతంగా ఉందని తను అన్నందుకు. ఔను! తనకు నచ్చిన చీరతోనే పడుకుంది! వినయ్ చిరునవ్వుతో మంచం దగ్గరకు నడిచాడు. అప్రయత్నంగా సంధ్యను నఖశిఖ పర్యంతం చూస్తూ ఉండిపోయాడు. చీరకుచ్చెళ్ళు నిద్రలో పైకి జరిగినట్టున్నాయి. పాదాలూ పిక్కలూ పసుపుపచ్చగా మెరుస్తున్నాయి. పెళ్ళినాడు కాలి వేళ్ళకి పెట్టుకున్న వెండి మట్టెలూ, పట్టీలూ తళతళ మెరుస్తున్నాయి.

వినయ్ చూపులు అనురాగకిరణాల్లా సంధ్య శరీరం మీద పైకి పాకాయి. ఆమె శరీరాన్ని కప్పిన పైట నీలం రంగు తరంగంలా పైకీ కిందికీ స్పందిస్తోంది, ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలను కొలత వేస్తున్న అందమైన పరికరంలా. వినయ్ చూపుల్ని తళుక్కుమంటూ ఏదో లాగింది. మాంగల్యం తను కట్టిన బంగారు మాంగల్యం కొద్దిగా తొలగిన పైటలోంచి తిరిగి చూస్తోంది.

సంధ్య శ్వాసతరంగం మీంచి వినయ్ దృష్టి ఆమె ముఖం మీదికి ప్రయాణం చేసింది. తలగడ మీద అందంగా పరుచుకున్న బాబ్డ్‌హెయిర్ మధ్య ఉన్న ఆమె ముఖం కారుమేఘం మధ్య కొలువు తీరిన చందమామలా ఉంది. పైకి ఉన్న చేతులు ఆమె ముఖానికి బంగారు ఫ్రేములా ఉన్నాయి. విల్లు ఆకారంలో ఉన్న కనుబొమల కింద మూసుకున్న రెప్పలు తడిగా మెరుస్తున్న ఎర్రటి పెదవులు కొద్దిగా కదిలి, పైకి తన్నుకు వచ్చిన చిరునవ్వుకు ప్రాణం పోశాయి.

వినయ్ మరొక్కసారి సంధ్య నిద్రాసౌందర్యాన్ని ఆశగా, ఆవేశంగా తిలకించాడు. అతని చూపులు మళ్ళీ ఆమె పెదవుల మీద వాలాయి. చిరునవ్వుకు జీవం పోస్తున్న పగడాల పెదవులు కనిపించీ కనిపించకుండా కదుల్తూ తనను ఆహ్వానిస్తున్నాయా? కళ్ళకు కనిపించని బంగారు సంకెళ్ళు తన హృదయాన్ని సున్నితంగా చుట్టి, తన హృదయాన్ని సంధ్య హృదయం వైపు, తన శరీరాన్ని సంధ్య శరీరం వైపు లాగుతున్నట్టనిపిస్తోంది వినయ్‌కి. మంచం దగ్గరగా జరిగి ఆవేశంతో ముందుకు వంగాడతను.

ఏదో ఆలోచన అతన్ని ఆపింది. వినయ్ గదినీ, మంచాన్నీ కలియజూశాడు. తమ ఐక్యతకు వేదిక ఇదికాదు! మాస్టర్ బెడ్‌రూమ్‌లోని డబుల్ బెడ్! ఆవేశాన్ని నిగ్రహించుకుంటూ మంచం అంచున కూచున్నాడు వినయ్. కొద్దిగా ముందుకు వంగాడు. నెమ్మదిగా అతని పెదవులు కదిలాయి.

"సంధ్యా..." ప్రాణుల సృష్టికి మూలమైన ప్రేమావేశం వినయ్ కంఠంలో పలికింది.

వినయ్ చెయ్యి మెల్లగా కదిలి, సంధ్య నుదురు మీద వాలింది. అనురాగభారంతో స్పందిస్తూ, ఆమె చెంపమీదకు చేరింది. అద్దంలాంటి చెక్కిలి స్పర్శ అతని అరచేతిని కొద్దిగా వణికించింది. వినయ్ బొటనవేలు సంధ్య పెదవుల మీద కదుల్తూ, లిపి లేని భాషతో ప్రణయగీతాన్ని రాయసాగింది.

ఒక్కసారిగా సంధ్య శరీరం జలదరించింది. ఆమె కళ్ళని మూసిన రెప్పలు కిటికీ రెక్కల్లా తటాలున తెరుచుకున్నాయి. ఆమె కళ్ళు ఏదో అర్థం కాని భయంతో చూశాయి. సంధ్య తటాలున పైకి లేచింది. వినయ్ చెయ్యి కిందికి జారింది. సంధ్య కెవ్వున అరిచింది. ఆమె చేతులు కదిలి, వినయ్‌ని బలంగా తోశాయి.




"సంధ్యా!" వినయ్ అసంకల్పితంగా పిలిచాడు. అతని పిలుపుని మింగేస్తూ సంధ్య పొలికేక కొనసాగింది. సంధ్య మెరుపు వేగంతో మంచం మీంచి దూకింది. అరుస్తూ, ఎవరో తరుముతున్నట్టు గది మూలకి పరుగెట్టింది. గది మూలను కరుచుకుని, గజగజ వణికిపోతూ ఉండచుట్టుకుని కూచుంది. పిచ్చిపట్టిన దానిలా అరుస్తూనే ఉంది. వినయ్ కంగారుగా మంచం మీంచి దూకి ఆమె వైపు పరుగెత్తాడు.

"సంధ్యా! సంధ్యా ఏమైంది? అరవకు! భయం లేదు" వినయ్ ధైర్యం చెప్తూ సంధ్యను సమీపించాడు.

అతను దగ్గరగా వెళ్ళేకొద్దీ సంధ్య వణుకు ఎక్కువవుతోంది. బొంగురుగా తయారైన కంఠంతో అరుస్తూనే ఉందామె. చేతులు ముందుకు చాపి, వినయ్ ఆమె ముందుకు నడిచాడు. "సంధ్యా..."

సంధ్య అంతసేపూ భయానక రాగంలా సాగిన కేకను ఆపింది. చివాల్న తలతిప్పి, వినయ్ వైపు చూసింది. ఆమె పెద్ద పెద్ద కళ్ళు ఆవేశంతో ఇంకా విచ్చుకున్నాయి. ఆ కళ్ళల్లో ఏదో అర్థం కాని భయం విశ్వరూపంలో కనిపిస్తోంది. సంధ్య తన చేతిని అడ్డుగా పెట్టుకుంది.

"రాకు! నా దగ్గరగా రాకు!" సంధ్య భయంతో అరిచింది.

"సంధ్యా... కామ్‌డౌన్.. నీకేం కాలేదు.." వినయ్ ఓదార్పుగా అన్నాడు.

"ఆగు! నన్ను ముట్టుకోవద్దు. నన్నేం చేయొద్దు! వద్దు.." సంధ్య వణికే కంఠంతో బిగ్గరగా అంది.

"సంధ్యా... ప్లీజ్"

"వద్దు.. నా దగ్గరకు రావద్దు. దూరం వెళ్ళు! వెళ్ళు! వెళ్ళిపో!"

వినయ్ వశం తప్పి వణుకుతున్న తన శరీరాన్ని అదుపులో పెట్టుకుంటూ, అప్రయత్నంగా వెనక్కి అడుగులు వేశాడు. ఆందోళనగా సంధ్యవైపు చూశాడు. సంధ్య ఎందుకో భయపడుతోంది. తనను చూసి ఎందుకో భయపడుతోంది.

"సంధ్యా... భయపడకు.. నేను నిన్నేం చేయను. ఇలా చూడు.. నీకేదో పీడకల..."

"వెళ్తావా లేదా? ప్లీజ్ వెళ్ళిపో! నన్నేం చేయకు" సంధ్య బిగ్గరగా అరిచింది.

వినయ్ బెడ్‌రూంలోంచి హాల్లోకీ, హాల్లోంచి వంటగదిలోకీ పరుగెత్తాడు. సంధ్య తెప్పరిల్లాలంటే ముఖం మీద నీళ్ళు చల్లడం ద్వారా, నీళ్ళు తాగించడం ద్వారా ప్రథమచికిత్స చేయాలి. వినయ్ చన్నీళ్ళ కుళాయి తిప్పి, జగ్గులో నీళ్ళు పట్టుకున్నాడు. సంధ్య ఉన్న బెడ్‌రూం వైపు పరుగెత్తాడు. తలుపు మూసుకుని ఉంది. వినయ్ హాండిల్ తిప్పి, తలుపుతెరిచే ప్రయత్నం చేశాడు. హాండిల్ పూర్తిగా తిరగలేదు. సంధ్య అటువైపున లాక్ చేసినట్టుంది.

"సంధ్యా!" వినయ్ బిగ్గరగా పిలిచాడు. "తలుపు తెరు."

"నో! నేను తెరవను! నువ్వు నన్నేమో చేస్తావ్!"

"సంధ్యా! నా మాట విను. నిన్నేం చేయను. ప్రామిస్! తలుపుతెరు సంధ్యా!" వినయ్ ప్రాధేయపూర్వకంగా అన్నాడు.

"గెటౌట్!" సంధ్య బొంగురుగా అరిచింది.

***(ఇంకావుంది)***

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## హార్మోన్ సమస్యలకు సమర్థవంతమైన చికిత్సలు

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



ఈ మధ్యకాలంలో చాలామంది థైరాయిడ్, పీ.సి.ఓ.డి., సంతానలేమి మరియు డయాబెటిస్ వంటి దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలతో ఎక్కువగా బాధపడటం జరుగుతోంది. ఈ విధమైన ఆరోగ్య సమస్యలు హార్మోన్ల అసమతుల్యత వలన ఏర్పడతాయని చాలామందికి తెలియదు. ఇలాంటి అసమతుల్యతలు ఏర్పడటానికి కేవలం చిన్న కారణమైనా చాలు – అవి తీవ్రమైన దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలకు దారితీస్తాయి. కాబట్టి వీటి పట్ల అవగాహన పెంచుకోవడం వలన ఇలాంటి వ్యాధుల బారిన పడకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు.

హార్మోన్లు అనేవి శరీరంలోని ఎండోక్రైన్ గ్రంథుల నుండి ఉత్పత్తి అయ్యే రసాయన వాహకాలు. ఇవి శరీరంలో ఒక ప్రాంతపు కణజాలం, అవయవాల నుండి ఉత్పత్తి అయి – వివిధ శరీర భాగాలకు రక్తప్రసరణ ద్వారా చేరుకుని, నిర్దిష్ట అవయవాలను ప్రభావితం చేయటం ద్వారా జీవక్రియల సమతుల్యతకు తోడ్పడతాయి. ఇవి శరీరంలో సూక్ష్మమోతాదులో ఉత్పత్తి అయినప్పటికీ, శరీరంలోని సాధారణ జీవక్రియలైన జీర్ణక్రియ మొదలుకొని శారీరక–మానసిక ఎదుగుదల, ప్రత్యుత్పత్తి, మానసిక సమతుల్యత వంటి అన్ని జీవక్రియలపై వీటి ప్రభావం ఉంటుంది. ఏ కారణం చేతనైనా ఇవి అసమతుల్యతకు గురి అయితే, అవి తీవ్రమైన ఆరోగ్య సమస్యలుగా పరిణమిస్తాయి.




**వివిధ హార్మోన్లు - వాటి అసమతుల్యత వలన కలిగే వ్యాధులు:** **థైరాయిడ్ హార్మోన్లు(T3, T4):** ఇవి థైరాయిడ్ గ్రంథి నుండి ఉత్పత్తి అవుతాయి. ఈ హార్మోన్ల ప్రభావం 90% వరకు మానవుని జీవక్రియలపై ఉంటుంది. వీటి అసమతుల్యత వలన హైపోథైరాయిడ్, హైపర్‌థైరాయిడ్, గాయిటర్ వంటి దీర్ఘకాలిక జబ్బులు కలుగుతాయి. **హైపోథైరాయిడిజం:** థైరాయిడ్ హార్మోన్లు తక్కువ మోతాదులో ఉత్పత్తి కావడం వలన ఇది ఏర్పడుతుంది. **లక్షణాలు:** బరువు పెరగటం, జుట్టు రాలటం, నీరసం, మతిమరుపు, ఋతుచక్ర సమస్యలు మొదలైన లక్షణాలు కనిపిస్తాయి. **హైపర్‌థైరాయిడిజం:** శరీరంలో థైరాయిడ్ హార్మోన్లు ఎక్కువ మోతాదులో ఉత్పత్తి అవడం వలన ఈ సమస్య ఏర్పడుతుంది. **లక్షణాలు:** బరువు తగ్గడం, నీరసం, గుండెదడ, కాళ్ళు–చేతులు వణకడం మొదలగు లక్షణాలు కనిపిస్తాయి. **గాయిటర్:** గొంతు ముందుభాగంలో ఉండే థైరాయిడ్ గ్రంథి వాపునకు గురి కావడాన్ని గాయిటర్ అంటారు. ఇది ముఖ్యంగా అయోడిన్ అనే మూలకం యొక్క లోపం వలన కలుగుతుంది. ఇది హైపోథైరాయిడ్ లేదా హైపర్‌థైరాయిడ్ సమస్యలతో కూడుకుని ఉండవచ్చు. **హోమియోకేర్ చికిత్స:** ప్రస్తుత పరిస్థితులలో మానవుని ప్రకృతి విరుద్ధమైన జీవన విధానం, అధిక మానసిక ఒత్తిడికి గురికావటం, వ్యాయామ లోపం వలన ఎక్కువ శాతం థైరాయిడ్ వ్యాధుల బారిన పడటం జరుగుతోంది. థైరాయిడ్ సమస్యలకు జీవితకాలం మందులు వాడే అవసరం లేకుండా, ఈ సమస్య రావటానికి గల మూలకారణాన్ని గుర్తించి, వ్యక్తి శారీరక–మానసిక తత్వానికి అనుగుణంగా సరైన హోమియో వైద్యచికిత్స ద్వారా ఎలాంటి థైరాయిడ్ హార్మోన్ సమస్యనైనా సంపూర్ణంగా నయం చేయవచ్చు.

**స్త్రీలలో ఉండే హార్మోన్లు:** ఈస్ట్రోజెన్, ప్రొజెస్టిరాన్, ప్రొలాక్టిన్, ఆక్సిటోసిన్ హార్మోన్లు స్త్రీలలో రజస్వల, ఋతుచక్రం, ద్వితీయ లైంగిక లక్షణాలు, సంతానోత్పత్తి మరియు ప్రసవంలో ఉపకరిస్తాయి. ఈ హార్మోన్ల అసమతుల్యత వలన స్త్రీలలో ఋతుచక్ర సమస్యలు (పీ.సి.ఓ.డి.), హిర్సుటిజం (అవాంఛిత రోమాలు) మరియు సంతానలేమి సమస్యలు ఏర్పడతాయి. స్త్రీలలో మెనోపాజ్ మరియు రజస్వల అయ్యే సమయంలో హార్మోన్ల ప్రభావం ఎక్కువగా ఉంటుంది. మెనోపాజ్‌లో హార్మోన్ల హెచ్చుతగ్గుల వలన Hot Flushes, మానసిక అశాంతి, నీరసం, కీళ్ళ నొప్పులు మరియు కండరాల నొప్పులు ఉత్పన్నమవుతాయి. **పురుషులలో ఉండే హార్మోన్లు:** TSH, LH మరియు టెస్టోస్టిరాన్ హార్మోన్లు పురుషులలో శుక్రకణాల ఉత్పత్తికి తోడ్పడతాయి. ఈ టెస్టోస్టిరాన్ హార్మోన్ల అసమతుల్యత వలన శీఘ్రస్కలనం, అంగస్తంభన సమస్యలు, శుక్రకణాల సమస్యలు ఏర్పడటం వలన సంతానలేమి సమస్యలు కలుగుతాయి. **ప్రొలాక్టిన్ హార్మోన్:** ఈ హార్మోన్ ముఖ్యంగా స్త్రీలలో ప్రసవానంతరం పాల ఉత్పత్తికి ఉపకరిస్తుంది. సాధారణంగా ఈ హార్మోన్ గర్భధారణ సమయంలో మరియు ప్రసవానంతరం కూడా ఎక్కువగా ఉత్పత్తి అవుతుంది. ఈ పరిస్థితులు మినహా స్త్రీలలో ఈ హార్మోన్లు ఎక్కువ స్థాయిలో ఉత్పత్తి అయితే ఈస్ట్రోజన్ హార్మోన్ స్థాయిలు తగ్గిపోయి, అండం విడుదల లోపాలు ఏర్పడతాయి. కొంతమందిలో అండం విడుదల సక్రమంగా జరిగినా కూడా, ప్రొజెస్టిరాన్ హార్మోన్ ఉత్పత్తి జరగకపోవచ్చు. దీనివలన గర్భాశయం పిండ ప్రతిస్థాపనకు సిద్ధంగా లేకపోవడం వలన గర్భధారణ జరగక సంతానలేమి కలుగుతుంది. **పురుషులలో:** ఈ హార్మోన్లు ఎక్కువ స్థాయిలో ఉత్పత్తి అయితే టెస్టోస్టిరాన్ హార్మోన్ల స్థాయిలు తగ్గి – తద్వారా శుక్రకణాల ఉత్పత్తి తగ్గిపోవడం మరియు లైంగిక సమస్యలు కలుగుతాయి. **హోమియోకేర్ చికిత్స:** హార్మోన్ సమస్యలు ఒకదానితో మరొకటి అనుసంధానమై ఉంటాయి. వీటికి హోమియోకేర్ వైద్యంతో ఎలాంటి హార్మోన్లు బయట నుండి ఇవ్వకుండానే హార్మోన్ అసమతుల్యతలను సరిచేయటం వలన ఎలాంటి దుష్ప్రభావాలు లేకుండా ఋతుచక్ర సమస్యలు, పీ.సి.ఓ.డి. సమస్యలు, సంతానలేమి మరియు శుక్రకణ సమస్యలను సంపూర్ణంగా నయం చేయవచ్చు.

**డయాబెటిస్ ఇన్‌సిపిడస్:** ADH (యాంటీ డయూరెటిక్ హార్మోన్) లోపం వలన వస్తుంది. దీనిని అతి మూత్ర వ్యాధి అంటారు.
**డయాబెటిస్ మెల్లిటస్:** ఇది క్లోమ గ్రంథి ఉత్పత్తి చేసే ఇన్సులిన్ లోపం వలన లేదా తక్కువ మోతాదులో ఇన్సులిన్ ఉత్పత్తి కావడం వలన కలుగుతుంది. ఇది రెండు రకాలు. **టైప్-I డయాబెటిస్:** ఇది ఇన్సులిన్ ఉత్పత్తి కాకపోవడం వలన వస్తుంది. దీనిని జువెనైల్ డయాబెటిస్ అని అంటారు. ఈ వ్యాధి ఉన్నవారు పూర్తిగా ఇన్సులిన్ ఇంజెక్షన్లపై ఆధారపడవలసి వస్తుంది. **టైప్-II డయాబెటిస్:** ఇది ఇన్సులిన్ ఉత్పత్తి తగ్గటం వలన వస్తుంది మరియు ఎక్కువగా 30 సం॥లు పైబడిన వారిలో వచ్చే అవకాశం ఉంటుంది. కానీ ఈ మధ్యకాలంలో యుక్తవయస్సులో ఉన్నవారికి కూడా ఇది రావటం జరుగుతోంది. డయాబెటిస్‌తో బాధపడే వారి రక్తంలోని చక్కెర శాతాన్ని సరిగ్గా నియంత్రణ చేయకపోవడం వలన దీర్ఘకాలంలో డయాబెటిక్ నెఫ్రోపతి, డయాబెటిక్ న్యూరోపతి, రెటినోపతి, గుండె సమస్యలు, అంగస్తంభన సమస్యల వంటి కాంప్లికేషన్లు వస్తాయి. **హోమియోకేర్ చికిత్స:** డయాబెటిస్‌ను తొందరగా గుర్తించి, తొలిదశలోనే హోమియోకేర్ ప్రత్యేక హార్మోన్ సెల్ మరియు కాన్స్‌టిట్యూషనల్ విధానం ద్వారా దీర్ఘకాలికంగా డయాబెటిస్‌తో బాధపడేవారిలో – ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా వ్యాధిని అదుపులో ఉంచటమే కాకుండా కాంప్లికేషన్లను నివారించవచ్చు.

**హార్మోన్ సమస్యలకు హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ సొంతమైన ప్రత్యేక 'హార్మోన్ సెల్' మరియు జెనెటిక్ కాన్స్‌టిట్యూషనల్ సిమిలిమం పద్ధతుల ద్వారా అన్ని హార్మోన్ సమస్యలకు ఖచ్చితమైన మరియు ఎటువంటి దుష్ఫలితాలు లేని వైద్యం అందించటం ద్వారా ఇక జీవితంలో మరోసారి తిరగబెట్టకుండా హార్మోన్ సమస్యలను సంపూర్ణంగా నయం చేసే అవకాశం ఉంటుంది.



# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 33

**నా రాజకీయరంగ ప్రవేశం ఒక ప్రహసనంగా జరిగింది. విద్యాసాగరరావుగారి చొరవతో బి.జె.పి తరపున విజయవాడ తూర్పు నియోజకవర్గం నుండి పోటీ చేశాను. ఆరుగురు అభ్యర్థుల మధ్య నివాసిత ప్రాంతాల దగ్గర, మార్నింగ్ వాకింగ్ సమయాల్లోనూ, టెలిఫోన్ పలకరింపులతోనూ సరికొత్త పంథాలో ఓట్లు అడిగేవాణ్ణి. అంత కష్ట పడినాగానీ నేను గెలుస్తానని మా పార్టీవాళ్ళకే నమ్మకం లేకపోయింది. వాళ్ళు పై పందాలు కూడా వేసుకున్నారు. అవన్నీ విన్న తర్వాత కూడా రెట్టింపు ఉత్సాహంతో ప్రచారానికి పరుగులు తీసేవాణ్ణి.**

# మోహన్‌బాబుగారు ఎందుకు అన్నారో అర్థం కాదు

అపార్ట్‌మెంట్ల ముందు ప్రచారంచేసి తిరిగి వచ్చాక టిఫిన్లు తిని మళ్ళీ ఆఫీసులున్న ఏరియాలకు వెళ్ళేవాణ్ణి. ప్రతి ఆఫీసులోనూ మా అబ్బాయి ముందుగానే పర్మిషన్ తీసుకుని ఉంచేవాడు. నేను వెళ్ళి అందరినీ ఓట్లు అడిగేవాణ్ణి. సాయంత్రం రెసిడెన్షియల్ ఏరియాలకు తిరిగేవాణ్ణి. నేను రావడం ఎక్కడో ఓ పిల్లాడు చూసినా సరే 'రేయ్.. కోటగాడు వస్తున్నాడ్రోయ్' అని కేకలు పెట్టేవాడు. నేను వస్తున్నానని తెలిసేసరికి ప్రతి గుమ్మం ముందూ ఆడవాళ్ల వచ్చి నిలబడేవారు. కొందరు హారతులు పట్టేవారు. అలాగని నేను ఒకచోటే నిలబడి అందరికీ చేతులు ఊపుతూ ఓట్లు అడిగేవాణ్ణి కాదు. ప్రతి గుమ్మానికీవెళ్ళి ప్రతి ఒక్కరినీ పేరుపేరునా పలకరించి ఓట్లు అడిగేవాణ్ణి. ఒక సినిమా ఆర్టిస్ట్ అలా అడుగుతాడని వాళ్ళెవరూ ఊహించి ఉండరేమో. చాలా ఎగ్జయిట్ అయ్యేవారు. అలా నేను ప్రచారం పూర్తిచేసుకుని, ఎన్నికలు అయ్యాక హైదరాబాద్ వచ్చా.

హైదరాబాద్ రాగానే ఆ నెల రోజులూ పెండింగ్‌లో ఉన్న షూటింగ్‌లకు హాజరుకాసాగాను. ఆ సినిమా, ఈ సినిమా అని, ఏవో చిన్న సినిమాలు చేశాక లక్ష్మీ ప్రసన్న పిక్చర్స్‌కు ఇచ్చిన కాల్షీట్ రోజులు వచ్చాయి. మంచు మోహన్‌బాబుగారి సినిమా 'పోస్ట్‌మేన్' అప్పుడు జరుగుతోంది. ఆ చిత్రంలో మంచి వేషం చేశా. హైదరాబాద్‌లో దిల్‌షుఖ్‌నగర్‌లో కొండమీద సెట్ వేసి తీశారు. అందులో సౌందర్య నటించింది. మధ్యలో మూడురోజులపాటు ఏదో పాట తీశారు. ఆ మూడు రోజులూ నా కారెక్టర్‌కు షూటింగ్ లేదు. అది తెలుసుకున్న మా అబ్బాయి 'ఆ మూడు రోజులు మా నాన్నగారు షూటింగ్‌కు రారండీ' అని చెప్పి కాల్షీట్ ఇవ్వలేదు. ఎందుకివ్వలేదా? అని అంటే.. అందుకూ ఓ కారణం ఉంది. ఆ రోజుల్లోనే విజయవాడలో కౌంటింగ్ ఉంది. నేను కౌంటింగ్ రోజు అక్కడ తప్పకుండా ఉండాలన్నది మావాడి భావన. అందుకే ఇవ్వలేదు. కానీ మోహన్‌బాబుగారు ఆ మూడు రోజులు కూడా షూటింగ్ లేకపోయినా నేనిక్కడ షూటింగ్ స్పాట్‌కి రావాల్సిందే అన్నారు.

'ఎలాగండి.. మీకు తెలుసుకదా.. నేను పోటీ చేశాను. అక్కడ కౌంటింగ్ ఉందండీ' అని సర్దిచెప్పబోయా.. మరి ఆయన తమాషా పట్టించడానికి అన్నారో.. వెక్కిరించడానికి అన్నారో ఇప్పటికీ నాకు అంతుబట్టదు కానీ...

'నువ్వెందుకయ్యా అక్కడికి... నువ్వేం గెలుస్తావయ్యా.. నువ్వు నిలుచోవడమే తప్పు. ఇప్పుడు పోయి నువ్వేంటి అక్కడ చేసేది' అని నా ముఖం మీదే అన్నారు. అంతటితో ఊరుకోకుండా అప్పట్లో నాకు మేకప్‌మేన్ మోహన్ అని ఉండేవాడు.. అతన్ని పిలిచి

'ఏయ్ మోహన్...నా మాటలు విను. ఆయన మాటలు విని కారుని జనాల్లోకి తీసుకెళ్ళమాకు. కారును కూడా ఓ వైపు దూరంగా ఉంచమని చెప్పు. దూరంగా కూర్చుని రిజల్ట్ వినండి. ఏమాత్రం తేడాగా అనిపించినా వెంటనే ఆయన్ని హైదరాబాద్ లాక్కుని వచ్చెయ్. అక్కడ ఉంచకు. కారు కనిపిస్తే మట్టిగడ్డలు విసురుతారు. రాళ్ళతో కొట్టారంటే కారు పాడవుతుంది.. అదీ.. ఇదీ...' అని చాలా చెప్పారు. ఆయన మాటలకు మానసికంగా భయపడే పరిస్థితి వచ్చేసింది. వెళ్ళడం మానేద్దామా అని కూడా అనుకున్నా. మా అబ్బాయితో ఈ మాటే అంటే

'సరదాగా అని ఉంటారులే నాన్నా.. కావాలనేమీ అని ఉండరు' అన్నాడు. ఏమైనా ఆయన గురించి మేమేమీ చెడుగా అనుకోలేదులెండి... అప్పుడు కౌంటింగ్ టెన్షన్లో ఉన్నాను కదా.. దాంతో ఎవరేం చెప్పినా కాసింత ఎక్కువగా ఆలోచించేవాణ్ణి. ఎందు



కంటే వెళ్ళకుండా ఉంటే ఒకవేళ ఓడిపోయానను కోండి.. 'ఓడిపోతానని అనుకుని రాలేదురా' అని జనాలు అనుకుంటారు. అదే గెలిచానను కోండి.. 'కౌంటింగ్ రోజు కూడా ఇక్కడికి రాకపోతే, నియోజ కవర్గాన్ని ఇంకేం పట్టించుకుంటాడ్రా' అనుకుంటారు. కౌంటింగ్‌రోజు పార్టీ కార్యకర్తలందరూ చాలా ఉత్కం ఠతో ఎదురుచూస్తారు కదండీ. ఆ ఆలోచనలు నన్ను ఉక్కిరి బిక్కిరి చేశాయి. మరుసటిరోజు మోహన్‌బా బుగారిని కలిసి ఆ విషయమే చెప్పా.

'సరే నువ్వు వెళ్ళాలనే నిర్ణయించుకున్నావా' అని అడిగారు మోహన్‌బాబుగారు.

'ఏమీ అనుకోవద్దుసార్ వెళ్ళి తీరాలి. తప్పదు' అన్నా.

'సరే పో.. నీ ఖర్మ' అని పంపించారు.

ఓ వైపు కౌంటింగ్ జరుగుతోంది.. మరోవైపు పత్రికలవాళ్ళు టీవీలవాళ్ళు చుట్టుముట్టి.. 'అసలు గెలుస్తానని అనుకుంటున్నారా? మీ ఆలోచన ఎలా ఉంది?' అని అడగడం ప్రారంభించారు.

'ఒక్క ఓటు మెజారిటీతోనైనా సరే నేను గెలుస్తాను' అన్నా. అంత నమ్మకం వచ్చింది నాకు. అది ఎలా వచ్చిందో మాత్రం తెలియదు. నా నమ్మకమే నిజమైంది. సరిగ్గా నాలుగు ఓట్లు తక్కువగా నాలుగు వేలు మెజార్టీతో గెలిచాను. ఆ రోజు మావాళ్ళ సందడి అంతా ఇంతా కాదు. విద్యాసాగర్‌గారైతే 'ఇదీ నీ సత్తా. ఇన్నాళ్ళూ నువ్వే పక్కనున్నావ్' అని మెచ్చుకుని భుజం తట్టారు. 'మీరు నిలబెట్టినందుకు నేను మీ పరువు నిలబెట్టాను' అన్నా. ఆ సందడి సద్దుమణిగాక మళ్ళీ హైదరాబాద్ వచ్చా. తిరిగి రాగానే మళ్ళీ మోహన్‌బాబుగారి కాల్‌షీట్. అదే 'పోస్ట్‌మేన్' సినిమా. నేను సెట్‌లోకి వస్తున్నానని తెలియగానే 'కోట శ్రీనివాసరావుని ఘనంగా ఆహ్వానించాలిరా..' అని యూనిట్‌తో చెప్పారట మోహన్‌బాబు గారు. మంచి గంధం దండలు, ఫ్లవర్ బొకేలు అన్నీ పట్టుకుని 'కంగ్రాట్యులేషన్స్ శ్రీనివాసరావు, నీ నమ్మకం నిజమైంది. గెలిచావు, అయామ్ సో హ్యాపీ..' అని నన్ను కౌగలించుకుని అభినందనలు తెలియజేశారు మోహన్‌బాబుగారు. 'మరి మొన్న అలా అన్నారేంటి సార్..' అని అడుగుదామనుకున్నా.




## ఎవరూ ఊహించలేదు

సౌందర్య చాలా గొప్పనటి. ఎప్పుడు కనిపించినా కాళ్లకు నమస్కారం చేసేది. ఆ అమ్మాయికి నా నటనంటే చాలా ఇష్టం. 'మీలాంటి వాళ్ళను చూసి నేను నేర్చుకోవాలండీ' అని చాలాసార్లు అనేది. గొప్పనటి అలా మధ్యలో పోతుందని ఎవరూ ఊహించలేదు. చాలా దారుణం.



కానీ ఇంత ఘనంగా నన్ను సత్కరించి, నా విజయం చూసి అంతగా మురిసిపోయారంటే ఆ రోజు నాతో తమాషాకి అని ఉంటారులే అనిపించి ఊరుకున్నా. ఆ రోజు మొత్తం మోహన్‌బాబుగారు నాతోనే ఉన్నారు. 'మొత్తానికి గెలిచావయ్యా నువ్వు.. భలే చోట గెలిచావు.. భలే భలే.. మొత్తం కాంగ్రెస్ సీట్ అది. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఫస్ట్‌టైమ్ కాంగ్రెసేతర పార్టీ ఎమ్మెల్యేగా గెలవడం..' అని భుజంతట్టి చాలా ఆనందించారు.

### యువతరమే నా ఓటర్లు

నేను ఆ నియోజకవర్గంలో గెలుపొందడానికి కారణాలు ఏమిటా? అని తర్వాత అన్వేషించుకుంటే కొన్ని అంశాలు తట్టాయి. అవేంటంటే అప్పుడు తెలుగుదేశం, బీజేపీ మధ్య అలయెన్స్ ఉండటం, వాజ్‌పేయి గారికి చాలా మంచి పేరు ఉండటం. వాజ్‌పేయి గారి ప్రభంజనం నాకు చాలా ఉపయోగపడటం, దానికి తోడు నా సినిమా గ్లామర్, నేనుపడ్డ కష్టం, నా కుటుంబంపడ్డ కష్టం నన్ను గెలిపించాయి.

ఇరవైఏళ్ళ క్రితం సినిమా గ్లామర్ వేరండీ. ఇప్పుడు రోడ్డమీద షూటింగ్‌ల వల్ల, ప్రతి ఛానెల్ లోనూ, ప్రతి ఇంట్లోనూ ఇంటర్నెట్‌ల రూపంలోనూ సినిమా విపరీతంగా కనిపిస్తుండటంవల్ల కాస్త క్రేజ్ తగ్గిందికానీ అప్పుడు వేరుగా ఉండేది.

అన్నిటికీ మించి అందరూ ఊహించింది ఏంటంటే విజయవాడలో సత్యనారాయణపురం అని ఒక పేట ఉంది. అక్కడ బ్రాహ్మణులు ఎక్కువగా ఉంటారు. నేను బ్రాహ్మణుణ్ణి కాబట్టి వాళ్ళందరూ నాకే ఓట్లు వేస్తారని అందరి నమ్మకం. నాకు ఆ సీటు ఇవ్వడానికి కారణం కూడా అది బ్రాహ్మణుల సీటు అనే. నేను బ్రాహ్మణ్ణి కాబట్టి, వారి ఓట్లు నాకు ఉంటాయనే. సినిమా గ్లామర్‌కి తోడు సామాజిక వర్గం సపోర్ట్ కూడా ఉంటుందని అంతా అనుకున్నారు. కానీ నిజం చెబుతున్నా. నాకు బ్రాహ్మణులు అందరూ ఓట్లు వేసి ఉంటే పాతికవేల ఓట్ల మెజారిటీ రావాల్సింది. అంత రాలేదుగా.. అంటే నాకు వచ్చిన ప్రతి ఓటూ నా కష్టార్జితమే. నా సామాజిక వర్గాన్ని చూసి ఎవరూ నాకు ఓటు వేయలేదు. ఎందుకు చెప్తున్నానంటే.. అది కాంగ్రెస్ సీటు. నలభై ఏళ్ళు వయసు దాటిన ఓటర్లు ఎవరైనాసరే కాంగ్రెస్‌కి తప్ప, ఇంకోపార్టీవాళ్ళకి ఓటు వేయరు. దానికితోడు అంతకుముందు చేసిన ఎమ్మెల్యేలు అంతో కొంతో బాగానే సేవలు చేశారు. దానివల్ల వాళ్ళమీద జనాలకు ఇంకా గట్టిగానే నమ్మకం ఉండేది. అందువల్ల నన్ను ప్రోత్సహించలేదు. నాకు ఓట్లు వేసింది ఎవరయ్యా అంటే 30 – 35 ఏళ్ళలోపు వయసువారే. వాళ్ళందరూ ఓట్లు వేయడంవల్లనే నాకు గెలుపు సాధ్యమైంది.

### నా ఎన్నికల ఖర్చు అక్షరాలా పదకొండు లక్షలు!

పైగా ఈ ఎన్నికల్లో గెలిచేందుకు నేనేమైనా డబ్బులు వెదజల్లానా? అంటే అదీ లేదు. నేను ఎం.ఎల్.ఏగా పోటీ చేసినప్పుడు నేను పెట్టిన ఖర్చు అక్షరాలా పదకొండులక్షల రూపాయలే. అదే నాతో పాటు పోటీ చేసిన వారు చాలా పెద్ద మొత్తాలు పెట్టారని అంతా చెప్పుకున్నారు. సరే.. ప్రచారం, గెలవడం ఇదంతా ఒక ఎత్తు. ఎమ్మెల్యేగా అసెంబ్లీలో అడుగుపెట్టాక మరో ఎత్తు...

### పాతిక వేలు.. సేవలకే!

గెలిచాక నేను విజయవాడలో ఆఫీస్ పెట్టాను. ఆఫీస్‌ముందు ఓ బోర్డు పెట్టా. విద్య, వైద్యం, రహదారులు, కరెంటు, నీరు... ఇలాంటి నిత్యావసరాల జాబితా 12 రాసి.. 'వీటి నిమిత్తం ఎవరైనా సరే.. ఈ కార్యాలయం తలుపులు తట్టొచ్చు. 24 గంటలూ నేను అందుబాటులో ఉంటాను' అని ఆ బోర్డులో రాయించా. 'మిగిలిన వాటికి నేను అందుబాటులో ఉండను.. దయచేసి నన్ను సంప్రదించకండి' అనే వాక్యం కూడా జోడించాను. అప్పట్లో ఆఫీస్ మెయింటెనెన్స్ అని, నా జీతం అనీ.. ఏదైనా మొత్తానికి 25 వేల రూపాయలు దాకా వచ్చేవి. నేనేమో బీజేపీ కార్యాలయంలోనే నా ఆఫీసు పెట్టుకున్నా. దాంతో నాకు అద్దె ఖర్చులు మిగిలేవి. ఆ డబ్బును కుల మత భేదాలు చూడకుండా పేద విద్యార్థులకు ఇచ్చేవాణ్ణి. నా కళ్ళముందు కనిపిస్తూ ఇబ్బందులు పడే వారికే సాయం చేసేవాణ్ణి. అదీ నగదురూపంలో కాదు.. వాళ్ళు చదివే స్కూలు గురించి తెలుసుకుని, హెడ్మాస్టర్‌తో ఫోనులో మాట్లాడి ఆ ఏడాదికి ఫీజులు కట్టి, పుస్తకాలు కొనిచ్చేవాణ్ణి. ఇన్ని చేసినాగానీ, నాకు ఆత్మసంతృప్తినిచ్చింది మాత్రం ఒకే ఒక్క పని. అదేమిటంటే...

**(ఇంకా ఉంది)**

**–డా.చల్లా భాగ్యలక్ష్మి**

**సెల్: 88850 55528**




**“నెత్తిమీద పుండు నయం కావాలంటే గుండు చేయించుకోవాల్సిందే!” కరాఖండిగా చెప్పాడు డాక్టర్ పిపీలకం.**

**“ఒప్పుకోను గాక ఒప్పుకోను” అంతకంటే గట్టిగా అన్నాడు జజ్జు.**

**నవనాగరీకంగా పోషిస్తున్న జుట్టు మరి!**

**వంశపారంపర్యమైన బట్టతల అనే పెనుతుఫానులో తలమునకలు కాకముందే గంగ తనది కావాలి! మనసులో గంగవెర్రులెత్తుతున్న కోరికని ఓరోజు బయటికి పొంగనిచ్చాడు. గంగా నువ్వే నా ప్రాణం అని జుట్టుమీద ఒట్టుబెట్టి చెప్పాడు.**

# శూన్యోశూన్యతి శూన్యః

“ఓరి జుట్టు పోలిగాడా మా అమ్మాయిగోరి జోలికి వచ్చావంటే నీ ఒంటిమీద వెంట్రుకన్న మాట లేకుండా పీకి పడేస్తా”అని కూత గీత గీశాడు గంగ అంగరక్షకుడు గండభేరుండం. గీతదాటితే అగ్నిగుండంలో మిడత బతుకే తనది!

అయినా రోజుకోసారైనా గంగను చూడాలి. చూస్తున్నట్లు ఎవరూ చూడకుండా చూడాలి. గంగ ఉండే మేడ పక్కన ఖాళీ స్థలంలో పెరిగిన చెట్లకొమ్మల్లో పుల్లా పుడక ముక్కునకరిచి గూడు కట్టుకున్నాడు గుట్టుగా!

గోరు చుట్టుమీద రోకటిపోటులా వచ్చి పడింది శిరోవేదన!

***

“మీరేం చేస్తారో నాకు తెలియదు. అబ్బాయి నామాట వినకపోతే వైద్యం చేయడం నావల్ల కాదు. రేప్పొద్దున తలపుండు మెదడులోకి దూరితే తలకొరివే మందవుతుంది” డాక్టరు చెప్పాడు జజ్జు మేనమామతో.

మేలుకుని ఉంటే అయ్యేపనికాదని, గాఢనిద్రలో ఉన్న జజ్జు జుట్టుని కూకటివేళ్లతో కోసి పడేశాడు మేనమామ! గదికి తాళం వేశాడు!

***

గగ్గోలుపెట్టి, గల్లంతుచేసి, చేష్టలుడిగిపడున్నాడు జజ్జు.

ఇక వైద్యం మొదలుపెట్టాలి. ఎందుకైనా మంచిది కిటికీలోంచే లేపనం పూస్తానన్నాడు డాక్టరు. ఆ ప్రక్రియా ప్రయత్న ప్రహసనంలో చేతికందిన మేనమామ చేయి కొరికి కసి తీర్చుకున్నాడు జజ్జు. కానీ, పుండు ఎంతగా పండిపోయిందో అద్దంలో చూసుకుని భయపడ్డాడు.

వైద్యానికి తల ఒగ్గాడు.

***

కనీసం అల్లంత దూరంనుంచైనా గంగను చూసే అదృష్టం కూడా లేకుండాపోయిందే అన్న దుఃఖంతో క్షణమొక యుగంలా గడుపుతున్నాడు. పరామర్శించడానికి వచ్చినవాళ్ళలో ఒకడైన పీతాగాడు తన పుండుగుండుని సెల్లులో ఫొటోతీసి గంగకు చూపించాడని తెలిసింది. తను రోడ్డెక్కితేమాత్రం పీతాగాడి కాళ్లూచేతులూ ఒకటి ఉండాల్సినచోట ఒకటి ఉంటాయన్న శపథాన్ని బయటికి వదిలాడు! జజ్జు.

***

జజ్జు కోలుకున్నాడని తెలియగానే పీతాగాడు హైదరాబాదులో మారువేషాల్లో తిరగడం మొదలుపెట్టాడు. తలపట్టిన అనారోగ్యం వదిలిపెట్టినా జుట్టు మాత్రం పెరగడానికి మారాం చేస్తున్నది. ఆ విషయంలో తానేం చేయలేనన్నాడు డాక్టరు పిపీలకం. తిరుగులేని ఊహ మెరిసి షేరాటోలో కృష్ణానగర్ వెళ్ళాడు. సినిమా మేకప్ ఆర్టిస్టులను కలిశాడు. అద్దెకు విగ్గు కావాలన్నాడు.

“నీ బోడితలకు పెట్టినవిగ్గు తిరిగి తీసుకోలేం. ఇంకెవరి నెత్తిమీదా పెట్టలేం. కావాలంటే కొనుక్కో” అన్నారు వాళ్ళు జజ్జు ఆవేశాన్ని గమనించి. విగ్గు ధరవిని జజ్జు కోడిమెడ వేశాడు. జజ్జు దిగులుని బుజ్జగించింది సవరాల శరభమ్మ. అతికొద్ది ఖర్చుతో నీ నెత్తంతా జుట్టు కనిపించేట్లు చేస్తానంది. శరభమ్మ నైపుణ్యందిద్దిన అందాల ఆనందంలో గంగను తల్చుకున్నాడు. ఇరానీ చాయ్ తాగాలనిపించింది. వెళ్లాడు.

***

తెలివితక్కువ జేబులు ఆకాశాన్ని నమిలి మింగేసే మాటలకు బలౌతున్నాయక్కడ, ఏ పక్క ఏం జరుగుతున్నదో ఎవరికీ పట్టింపులేకుండా. అక్కడో సిక్కులబ్బాయి ఎంతో ఏకాగ్రతతో పేపరు చదువుతున్నాడు. అతను చదివేది పేపరుకాదు ఫొటో చూస్తున్నాడనీ, ఆ ఫొటో గంగ అనీ తెలుసుకోడానికి ఎంతోసేపు పట్టలేదు. టోపీ, నల్లకళ్లద్దాలతోఉన్న తనని పీతాగాడు గుర్తుపట్టలేదు. “ఎవరా అమ్మాయి ఫొటో బాగుందే” అన్నాడు గొంతు మార్చి.

“ఆమె నా కలలరాణి. నేను ఆమె కలలరాజునెలా కావాలా? అని చూస్తున్నా” ఇంకో క్షణం ఆలస్యం చేయకుండా పక్కనున్న సెలూన్లో ఓ కత్తి తీసుకొచ్చి పీతాగాడి మెడవంచి ఒడిసిపట్టి, వేషం పీకి గుండుగీకి ఆటోఎక్కి ఎటో వెళ్ళాడు జజ్జూ. సమయానికి అక్కడే ఉన్న శరభమ్మ, రాలిపడ్డ జులపాలజుట్టుని ఆనందంగా సంచీలో వేసుకుంది. జజ్జూ పగ ఎందుకో తెలిసిన పీతా కళ్ళల్లోకి నీటిబొట్లు రాలిపడుతున్నాయి. శరభమ్మ, పీతాగుండుమీద చేయి నిమిరి, కంటి తడిని పొడిగా మార్చింది.

***

ఎన్నాళ్ళుగానో అలవాటుపడ్డ దినచర్య ఎంతో కాలం తర్వాత మళ్ళీ మొదలైంది. గంగ మేడపక్కన తన ప్రియమైన చెట్లని పలకరించాడు! తన పీఠంలో ఓ ఏకాకి కాకి ఇల్లు కట్టుకుంది. గుడ్డుతోసహా ఇల్లు పీకి ఓ పందిరి మీద పెట్టాడు.

కాకి తన్నులకన్నా కాకికేకలు తన ఉనికిని బట్టబయలు చేస్తాయేమోనని భయపడ్డాడు. కాకికాళ్లు చచ్చుపడిందాకా ఓపికపట్టాడు. ఓపిక తన ప్రేమకు జ్ఞాపిక అనుకున్నాడు. పావురాలకు, చిలకలకు తప్పితే ప్రేమపాట్లు కాకికేం తెలుసు!

తలస్నానంచేసి కురులు ఆరబెట్టుకోడానికి గంగ మేడమీదకు వచ్చింది. తన అదృష్టానికి తానే మురిసిపోయాడు. గంగ గానగంగలో ఓలలాడుతూ చెవుతీగలతో విహరిస్తున్నది. ఆ అడుగుల అందాల్ని మనసులో నింపుకుంటున్నాడు. మూర్ఖుడికికూడా ఓ లిప్తపాటు మెదడులో లోపం కనిపిస్తుందేమో! ఓ నిర్లిప్తభావం తన స్థాయిని తన కళ్ళముందు కదిలించింది. అదేదో తనవృత్తికి తానే అన్యాయం చేస్తున్నాడేమో అనుకుని తలగోక్కున్నాడు. కిందపడబోయిన టోపీ సరిచేసుకున్నాడు. నల్లద్దాల కళ్ళజోడు తుడిచిపెట్టుకున్నాడు. ఆ ఆనందవీక్షణం ఎంతోసేపు నిలవలేదు. గంగ మేడ దిగుతున్నది. గంగకురులను అంత తొందరగా ఆరబెట్టిన గాలిని తిట్టుకున్నాడు!

ఇవ్వాల్టికిదిచాలు అని చెట్టు దిగబోతుంటే తనలాంటి జుట్టు టోపీ, నల్లకళ్ళద్దాలతో ఇంకో ఆకారం ఎక్కుతూ కనిపించింది. పీతాగాడు! గొడవపడితే ఇద్దరికీ ముప్పే! స్నేహమే శరణ్యం!

ఇద్దరి కదలికలు ఒకటయ్యాయి!

“అరేయ్. నా చెట్టునెలా పట్టుకున్నావురా”

“ప్రేమబాటలో నీ అడుగులలో నా అడుగులు

**గంగకోసం నానాతంటాలూ పడుతున్నాడు జజ్జు. అతనిబాటే పట్టాడు పీతారావు. ఆమెను ఎలాగైనా బుట్టలో వేసుకోవాల్సిందే . అదే వారి తాపత్రయం. కానీ వాళ్ళ ప్రయత్నాలకు గండభేరుండం అడ్డం పడుతున్నాడు. అతగాడెవరంటే, అమ్మాయిగారి అంగరక్షకుడు మరి! ఇంతకీ జజ్జు, పీతారావు ఇద్దరూ ఎలాంటివాళ్ళు? నిజమైన ప్రేమికులేనా? వాళ్ళగురించి గంగ ఏమనుకుంటోంది?**

వేశానంతే! అప్పటినుంచి నువ్వొచ్చి వెళ్ళిన తర్వాత నేనొచ్చి కూర్చుంటున్నా".

"ఇప్పుడెందుకు టైం తప్పావు"

"ఇవ్వాళ నాకో సంగతి తెలిసింది"

"ఏవిట్రా అది. తొందరగాచెప్పు".

గంగ ఆకాశంలోకి ఎగురుతున్నది" చెప్పాడు పీతా.

"అరేయ్. పీతా! భగీరథుడు గుండె పగులుతాడేమోరా"అన్నాడు జజ్జు.

"కాదురా మీగుండ్లు..." శూన్యం శబ్దం చేసింది!

ఒకరినొకరు చూసుకున్నారు.

మాటల వినికిడేగానీ మనిషి అలికిడి కనిపించడం లేదు.

ఏదో ప్రమాద హెచ్చరికతో శరీరంలో ఎక్కడెక్కడి నరాలో వామ్మోవాయ్యో అని కచేరీ చేస్తున్నాయి! ఇదిలా ఉంటే నాగస్వరం వినిపించింది.

"ఎవడో నాగుపాముని వదిలిపెడుతున్నట్లున్నాడు రో!"

"పాముకాదురా, పిరికి పందల్లారా అది నా సెల్ రింగ్‌టోన్" ఆ గంభీరనాదం గండభేరుండానిదే!

"ఆంజనేయస్వామి రామలక్ష్మణులను భుజం మీద కూర్చోబెట్టుకున్నట్లు ఎత్తుకుంటాడేమోరా" అన్నాడు పీతా.

"మీకు ఆ దశ ఎక్కడిదిరా! శివమణిచేతుల్లో డ్రమ్ స్టిక్కుల్లా ఆడుకుంటానురా. అరేయ్! మిమ్మల్ని పట్టి, వలలో పెట్టి, చెట్టుకి కట్టి తేనెతుట్టెని కదిలిస్తా. ఆ సినిమా ఊహించుకోండి" గర్జించాడు గండభేరుండం.

"దేశ సరిహద్దుల్లో పడుండాల్సిన వాడివి మా గంగ ఒంటికాపలాకు ఎలా కుదిరావురా, బండ గుండెండం!" అన్నాడు పీతా.

మా అంటారా, అని గండభేరుండం చేతులు ఇద్దరి తలల మీదపడ్డాయి. టోపీల్నీ, జుట్టునీ, కళ్ళద్దాల్నీ పీకిపడేశాయి!

"ఇప్పుడు రెండుగుండ్లు ఒకదానికొకటి కొట్టుకుంటూ లయవిన్యాసం చేస్తాయి. చెవులారా వినండ్రా" అన్నాడు గండభేరుండం.

జజ్జూ మూగబోయి తప్పించుకునే మార్గాన్నే వెతుకుతున్నాడు.

"వినడానికి మాకు చెవులెక్కడ ఉండనిస్తావురా. యమగండ భేరుండంగా" అన్నాడు పీతా.

మాటలైపోయాయి, ఇక ఆటలే అంటూ ఇద్దర్నీ తలకిందులుచేసి పట్టుకోబోయాడు గండభేరుండం. ఎలాగోలా తప్పించుకుని కిందకి దూకి కాలిబూట్లసంగతి మరచిపోయి పరుగుపందెం మొదలుపెట్టారు. పరుగులపోటీ తేనెటీగలతో అవుతుందనుకోలేదు! ముళ్ళదుప్పటి కప్పుకున్నట్లుగా అయింది ఒళ్ళు. కాళ్లకింద గుచ్చుకుంటున్నది శిలలో సూదులో స్పర్శలో లేదు!

పడుతూలేస్తూ వేగాన్ని కూడబెట్టుకుంటున్నారు. దేహాన్ని వదిలి ఆత్మ ఉరుకుతున్నట్టుగా ఉంది. ఓ అయిటం సాంగ్ పెద్దగా వినడానికి అదే సరైన సమయం అనుకున్నాడు గండభేరుండం.

గండభేరుండం నవ్వే! వాళ్ళగుండెలలో గునపాలు పొంగిస్తోంది!

***

ఇద్దరి ఒంటినిండా సందులేకుండా, నాటుకున్న తేనెటీగల ముళ్ళను ఒక్కొక్కటీ తీసిచూపిస్తూ గాజు బుడ్డీలో పడేస్తున్నాడు డాక్టరు పిపీలకం. నొప్పి తట్టుకోవాలని బిగపట్టిన పళ్ల పట్టు తప్పుతున్నాయిద్దరికీ.



"ఒకసారి మీ రూపలావణ్యాన్ని నిలువుటద్దంలో తిలకించి పులకించి పోతారా" అడిగాడు డాక్టరు, చవటకు వెధవ తోడయ్యాడు అని మనసులో అనుకుంటూ.

"ఆ పని చేయకండి బాబో" అని మూలిగారిద్దరూ.

"అదృష్టవంతులు కాబట్టి ప్రాణాలతో బతికి బయటపడ్డారు" అన్నాడు డాక్టరు పిపీలకం. ఉపశమనవాక్యంగా.

"డాక్టరు గారో! మీకు రెండు ఫీజులిస్తాం. ఒకటి చికిత్స చేసినందుకు, ఇంకోటి ఈ సంగతి ఇంకెవరికీ చెప్పకుండా ఉండేందుకు" అన్నారు ఏకకంఠంతో.

"ఆ ఇంకోటేదో నాకు దక్కేట్లు లేదు. మీ మనసుల్లో ఎవరికైతే తెలియకూడదని అనుకుంటున్నారో ఆ గంగే మిమ్మల్ని చూడడానికి వస్తున్నానని ఫోన్ చేసింది, వెంట గండభేరుండంతో" చెప్పాడు డాక్టరు.

***

"పిపీలకమంకుల్ ! మీరు చెప్పిన రెండు బెడ్సూ ఖాళీగా ఉన్నాయి. మా సీనియర్స్ ఎక్కడున్నారంకుల్" అడిగింది గంగ. గండభేరుండం కళ్ళు చుట్టుపక్కల చూస్తున్నాయి.

"ఇంకెక్కడమ్మా, కిటికీలోంచిదూకి పరిగెడుతున్నారు. చూడు. ఒలింపిక్స్‌కి పంపిస్తే దేశానికి రెండు మెడల్స్ వస్తాయేమో" అన్నాడు డాక్టరు.

"ఇటువంటివాళ్ళు పతకాలుతెస్తే దేశమాత బాధపడుతుంది సార్" అన్నాడు గండభేరుండం.

"పెద్ద చదువుకోసం విమానం ఎక్కబోతున్నావు. వాళ్ళు నీకు సీనియర్సేంటమ్మా"

"కాలేజీలో సీనియర్సే అంకుల్. ర్యాగింగు గ్యాంగుకి వీళ్ళే నాయకులు. కేవలం దానికోసమే లక్షలుపెట్టి ఇంజనీరింగులో చేరారు. పాపం, మా బ్యాచ్‌లో నలుగురిమీద ఎర్రచీమల్ని వదిలిపెట్టారు. పర్మినెంటుగా డిబారయ్యారు".

లీలగా కనిపిస్తున్న ఆకారాల్ని చూస్తూ, క్షణంలో అంతదూరం ఎలా వెళ్ళారా అని ఆలోచిస్తూ అంది గంగ.

"వీళ్ళమీద జాలిపడి ఎందుకొచ్చావమ్మా" అన్నాడు డాక్టరు.

"గొంతులు కోసేవాళ్ళు, యాసిడ్లు పోసేవాళ్ళకన్నా వీళ్ళు నయమనిపించారు" అంది గంగ వేదన నిండిన స్వరంతో.

"వీళ్ళల్లో మార్పు వస్తుందంటావా" అడిగాడు డాక్టరు.

"రాకపోతే, నేనున్నాగా సార్" అన్నాడు గండభేరుండం.







# మగవారు Vs ఆడవారు

**ఆడవాళ్ల విషయంలో మగవాళ్ల విషయంలో చాలా భేదాలున్నాయి... మగవాళ్లకి ఆడవాళ్ల గురించి తెలుసుకోవాలనే కోరిక, ఆడవాళ్లకి మగవాళ్ల గురించి తెలుసుకోవాలనే కోరిక కలగడం చాలా సహజం. అందుకోసమే అసలు మగవారు ఎలా ఉంటారు? వారి ఆలోచనా విధానం ఎలా ఉంటుంది, వారు దేనికోసం ఎంత సమయం కేటాయిస్తారు? ఆడవాళ్లు తమ సమయాన్ని ఎలా కేటాయిస్తారు? వంటి కొన్ని ఇంట్రెస్టింగ్ ఫ్యాక్ట్స్ కింద ఇస్తున్నాం. మీరూ చదివేసేయండి.**

**ఇవి చదవడానికి చాలా ఫన్నీగా అనిపించినా ఇవన్నీ కేవలం మన దేశమే కాదు, ప్రపంచంలోని అన్ని దేశాలవారి మీద చేసిన అనేక రకాల అధ్యయనాల ద్వారా తెలిసిన సంగతులే.**

### అబ్బాయిల గురించి

సాధారణంగా అబ్బాయిలకు ఎలాంటి బలహీనతలూ ఉండవు అంటారుగానీ అబ్బాయిలకు కూడా కొన్ని బలహీనతలు ఉన్నాయి. అవి వింటే మీకు నవ్వు రావడం ఖాయం! మరింకెందుకు ఆలస్యం ఈ కింద ఇచ్చిన పాయింట్స్‌పై ఓ లుక్కేయండి..!!

మగవారు మంచివారా కాదా అనేది పరీక్షించాలంటే వారి ఐక్యూని టెస్ట్ చేయమంటున్నాయి కొన్ని అధ్యయనాలు. ఎక్కువ ఐక్యూ ఉన్నవారు నమ్మదగిన వ్యక్తులయితే, ఐక్యూ తక్కువగా ఉన్నవారు అంతగా నమ్మకస్థులు కాదట.

హత్యలకు గురవుతున్న ఆడవారిలో సగంమంది తమ జీవితభాగస్వామి లేదా మాజీభర్త చేతుల్లో హతులవుతున్నవారే!

మగవారు సగటున రోజుకి ఆరుసార్లు అబద్ధాలు చెబితే, ఆడవారు రోజుకు మూడుసార్లు మాత్రమే అబద్ధాలు చెబుతారు.

ల్యాప్‌టాప్ ఒళ్లో పెట్టుకుని పని చేస్తున్నప్పుడు అది వేడిగా ఉంటే దాన్ని పక్కన పెట్టడం మంచిదంటున్నారు పరిశోధకులు. ఈ పరిస్థితి మగవారిలో సంతానలేమికి కారణం కావచ్చునట.

తలని పూర్తిగా షేవ్ చేసుకుని ఎప్పుడూ గుండుతో కనిపించే మగవారు జుట్టుతో ఉన్నవారికంటే 13శాతం ఎక్కువ శక్తిమంతులుగానూ, ఒక అంగుళం ఎక్కువ పొడవున్న వారిగానూ కనబడతారు.

అందమైన భార్య ఉన్న మగవారికి మిగిలినవారికంటే జీవితం మరింత సంతృప్తికరంగా ఉన్నట్టు అనిపిస్తుందట.

ఆడవారు నిమిషానికి 19సార్లు కళ్ళు ఆర్పితే, మగవారు 13 సార్లు మాత్రమే కళ్ళు ఆర్పుతారు.

మొట్టమొదట హైహీల్స్‌ని వాడింది మగవారే. పదిహేడో శతాబ్దంలోనే మగవారు వాటిని వాడగా, మగవారిలా కనిపించాలనే ఉద్దేశంతో ఆడవాళ్లు తరువాత కాలంలో వీటిని ధరించడం ప్రారంభించారు.

సగటు మహిళకంటే సగటు పురుషుడు నాలుగు నుండి ఐదు అంగుళాల అదనపు పొడవు ఉంటాడు.

ఇటలీలో 30–35 సంవత్సరాల మధ్య వయసుండి, సింగిల్‌గా ఉంటున్న మగవారిలో మూడోవంతుమంది వారి తల్లిదండ్రులతో కలిసి జీవిస్తున్నారు.

చైనాలో 2020నాటికి మూడునుండి నాలుగుకోట్ల మంది మగవారికి పెళ్ళాడేందుకు అమ్మాయిలు దొరకని పరిస్థితి వస్తుంది.

తన భార్యతో లేదా గర్ల్ ఫ్రెండ్‌తో నడుస్తున్నప్పుడు మగవాడు తన మామూలు నడక స్థాయిని ఏడుశాతం తగ్గించి నిదానంగా నడుస్తాడు.

మగవారి మెదడు ఏకకాలంలో కుడిఎడమల్లో ఒక వైపు మాత్రమే పనిచేస్తుంది. అదే ఆడవారి మెదడు ఏకకాలంలో రెండువైపులా పనిచేస్తుంది. అందుకే మగవారు ఒక సమయంలో ఒకపనిని మాత్రమే చేస్తే, ఆడవారు మల్టీ టాస్కింగ్ చేయగలుగుతారు.

అమెరికాలో ఏటా 450మంది మగవారు రొమ్ము కేన్సర్‌తో మరణిస్తున్నారు.

మగవారు ఆడవారికంటే త్వరగా ఐ లవ్ యూ చెబుతారు. ప్రేమ విషయంలో కూడా అబ్బాయిలే వీక్ అని తేలింది. ఎందుకంటే ప్రేమను వ్యక్తపరచడంలో అబ్బాయిలే ముందుంటారట.

అబ్బాయిలు సాధారణంగా భయపడరనుకుంటారు గానీ వాస్తవానికి ఉరుములు, మెరుపులు వచ్చినప్పుడు అమ్మాయిలకంటే అబ్బాయిలే ఎక్కువ భయపడతారట.

ఆడవాళ్ళకంటే మగవాళ్లకే రెండురెట్లు ఎక్కువగా

చెమట పడుతుంది.

చాలాసార్లు ఆడవారు చెబుతుంటే మగవారు పట్టించు కోకుండా అక్కడినుండి వెళ్ళిపోతుంటారు. ఆడవారి నస భరించాల్సిన పనిలేదని వారి ఉద్దేశం. కానీ అసలు విషయం అదికాదని సైన్స్ చెబుతోంది. ఆడవారి గొంతులో మాటలు పలురకాల ఫ్రీక్వెన్సీలతో రావడం వలన వాటిని అర్థం చేసుకునే శక్తి మగవారి మెదళ్లకు ఉండదట.

అమ్మాయి కనపడగానే అబ్బాయిలు అదేపనిగా చూడడం తరచు జరుగుతూనే ఉంటుంది. అందరూ అలా చేయకపోయినా నూటికి 99శాతం అబ్బాయిలు ఇలానే చేస్తారు. అబ్బాయిల జీవితంలో ఓ సంవత్సర కాలం అమ్మాయిలను చూడడానికే సరిపోతుందట.

అబద్ధాలు తక్కువగా చెబుతాం అనుకుంటారు అబ్బాయిలు. కానీ నిజానికి అబ్బాయిలు రోజుకి ఆరు సార్లు అబద్ధాలు చెబితే ఆడవారు మూడుసార్లు మాత్రమే చెబుతారట.

మగవారు తమ జీవితకాలంలో ఆరునెలల కాలాన్ని షేవింగ్ కోసం ఖర్చు చేస్తారట. అబ్బాయిలకే ఇంత ఉంటే ఇక ఆడవారి అలంకరణ లెక్కలు తేలిస్తే అదెంతుంటుందో!

### ఆడవారి గురించి

ఆడవారు ఎప్పుడు ఎలా ప్రవర్తిస్తారో అర్థంకాక ఇప్పటికీ మగమహారాజులు తలపట్టుకుకూర్చుంటూ ఉంటారు. మరి ఆడవారి విషయంలో బలాలు, బలహీనతలు ఎలా ఉన్నాయో మీరే చదవండి!

ఉదయం నిద్రలేవాల్సిన సమయం కంటే పది నిమిషాల ముందుగానే అలారం సెట్ చేసుకుంటారు. అలారం మోగిన వెంటనే లేవకుండా పది నిమిషాలు బద్ధకించినా ఇబ్బంది ఉండదనే ఉద్దేశంతోనే ఇలా చేస్తారు.

మొబైల్ ఫోన్ చాలా సౌకర్యంగా హ్యాండ్‌బ్యాగ్‌లోకి తోసేస్తారు. కాల్ వచ్చిన తర్వాత ఫోన్ మోగుతున్నంత సేపూ దానిని వెతకడానికే టైమ్ సరిపోతుంది.

ముఖ్యమైన వస్తువులు జాగ్రత్తగా దాస్తారు. కానీ ఆ దాచింది ఎక్కడో మరచిపోతారు. అవసరమైనప్పుడు గుర్తు తెచ్చుకోవడం వారికి పెద్ద పని.

అద్దంలో చూసుకున్న చాలా సందర్భాల్లో ఇలా ఒక ఫొటో తీసుకుంటే బావుణ్ణు అనుకుంటారు. గంటలు గంటలు అద్దం ముందు కూర్చుని ఇలా తయారైతే బాగుంటుంది అనుకుంటుంటారు.

ఎంత హడావుడిలో ఉన్నా ఇంటికి తాళం వేయడం మర్చిపోరు. తాళం వేసి బ్యాగ్‌లో వేసుకున్న రెండునిమిషాల్లోనే తాళాన్ని బ్యాగ్‌లో వేశానా లేదా అని ఓసారి చెక్ చేసుకుంటారు.



బాత్‌రూమ్‌లో షాంపూ, సబ్బులు రెండు రకాలైనా లేకపోతే శాటిస్‌ఫాక్షన్ ఉండదు.

అద్దంముందు ఎంతసేపు నిలబడి తయారైనా సరే బయటకు వెళ్ళేముందు మరోసారి తమను తాము అద్దంలో చూసుకోవడం మర్చిపోరు.

వార్డ్‌రోబ్ తెరిచి చూస్తే ఎదురుగా బోలెడు దుస్తులు కుక్కి కుక్కి ఉంటాయట. అన్నీ అలా కుప్పలుగా ఉండేసరికి సరైన దుస్తులు ఏవీ లేవని వాపోతుంటారు.

కొత్త ప్రదేశానికి అడ్రస్ వెతుకుతూ వెళ్ళినప్పుడు ఏదైనా కనిపిస్తే మలుపుదారుల్లో ముందుకెళ్ళరు. అలాగే ప్రయాణ దూరం తగ్గుతుంది కదాని అడ్డదారుల్లో ప్రయాణించడానికి ఇష్టపడరు. దారి పొరబడతామేమోనన్న భయంతో దూరమైనా సరే ప్రధాన రహదారుల్లో ప్రయాణించడానికే ఇష్టపడతారు.

కుటుంబానికి సంబంధించిన క్లిష్టమైన సమస్యలు ఎదుర్కోవడానికి మగవాళ్లు వెనుకడుగువేసి పారిపోవడానికి సిద్ధమైన సందర్భాల్లో మహిళలు ధైర్యంగా దాన్ని పరిష్కరించే వరకు నిలబడగలుగుతారు. కానీ చిన్న కీటకాలు, ఎలుకలు వంటివి కనిపించినా, ఒంటికి తగిలినా విపరీతంగా భయపడతారు.

మూడురోజుల పర్యటనకు కనీసం ఏడుజతలైనా సర్దుతారు. అత్యవసరానికి ఒక జత ఎక్కువ పెట్టుకోవడం ఒక పద్ధతి. మిగిలిన మూడు జతలూ ఎప్పుడు ఏవి వేసుకోవాలనిపిస్తున్నాయో లేదోనన్న బెంగతోనే వెంట తీసుకెళతారు!

మహిళలు పురుషులకంటే ఎక్కువ జ్ఞాపకశక్తి కలిగి ఉంటారు. బ్రిటీష్, ఇటాలియన్ శాస్త్రవేత్తలు నిర్వహించిన సర్వేలో ఇది నిజమని తేలింది. వందమంది మహిళలు, మగవారిపై నిర్వహించిన పరీక్షల్లో మహిళలకే జ్ఞాపకశక్తి ఎక్కువని వెల్లడైంది. ఆడవాళ్లు మగవారితో సమానంగా ఉద్యోగాలు చేస్తున్నా ఇంటి వ్యవహారాలు ఇతర విషయాలు గుర్తుంచుకోవడంలో ఫస్ట్ ఉంటున్నారని సర్వే చెబుతోంది.

క్లాసులో ఫస్ట్‌ర్యాంక్ ఎప్పుడూ అమ్మాయిలకే. ఫైనల్ ఎగ్జామ్స్‌లో కూడా రిజల్ట్ పర్సెంట్‌లో అబ్బాయిలకు, అమ్మాయిలకు భారీ తేడా ఉంటుంది. ఆలా అని సినిమాలు, షికార్లు, ఫ్రెండ్స్‌తో బాతాఖానీ వంటి ప్రోగ్రామ్స్‌కి అమ్మాయిలు దూరంగా ఏం ఉండరు.

లెక్కలు, సైన్స్ వంటి సబ్జెక్ట్స్‌లో అబ్బాయిల కంటే అమ్మాయిలే బెటరట. సమస్యలను ఛేదించడంలో, అందమైన సైన్స్ బొమ్మలు గీయడంలో కూడా వీరే సిద్ధహస్తులు.

మొబైల్స్‌లో, కంప్యూటర్స్‌లో మైండ్ గేమ్స్, త్రీడీ గేమ్స్, క్యూబిక్ గేమ్స్ అమ్మాయిలు ఈజీగా ఆడేస్తారు. ఇటు మైదానంలోనూ ఆట గురించి, ఆటపట్టించే వారి గురించి ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు. అదే అబ్బాయిలయితే ఒక గేమ్‌లో లెవల్ పెరుగుతూ పోతున్నకొద్దీ ఆట కష్టంగా అనిపిస్తే మళ్ళీ న్యూగేమ్ స్టార్ట్ చేసేస్తారట. ఛాలెంజ్ తీసుకోవడం అంటే అబ్బాయిలకన్నా అమ్మాయిలకే ఎక్కువ ఇష్టం.

ఉద్యోగం పురుషలక్షణం అన్నారు పెద్దలు. కానీ నేటితరం మహిళలు మాత్రం ఏ మేం చేయకూడదా అన్నట్టు అన్ని ఉద్యోగాలు చేసేస్తున్నారు. ఇంట ర్వ్యూలను పురుషుల కంటే ఈజీగా మేనేజ్ చేసి ఠక్కున జాబ్ పట్టేస్తున్నారు.



**మగవాళ్ళ గురించి ఆడవాళ్ళు, ఆడవాళ్ళ గురించి మగవాళ్ళు తెలుసుకోవాలని తహతహలాడటం సహజం. ఇద్దరిలోనూ భిన్నమైన అలవాట్లు ఉంటాయి. చాలా విషయాల్లో అమ్మాయిలు స్ట్రాంగ్‌గా ఆలోచిస్తారు. ఒకేసారి మల్టీటాస్క్‌లు చేయగలుగుతారు. మరి మగవారిలో చాలా బలహీనతలు ఉంటాయి. లవ్‌లో కూడా వాళ్ళు వీక్. ఆడవారు-మగవారు మధ్య ఆ తేడాలేంటో, వారి సామర్థ్య విలక్షణాలేమిటో తెలుసుకోండి.**

కార్నెగీ మెల్లన్ అనే అమెరికన్ యూనివర్సిటీ సర్వే ప్రకారం 77 శాతం రోడ్డు ప్రమాదాలు పురుషుల వల్లనే జరుగుతున్నాయి. ఆడవారు డ్రైవింగ్ చేసే విషయంలో చాలా జాగ్రత్తగా, దృష్టి మొత్తం డ్రైవింగ్ మీదే పెడతారు. అందుకే వారి డ్రైవింగ్ ప్రమాదరహితం.

ఆఫీస్‌లో బాస్ లేడీ అయితే... అందరినీ పనిలో పెట్టడంలో సక్సెస్ అవుతుంది. టీమ్‌లోని సభ్యుల ఎమోషన్స్‌కు అనుగుణంగా నిర్ణయాలు తీసుకుని కోఆర్డినేట్ చేస్తుంది. నవ్వుతోనే సమస్యను పరిష్కరించగలిగే శక్తి లేడీబాస్‌కు ఉంటుంది. ఈ విషయంలో మగబాస్‌లు ఫెయిల్ అయిన కేసులు చాలానే ఉన్నాయట.

మగవారి కంటే ఆడవారిలో రోగనిరోధక శక్తి ఎక్కువగా ఉంటుంది. ఇన్ఫెక్షన్లు రాకుండా అడ్డుకునే శక్తి వారికి పుట్టుకతోనే వస్తుంది. వారి శరీర నిర్మాణం పునరుత్పత్తికి అనుగుణంగా నిర్మితమై ఉండడంవల్లనే వారికి రోగనిరోధక శక్తి ఎక్కువ.

ఆడవారితో షాపింగ్‌కి వెళితే అంతే సంగతులు అంటారు. కానీ షాపింగ్‌కంటూ వెళితే తోడుగా ఆడవారిని తీసుకెళ్ళాలి. ఎందుకంటే ధరల విషయంలో వారు కొసరి బేరమాడినంతగా మగవారు చెయ్యలేరు. ఏది అవసరమో వారికి పక్కాగా తెలుసు. అంతేకాదు షాపువారు చెప్పిన ధరకంటే 31శాతం తక్కువకే బేరమాడి మరీ కొంటారు. ఇంటిలెక్కల్లో అయితే వారికి నెలవారీ ప్రణాళిక ఉంటుంది. అదే పురుషులు అలా కాదు. ప్రణాళిక లేకుండానే ఖర్చు చేసేస్తారు.

**- సంతోషలక్ష్మి దహగాం**

# చరిత్రలు అడగవద్దు!

## -ముసునూరి సుబ్బయ్యచౌదరి

**చాలా రోజుల్నుంచీ నాకో అనుమానం. నా అనుమానానికి కారణం నాలో ఉన్న అసంబద్ధమైన ఆలోచనలేమోనని చాలాసార్లు అనుకున్నా. పైకి చెప్పలేకపోతున్నాను గానీ, నావి మరీ అంత అసమంజసమైన ఆలోచనలు కావేమోనని మరో అనుమానం.**

**ఈ అనుమానానికి కారణం నాలాగా ఆలోచించిన కొంతమంది కనిపించడం. ఇలా పోల్చడం తప్పేగానీ, వాళ్ళలాగే నేనుకూడా ఆలోచిస్తున్నప్పుడు, నా ఆలోచన అసంబద్ధ మెలా అవుతుంది. 'తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?' అని మహాకవి శ్రీశ్రీ అన్నారు. 'స్వేదం చిందించిన శ్రమను మేలి వస్త్రంగా మలిచారని' ఆరుద్రగారు అన్నారు. 'కండలు కరగేసి, బండలు పగలేసేమ్' అన్నాడు బంగోరె. 'సామాన్యుడి ఆలోచనలు, అక్క రలు పెనుఉద్యమాలకు మూలమవుతాయి' అని మార్క్స్ లాంటి వాళ్ళన్నారు.**

ఇలా అన్న వీళ్ళందరి జీవిత చరిత్రలు, ఆత్మకథలు మనకున్నాయి. గానీ వారన్న సామాన్యుడి జీవిత చరిత్ర గానీ, ఆత్మకథగానీ ఎక్కడాలేదు. పోనీ చదువులేని నిరక్ష రాస్యులు కాబట్టి ఆత్మకథలు రాసుకోలేరు. కానీ పెద్దలు అనుకున్న వాళ్ళలో ఒక్కరైనా జీవిత చరిత్ర రాయొచ్చు కదా! ఇది నా ఆలోచన. అది తప్పా? ఒప్పా? ఎవరిని అడగాలి? ఎవరు చెబుతారు?

ఒకవేళ నాకు తెలియకుండా అలాంటి సామాన్యుడి జీవితచరిత్ర ఎవరైనా రాశారేమోనని అన్ని గ్రంథా లయాలు చుట్టబెట్టాను. అందులో రాజకీయనాయకులు, మత ప్రవక్తలు, విప్లవకారులు, ఆధ్యాత్మికవాదుల జీవిత చరిత్రలు ఉన్నాయి. ఆఖరిగా గాడ్సే, రావణుడు, దుర్యోధ నుడు లాంటి వాళ్ళ కథలూ ఉన్నాయి. సామాన్యుడి కథ మాత్రం ఎక్కడాలేదు!

అందుకే నేను గట్టిగా ఒక నిర్ణయం తీసుకున్నాను ఎవరూ రాయని సామాన్యుడి జీవిత కథ నేను రాయాలని. అలా నిర్ణయించుకున్నాక ఎవరు సామాన్యులు? ఎవరు అసామాన్యులు అని నిర్ణయించుకోవడానికే నాలుగు రోజులు పట్టింది. చివరికి ఏ వృత్తీ నేర్చుకునే అవకాశం లేని మామూలు వ్యవసాయకూలీ కథను జీవితచరిత్రగా రాయాలని తీర్మానించుకున్నా.

నేను పట్నంలో ఉంటాను. పల్లెటూరు వెళ్ళాలంటే పది కిలోమీటర్ల దూరం. తీరా వెళ్ళినా అక్కడ అది వాళ్ళ స్థానం. ఎట్లా సహకరిస్తారో తెలియదు. ఎవరో వాళ్ళ కథ రాయడానికి వచ్చాడంటే వాళ్ళకో వింత. ఎలా స్పంది స్తారో ఏమో? పెద్దోళ్ళం మేముండగా, కూలోడి కథ రాయడానికి వచ్చావా? అని ఊళ్ళో పెద్దవాళ్ళు తన్న డానికి వస్తే... ఏదైనా ప్రాబ్లమే.

ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయం తీసుకున్నాను. బస్టాండ్‌కి వెళితే అక్కడ పల్లెటూరు వాళ్ళు చాలా మంది వస్తారు. అక్కడ కూర్చుని కాపువేస్తే నాకు కావాల్సిన మనిషి దొరుకుతాడు అని నిర్ణయించు కుని మా ఊరు బస్టాండ్‌కి చేరుకున్నా. సమయం ఏడుగంటలైంది. పల్లెవెలుగులన్నీ వెళ్ళి పోయాయి. మళ్ళీ రాత్రి 10 గంటలకు పల్లెలకు బస్సులు వెళ్తుంటాయి. పట్టుదలగా అలాగే బస్టాండ్ అంతా వెతుకులాట మొదలు పెట్టాను. బాగా చీకటైంది. బస్టాండ్‌లో జనం పలచబడుతున్నారు. నేను తిరుగు తూనే ఉన్నా. అప్పుడు కనిపించాడు. ఒక బల్ల మీద మునగదీసుకుని కూర్చున్న ఓ ముసలాడు. నెమ్మదిగా వానిదగ్గరకు వెళ్ళి, పక్కగా కూర్చున్నా. పరిచయస్థుడిలా నవ్వా. అతను నన్ను ఎగాదిగా చూసి, పట్నపోడితో మనకెందుకు అనుకున్నాడో





ఏమోగానీ, మరింతగా ముడుచుకుపోయి కూచు న్నాడు. అది వర్షాకాలం. పైగా ముసురు పట్టింది. మధ్యమధ్యలో చలిగాలి ఈడ్చిఈడ్చి కొడుతోంది. ఆ చలికి సిగరెట్ తాగాలనిపించింది. కానీ సిగరెట్ తాగితే ముసలాడు నమ్మడేమోనని, అంతకు ముందే నా జేబులో పెట్టుకున్న బీడీకట్ట తీశా. ఒక బీడీ వెలిగించా. గుప్పుమని లాగా. అలవాటు లేదేమో ఒక్కసారిగా గొంతు మంటెక్కింది. బీడీ పొగను ముసలాడు ఆశగా చూశాడు. నేను నవ్వి ఒక్క బీడీ తీసి వానికిచ్చి "పర్వాలేదు తీసుకో" అన్నా.

నేనిచ్చిన బీడీ తీసుకుని వెలిగించి జమా యించి ఒక పీల్పు పీల్చి వదిలాడు. అప్పుడు చూడాలి. ముసలాడి కళ్ళలోని ఆనందం.

"ఎట్టున్నది" మాటలు కలిపాన్నేను.

"మంచిగున్నది. కరీం బీడీనా" అన్నాడు ముసలాడు.

"అవును. యాడికి పోవాలి" సంభాషణ పొడి గించాను. అతనికి మరింత చేరువవ్వాలని ముసలాడు మాట్లాడే తీరుగానే మాట్లాడటం మొదలు పెట్టాను.

''దొరగారి పల్లె''... అబ్బో చాలా దూరం అన్నట్టు అన్నాడు ముస లాడు.

"అబ్బా... చాలా దూరం కదా. బస్సున్నదా ఇప్పుడు?"

"ఏడుగంటల బస్సు దొరకలా లాస్టుబస్సుకి పోదామని ఆగినా, మొదటి ఆట సినిమా అయి నంక వస్తది".

"ఇక్కడికి ఏం పనిమీద వచ్చినవ్"

"డబ్బులు తీసుకోకుండా కళ్ళ పరీక్ష చేస్తారని పేపర్‌లో ఇచ్చారు. అది చూసి వచ్చినా. చూపించు కున్నా".

"చూపించుకున్నావా? మరి మందులిచ్చారా? కళ్ళద్దాలిచ్చారా? ఏమన్నరు?"

"లే... మందులు రాసిచ్చిండ్రు. అద్దాలు వేయిం చుకో మన్నరు".

"అచ్చా. అది సరేగానీ... ముసలోనివైనవుకదా బతికేటందుకు ఏం చేస్తున్నవ్?"

"ఏందీ నేను ముసలోడ్నా... ఇప్పుడు కూడా వడ్ల బస్తా లేపుతా".

"నిజంగానే. నీ వయసు వచ్చేసరికి మేము మాత్రం ముసలోళ్ళమైపోతాం. ఎంతైనా పాత మనుషులు కదా. మీ ముందు మేమాగలేములే!" నెమ్మదిగా అతన్ని నా వైపు తిప్పుకోవడానికి మెచ్చు కోలు మాటలు అన్నాను. అది పనిచేసినట్టుంది.

"ఔ... నిజమే మేముతిన్న జొన్న అన్నం, రాగి సంగటి, మీరేడ తిన్నరు. అప్పట్లో మేము రాళ్ళను అరాయించుకునేటోళ్ళం. రెండుముద్దలు సంగటి తిని పనిలోకి వంగుంటే మళ్ళీ పొద్దు వాలినాకనే నడుం ఎత్తేటోళ్ళం. ఆ తిండి, ఆ పని ఇప్పుడేడు న్నాయ్. ఇప్పుడంతా నాజూకు లేగా. ఒక్కడూ లాగు, చొక్కా ఇప్పుతలేదు. అంటే అ పనిచేస్తే చెమట కూడా పట్టడం లేదన్నట్టు లెక్క. అంత అలకంగా అయిపోయినయ్ ఇప్పటిపనులు. జమాన మారింది కదా" పాత కొత్త పోకడల గురించి అలవోకగా వివరించాడు.

"అంత పని చేసేటోనివా? సొంత పొలము న్నదా?" అతను భూస్వామి కాదని చూస్తేనే అర్థ మవుతున్నా, నువ్వు కూలోనివా అని డైరెక్ట్‌గా అడగ లేక ఇలా అడిగానంతే.

"నాకెక్కడిది పొలం. పొలమూ లేదు, చేనూ లేదు. నేను పొలాల్లో కూలీచూసుకునేటోణ్ణి. చిన్న పుడు పాలేరుగా ఉన్నా. ఇప్పుడెవరూ పాలేర్లను పెట్టుకోవడం లేదు. ఆళ్ళననేదేం ఉంది. మా ఓళ్ళలో ఎవరూ పాలేర్లుగా ఉండేటందుకు ముందుకు రావడంలేదు. రోజు కూలీల్లెక్కనే బాగు న్నదంటున్నరు. ఏం చేస్తం... కాలంతోపాటు పోవాలి కద" తలపాగావిప్పి తెల్లబడిన జుట్టు సరి చేసుకుని మళ్ళీ కట్టుకున్నాడు.

"అబ్బా... మీ ఇంట్లో నువ్వు కూలోనివన్న మాట" నిరసనగా అన్నట్టు అంటూనే అతన్ని రెచ్చ గొట్టేట్టు మాట్లాడా.

"నేనొక్కడిననేముంది. మా తాత కూలోడు, మా బాబు కూలోడు. నేను కూలోణ్ణి. నా బిడ్డలు కూలోల్లే. కూలోళ్ళ కులంలో పుట్టినంక కూలి చెయ్యక యాడికిపోతం".

కూలీవాండ్లందరినీ కలిపి కూలీ కులం అంటున్న తాత ఓ మాదిరి తత్వవేత్తలా కనబడతున్నాడు. తెలివిగా అన్నానని ఏమైనా ఫోజిస్తున్నాడా? అని నిదానంగా చూసినా మామూలుగానే ఉన్నాడు.

“అలా అంటవా. అది సరే. మీ నాన్నపేరేంటి? ఎవరి దగ్గర పాలేరుగున్నడు, నీ పేరేంటి? ఎప్పట్నుంచి పాలేరుగున్నవ్. పర్లే చెప్పు... పొద్దుపోవాలి కదా.. ఏదో ఒకటి చెప్పుకుంటా ఉంటే బాగుంటుంది. అందుకని అడిగినా” బీడీ కట్ట మొత్తం అతనికి అందిస్తూ అన్నా.

ఆబగా అందుకుని అందులోని బీడీ తీసి వెలిగించి, గుండెల నిండా పొగపీల్చి వదిలి చెప్పడం మొదలుపెట్టాడు. “మా తాత పేరు యాదయ్య, బాపు పేరు నర్సయ్య. నా పేరు యాదగిరి. మా తాతపేరు కలిసిందని పెట్టాడంట మా బాపూ. మా తాత, అయ్యకూడా మా ఊరి దొర రాంచందర్ రావు దగ్గరే పాలేర్లుగా పనిచేశారు. నేను లాగులు కట్టడం నేర్చుకున్నాక ఆ దొర దగ్గరే పశువులు కాసేటందుకు కుదిరినా. మా తాత, బాపూ, నేనూ ఆ దొర దగ్గర చేస్తున్నప్పుడే మా తాత, బాపూ పోయారు. దొర కూడా పోయారు. నాకు మీసకట్టు వచ్చేసరికి దొర కొడుకు కిష్టారావ్‌దొర జమానా వచ్చింది. ఆయన ఉన్నంతకాలం ఆయన దగ్గర పాలేరుగా పనిచేసినా. దొర పోయిండు. అతని మొఖంలో బాధో, మరోటో తెలియని ఒక నిట్టూర్పు వెలువడింది. “కొడుకులు వ్యవసాయం గురించి పట్టించుకోలేదు. జమాన మారి పాలేర్లతనం తక్కువై రోజుకూలీలు ఎక్కువైనయ్. నేను కూడా రోజు కూలీకే పోతున్నా” బీడీ చివరిపీల్పు పీల్చి అవతల విసిరేస్తూ అన్నాడు తాత.

“ఏంటీ ఇంకా పనిచేస్తున్నవా? కొడుకులున్నరన్నవు కదా” నాకు తెలుసు. అయినా అడిగా.

“ఉంటే ఆళ్ళ బతుకు ఆళ్ళు బతుకుతరు. నాకు, నా ముసలిదానికి కూడెట్టాలంటే యాడైతది. అందుకనే నేను, నా ముసల్ది రోజుకూలీమీదే బతుకుతున్నం. ఎప్పుడన్నా పెయ్యి (శరీరం) బాగాలేకపోతే మానేస్తం. ఏదో అట్ట నడుస్తాంది. బతక్క తప్పదుకదా..” ఆత్మవిశ్వాసంతో పాటు ఫిలాసఫీని కలిపి చెప్పాడు తాత.

ఇంతకీ “పాలేరుగా ఉంటే మంచిగుండేదా? రోజు కూలీ అయితే మంచిగుంటదా?”

“దేని కట్టం దానికుంటుంది బాన్చన్. అస్సలు కష్టపడకుండా బువ్వెట్లా దొరుకుతది. అప్పట్లో ఇప్పట్లా పనిముట్లు లేవుకదా. కోడికూసినప్పుడు పోయి, నాగళ్ళు కట్టేటోళ్ళం. ఇప్పుడు ట్రాక్టర్లు వచ్చినయ్. తెల్లారకముందు నుండే యాతం యేసెటోళ్ళం. ఇప్పుడు, ఇంజన్లు, మోటార్లు వచ్చినయ్. అప్పట్లో ఊళ్ళో బీద, బిక్కీ ఆ పొలాలమీద పడే బతికేటోళ్ళం. ఇప్పుడు ఊళ్ళో ఒక్కొంతు కూడా పొలం పనికి వంగడం లేదు. అప్పటికీ, ఇప్పటికీ పనిసుఖం వచ్చిందిగానీ బాన్చన్ మనసుకు సుఖం లేదు. అప్పుడంత కష్టపడ్డా... హాయిగా పడుకునేటోళ్ళం. ఇప్పుడేంటో ఎంతసుఖంగా పని చేసినా మనసుకు సంతోషంగా లేదు. ఏదోలేదని లోటు, అదేంటో అర్థం కాదు. చుట్టూ చూస్తే ఎలుగులు. మా కళ్ళలో చీకట్లు, ఎందుకో? ఏంటో? కానీ ఇప్పుడు నిద్ర సరిగ్గా పట్టడం లేదు బాన్చన్” బీడీ కట్టలోంచి మరో బీడీ తీస్తూ అన్నాడు తాత.

బీడీల వాసన నాకు పడటంలేదు. కానీ తప్పేట్టు లేదు. తాత పూర్తి ఇంటర్వ్యూ పొందాలంటే ఓపిక పట్టక తప్పదు మరి. బస్టాండ్‌లో జనం పల్చబడుతున్నారు. లాస్ట్‌బస్సులకు వెళ్ళేటోళ్ళు మాత్రం అక్కడక్కడా కూర్చుని ఉన్నారు. అలసిపోయినవాళ్ళు బల్లలమీదే పడకసీను వేశారు. తాత బీడీమీద బీడీ తాగుతూ నిద్రరాకుండా చేసుకుంటున్నాడులా ఉంది. “బాగా చలిగా ఉంది. ఛాయ్ ఏమైనా తాగుతవా తాతా” చలిగాలికి తలపాగా చెవుల మీదికి దించుకుంటున్న తాతనుచూసి అన్నాను.

“మాలాంటోళ్ళకు చలి పోవాల్నంటే తాగాల్సింది ఛాయ్ కాదు. అది వేరేటుందిలే”.

“వేరొకటా... ఎక్కడా?” చుట్టూచూశాను. ఏం కనిపించలేదు. ఒకామె నా ముందునుండి వెళ్ళి తాత ముందు రెండుసెకన్లు నిలబడింది. తాత బుర్ర ఊపాడు. ఆమె వెళ్ళిపోయింది. కానీ ఆమె ఎందుకు వచ్చిందో, తాత ఎందుకు బుర్ర ఊపాడో నాకు అర్థం కాలా. ఆశ్చర్యంగా తాత వంక చూసి

**నాయకులు, మత ప్రవక్తలు, విప్లవకారులు, ఆధ్యాత్మికవాదుల జీవిత చరిత్రలు గ్రంథాలయాల్లో మనకు కనిపిస్తాయి. ఆఖరికి దుర్యోధనుడు, గాడ్సే కథలూ ఉన్నాయి. సామాన్యుడి కథ మాత్రం లేదు. అతను అదే ఆలోచించాడు. ఒక కూలివాడి చరిత్ర రాయాలని బయలుదేరాడు. ఒక తాత దొరికాడు బస్టాండులో. ఆ తాత కథ విన్నాక ఆ రచయితకు భయం వేసింది. అతడికెందుకు భయం వేసింది? కారణం ఏమిటి?**

“ఏమంటున్నది ఆమె” అన్నా.

“నువ్వు చదువుకున్నోనివిలాగున్నవ్. అవన్నీ నీకు చెప్పేటందుకు లేదులే” బీడీ పొగ గాల్లోకి వదులుతూ అన్నాడు తాత.

“ఫర్వాలేదు చెప్పు. మనం ఇంతసేపూ ఒకే బల్లమీద కూర్చుని ముచ్చట్లాడుకున్నం. దోస్తులం గామా. దోస్తు దగ్గర దాచేటిదేముంటది?” బుజ్జగిస్తున్నట్లు అన్నా.

“ఏం లే. దాని దగ్గర సారా పొట్లాలున్నయ్. కావాల్నాని అడిగింది. డబ్బుల్లేవన్నా పోయింది” గుట్టు విప్పేశాడు తాత.

విచిత్రం ఇన్నిరోజులు ఈ బస్టాండ్‌లో తిరుగుతున్నా నాకు తెలియని సంగతి ఎప్పుడోగాని పట్నం రాని తాత క్షణంలో కనిపెట్టేశాడు. చాలా ఆశ్చర్యమేసింది. “సారానా.. ఆమె అమ్ముతదా.. నీకు తాగాల్ననిపిస్తోందా? ఇందతీసుకో” ఇరవైరూపాయల నోటు అందించా.

మొహమాటంగానే అది తీసుకుని గబగబా ఇంతకుముందు వచ్చిన ఆమెను పట్టుకుని గోడ చాటుకు వెళ్ళి ఒక్క నిమిషం తరువాత మూతి, మీసాలు తుడుచుకుంటూ వచ్చాడు తాత. ఇప్పుడతని కళ్ళు ఎర్రగా వెలుగుతున్నాయ్. బీడీపొగ గట్టిగా లాగి వదులుతున్నాడు. సారా వాసనకు, బీడీ పొగకు కడుపులో తిప్పినట్టవుతోంది. కానీ తప్పదు. అతనితో ఇంకా పని ఉంది మరి.

“ఏం తాతా! మస్తు ఖుష్‌గున్నవ్‌లే”.

“ఆవ్... ఆవ్...” నవ్వుతూ అన్నాడు తాత.

“అది సరేగానీ తాత... నువ్వు పాలేరుగా పని చేసేప్పటి రోజులే మంచిగున్నయ్ అన్నవ్ కదా.. అలా ఎప్పుడెప్పుడనిపించింది? యాది చేసుకుని చెప్పు”.

“ఏడేళ్ళ వయసులో పశువులతో తిరుక్కుంటా, దూడ పెయ్యిలతో ఆడుకుంటా ఉంటే మస్తు మజాగా ఉండేది. దసరా పండక్కి దొర అందరికీ కొత్త బట్టలు ఇచ్చెటోడు. నాకూ ఇచ్చెటోడు, మస్తనిపించేది. పనంతా చేసి పొద్దు గూకినంక ఇంట్లో అవ్వదగ్గర బబ్బునేవోణ్ణి. అవ్వ నా తల నిమురుతా కథలు చెబుతా ఉండె. భలేగుండేది. బతు



కమ్మలకి తంగేడుపూలు కోసుకురమ్మని చిన్న దొర సాని... అంటే కిష్ట్రావ్‌దొరబిడ్డ చెప్పినప్పుడు పూలు తెచ్చేటోన్ని. నేను, చినదొరసాని కలిసి అయన్నీ బతుకమ్మలు కట్టేటోళ్ళం. మస్తు మజాగుండేది. చిన్న దొరసాని బోనాలకు తీసుకుని వచ్చేటపుడు, గుడిదాకా నేనే మోసుకొని వచ్చేటోన్ని. గుడి వచ్చి నంక దొరసాని తలమీద పెట్టుకునేది. బోనాలు మోస్తుంటే మస్తనిపించేది..."

చిన్నప్పటి సంగతులు హుషారుగా చెప్పుకు పోతున్నాడు తాత. నిజానికి ఆ వయసులో చదువు కోవాలి. అమ్మా నాన్నలతో ఆడుకోవాలి అవన్నీ కాక పడిన బాధలే కానీ సంతోషాలని చెబు తున్నాడు పాపం. ఇప్పుడు తలచుకుంటే అలా అనిపిస్తున్నాయేమో. "అది సరే తాత. నీ చిన్నప్పటి సంగతి కాదు. నువ్వు పెద్దోనివైనాంక, మీసాలు వచ్చినాంక అనుకో, అప్పట్నుంచి నీకు సంతోషమ నిపించినయి చెప్పు".

చెప్పేదేముంది, పొద్దుగాలే లేచి దొర పశువుల్ని తోలుకుని చీకటిమాటున ముల్లు గుచ్చుకున్నా కాళ్ళతో ఉతికి చీకట్లో పడి వచ్చినంక తినడానికి ఏమీ లేక ఖాళీ బొచ్చె కనిపించినపుడు మస్తు బాధనిపించిన రోజులెన్నో. బత్తెం కోసరం జొన్నలు అడిగితే దొర కొట్టిన రోజులెన్నో, పెళ్ళయిన మొదటి రాత్రే చేలో కాపలా పడుకోవాల్సి వచ్చినప్పుడు, పండక్కి కొడుక్కి కొత్తగుడ్డ కొనలేనప్పుడు, రోగ మొచ్చినప్పుడు మా అవ్వకు, అయ్యకు మందిప్పిచ్చ లేక పోయినప్పుడు ఆళ్ళు రోగంతోనే, ఈ చేతుల లోనే పాణాలు ఇడిసినప్పుడు నా కొడుకులు పెళ్ళిళ్ళు చేసుకుని నాతో సంబంధాల్లేకుండా దూరంగా పోయినప్పుడు.. చెప్పుకుంటే ఇయే ఎక్కువుంటాయ్ బాన్చన్. ఎన్నని చెప్తా, ఏదో అట్ల బతికేసినా. తప్పదు బాన్చన్. ఈ కట్టెకు పిలుపొచ్చేదాంకా... ఇంతే ఏం చేస్తాం" నిర్వేదంగా అన్నాడు తాత.

తాత చెప్పినవన్నీ బాధలే. కానీ ప్రతి పేద

## కంటతడి పెట్టిన దీపిక

*బాలీవుడ్‌లో స్టార్ హీరోయిన్ల కన్నా ఎక్కువ రెమ్యునరేషన్ తీసుకునే దీపికకు కంటతడి పెట్ట వలసిన అవసరం ఏమొచ్చింది అనుకుంటున్నారా? ఒక సినిమా విషయంలో దీపిక సెట్‌లోనే కంట తడి పెట్టుకుందట! దీపిక సంజయ్‌లీలా భన్సాలీ సినిమాలో నటిస్తున్న సంగతి తెలిసిందే సాధారణంగా సంజయ్ తన సినిమాలో చేస్తున్న వారి నుంచి మంచి నటన రాబట్టుకోవడానికి గాను వారిమీద కొంత ఒత్తిడి తీసుకొస్తాడు. ఇది జగమెరిగిన సత్యం. ఈ వేధింపులను తట్టుకోలేక, దీపిక సెట్‌లోనే ఏడ్చేసిందట!*



"పెద్దయినంకంటే... మా కిష్ట్రావ్‌దొర నాకు పిల్లని చూసి పెళ్ళి చేసినప్పుడు మస్తు ఖుషీ అని పించింది. ఆ రోజంతా మస్తు తాగినం. వచ్చి నోళ్ళందరికీ వద్దనేకొద్దీ పోస్తనే ఉన్నం. అట్లనే నా మొదటి కొడుకు పుట్టినప్పుడు మస్తనిపించింది. బిడ్డ పుట్టినప్పుడు కూడా మస్తనిపించింది. మా దొర మా ఆడదానికి పండక్కి బట్టలుపెట్టి, నాకు కల్లుకు డబ్బులిచ్చినప్పుడు కూడా మస్తనిపించేది. నా కొడుకులు ఎదుగుతున్నప్పుడు ఆళ్ళ పెళ్ళిళ్ళయి మనవళ్ళు, మనవరాళ్ళు పుట్టినప్పుడు మస్తు ఖుషాల్‌గుండేది. అయినా గప్పుడూ, గిప్పుడూ ఏంటి దొరా? పది, ఇరవై దొరకాలా? కల్లు పడాల. అప్పుడెప్పుడైనా మస్తు హుషారే. అంతకంటే మా బతుకుల్లో చెప్పుకునే సంతోషాలేముంటయ్ బాన్చన్" నవ్వుతూ అన్నాడు తాత.

"అట్టనా. అయి తల్చుకుంటే నువ్వు మస్తు ఖుషీ కొడుతున్నవ్ తాతా. బాగానే ఉందిగనీ. నువ్వు పాలేరుతనం చేసినపుడు బాధనిపించి నయి, కష్టమనిపించిన రోజులు లేవా?"

నా వంక అమాయకుడిలా చూశాడు తాత. చిన్న నవ్వు నవ్వి, "పట్నపోనివి కదా అట్నే అడుగు తావ్‌లే. మాయన్నీ బాధలే బాన్చన్. ముందుగాల చెప్పినవన్నీ అప్పుడప్పుడు ఎప్పుడెప్పుడో ఖుషీ అయిన రోజులుతప్ప అన్నీ బాధలే. విడమర్చి

వాడికి ఉండే బాధలే. కానీ తీర్చేవాళ్ళు లేరు. ఆర్చేవాళ్ళూ లేరు. ఎవరెన్ని కబుర్లు చెప్పినా ఆ బతుకులు అంతే. పునాదిని కదపలేని పై పై మెరుగులు ఎన్ని అద్దినా, దిద్దినా ఆ బతుకులు అంతే ఉంటాయి. తాత ముఖం చూస్తే ఇంకా ఏదో దాస్తున్నా డనిపిస్తోంది. నేను చూసుడులో ఉందో లేక తాత దాపరికం పెడు తున్నాడో? ఒకవేళ ఉన్నా ఎట్లా బయటికి లాగాలి?

ఈ లోపల ఇంతకుముందొచ్చి నామె మా ముందునుండి వచ్చిపో యింది. తాత నా వంక ఆశగా చూశాడు. 'ఎళ్ళొస్తవా' అన్నట్టు సైగ చేసినా. మొహమాటంగా తల ఊపాడు తాత. జేబులోనుండి మరో ఇరవైరూపాయలు తీసి ఇచ్చిన. తాత తీసుకుని హుషారుగా వెళ్ళిండు. ఎప్పుడొస్తడా అని తాత వెళ్ళిన దిక్కే చూస్తున్న. తాత వస్తున్నడుగానీ కొంచెం ఊగుతున్నడు. కొంపదీసి మందెక్కువ కాలేదు కదా. అట్లయితే నా కష్టం గంగపాలైతది. తాత వంకే చూస్తున్న, తాత వచ్చి బాన్చన్ అంటూ కాళ్ళకు దండం పెట్టబోయాడు. గబాల్న కాళ్ళు లాక్కుని "లే... లే... తాత... లేలే... ఏం పన్లవి.

తప్పు" అని బలవంతాన లేపి పక్కన కూర్చోబెట్టు కున్నా. బీడీ తీసి వెలిగించి గప్పున పొగ వదిలాడు తాత.

వాంతి రాబోతున్నట్టనిపించినా ఉగ్గబెట్టుకుని "ఇప్పుడు నిజం చెప్పాలి తాతా. నీ బతుకులో నీకు చాలా సంతోషమనిపించినవి ఏమున్నయి?"

"ఏమున్నయి. ఆ... యాదొచ్చింది. మా కిష్ట్రావ్ దొర కూతురు మస్తుగుండేది. నేనంటే మంచిగా

# కొత్త కవరింగ్ బాగుందే!

*నర్గీస్ ఫక్రీ....బాలీవుడ్‌లో పరిచయం అక్కర్లేని పేరు. సినిమాల కన్నా ఎఫైర్లతోనే ఈ బ్యూటీ అక్కడ బాగా పాపులర్ అయింది. తాజాగా ముంబయి ఎయిర్‌పోర్టులో బాయ్ ఫ్రెండ్ ఉదయ్‌తో కనపడింది. కాకపోతే ముఖానికి ముసుగు వేసుకున్నా బాలీవుడ్ మీడియా నర్గీస్‌ను గుర్తు పట్టింది. ఎటూ బయటపడింది కనుక తన ఎఫైర్ ఓపెన్ అయితే బాగుండేది కానీ, రకరకాల కహానీలు వినిపించి అక్కడి వారిని గందరగోళానికి గురిచేసిందట! నర్గీస్ కహానీలు కొందరు బాలీవుడ్ హీరోయిన్లకు తెగ నచ్చేశాయట! ఈ కొత్త కవరింగ్‌ని తాము కూడా అమలు చేస్తే బాగుంటుందని ఆలోచిస్తున్నారట కూడా!*

చూసుకునేది. ఓరోజు ఏదో పనిబడి దొర ఇంటికి వచ్చిన. ఇంట్లో ఎవరూ లేరు. దొర కూతురు ఉన్నది. నా దగ్గరికి వచ్చి ఏమేమో మాట్లాడింది. నా ఒంటిమీద చేత్తో పాముతా 'మస్తున్నవ్ రా. కొరుక్కు తినాలనిపిస్తోంది' అంది కళ్ళు మూసుకుంటా. అప్పుడు దొరా ఏం ఖుషీ అనిపించిందో తెలుసా? ఈలోగా ఏదో అలికిడి అయితే దొరకూతురు లోనకు వెళ్ళిపోయింది" తాత మాటలు ముద్దగా వస్తున్నాయి.

"తప్పుకాదా... ఆ అమ్మాయి ఏదో చేసినా నువ్వొద్దని చెప్పొచ్చుగా ఆ...?"

తాత నవ్వాడు. ఎందుకో అర్థం కాలేదు. "అలికిడి అయిందని చెప్పాను కదా. ఆ అలికిడి మా కిష్టావ్‌దొరదే. జరిగిన దానికి నా తప్పు లేకున్నా మస్తు కొట్టిండు. ఇదిగో ఈ చేతులమీద వాతలున్న య్‌గదా అయి అప్పుడు దొర కొట్టినయే... ఆ బాధకి మస్తు ఏడ్చినా... ముందుగాల్న చెప్పిన జూడు. నా మొదటిరాత్రికి దొర పని ఉందని చేలోకి పంపించినాడని. ఆరోజు రాత్రి మనసు నిలవక ఇంటికొచ్చిన. ఇంట్లోంచి గాజుల చప్పుడు ఇనిపించింది. తొంగి చూసిన. నా పెండ్లాంమీద దొరున్నడు. మనసు మండింది. కానీ ఏం చేసేడిది లేక, కళ్ళల్లో నీళ్ళు పొక్కుకుంటూ పొలంలోకి పోయిన. అట్టా నేను చాలా రాత్రులు పొలంలో కాపలాకు పోయినా.. నాకు మొదటి కొడుకు పుట్టినప్పుడు నా పెళ్ళాం నవ్వుతా 'అచ్చం దొరలాగున్నడు కదా మామా' అని సంబరపడతావుంటే పిచ్చకోపంవచ్చి దాన్ని బండకొట్టుడు కొట్టిన. నిజం చెప్పనా దాన్నలా కొడుతుంటే నాకు మస్తు మజాగనిపించింది. దొర నన్ను తిట్టినప్పుడు, కొట్టి నప్పుడు మస్తుకల్లు తాగొచ్చి నా పెళ్ళాన్ని, కొడుకుని చావ గొట్టేటోన్ని. అప్పుడే నాకు నిద్ర మంచిగొచ్చేది" ఎటో చూస్తూ అన్నాడు తాత.

నేను చూస్తుండిపోయిన తాత వంక. తాత పగులుతున్న అగ్ని పర్వతంలా ఉన్నాడు.

"నా చిన్నప్పుడు మా యవ్వ నన్ను ముద్దుచేస్తూ నీకేందిరా... దొర బిడ్డవు. అందుకే అంత రంగున్నవు. అన్నప్పుడు భలే హుషారుగుండేది. నా పెళ్ళానికి దొరలాంటి కొడుకు పుట్టాక తెలిసింది. నేనెట్ట దొరబిడ్డడినయ్యానో, తూ నీ యవ్వబతుకులు" తాత కాండ్రించి ఉమ్ముతూ అన్నాడు. అతని మాటల్లో రవ్వంత రోషం, రోదన కనిపిస్తున్నాయి.

నాకేమనాలో అర్థంకాక అలా ఉండిపోయాను.

"ఇచ్చేజీతంలో అన్నీ తకరార్లు చేసేటోడు. కానీ నా పెళ్ళానికి మాత్రం మంచి మంచి చీరలు, రవికలు పంపిచ్చేటోడు. నాకు మండుకొచ్చి ఏం చేయాల్నో తెలియక పిచ్చ తాగి ఎక్కడ పడుకునేవాన్నో నాకే తెలియదు. చూసి చూసి ఓర్వలేక దొరకు చెప్పిన, నా పెళ్ళాం వంక రావద్దని. అంతే ఇగచూడు నన్ను చెట్టుకు కట్టేసి ఇదర బదర బాది వదిలి పెట్టిండు. చూసినవా ఎంత ఘోరమో. ఆడిబిడ్డ నా మీద చెయ్యేసినా నన్నే కొట్టిండు. ఆడు నా పెళ్ళాం మీద చెయ్యేసినా నన్నే కొట్టిండు. మనిసన్నోనికి ఎట్లుంటదో చెప్పు. మరలాంటోనికి ఇలువెంతో చెప్పు. ఇలాంటి బాధకి ఎంత ఇలువుంటది. మాలాంటి వాళ్ళ సంతోషానికి ఎలాంటి విలువుంటది" తాత కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి. బీడీ కాలుస్తూనే ఉన్నాడు. అలా కాల్చినప్పుడల్లా దాని చివర ఎర్రగా మండుతానే ఉంది.

"అంటే నువ్వు దొర కొడుకువా..."

ఏమంటాడోనని భయపడుతూనే అడిగా.

"అంటే మాత్రం పెద్దోళ్ళు ఒప్పుకుంటారా? ఎవరో చెప్పినారు. మొన్నొకాయిన ఢిల్లీలోనో, ఇంకేదో ఊళ్ళోనో ఒకడు ఒక పెద్దాయనను నువ్వే మా నాన్నవని మొత్తుకున్నా, పెద్దాయన ఒప్పుకున్నాడా. ఎంతోమంది చెప్పినారట. అయినా ఒప్పుకుంటే మాత్రం ఏమవుతాది. నేను దొర కొడుకునవుతానా. ఒకేలైతే నీకీ పాటికి ఏ పెదబాబునో, పెద మామనో అయుంటాను వరసకి" తాత వికవికమంటూ నవ్వి "నేను పాలేరోడి బిడ్డను పాలేరోన్నే అవుతా అంతే, అదిగోదొరా లాస్టు బస్సు వచ్చేసినాది. వస్తా బాన్చన్" అని చెప్పి బస్సెక్కాడు తాత.

నాకప్పుడనిపించింది. కూలోళ్ళ గురించి ఆళ్ళ బాధల గురించి రాయాలిగానీ, వాళ్ళ జీవిత చరిత్రలు రాస్తే, జాతకాలు తిరగబడతాయని. వాడు ఎక్కడో అక్కడ వరసకి అన్నో, మామో అయితే... ఆ ఊహ తల్చుకుంటేనే భయంగా ఉంది. అందుకేనేమో పెద్దపెద్ద కవులందరూ ఆళ్ల బతుకులు గురించి రాశారు గానీ... ఆళ్ళచరిత్రల గురించి రాయలేదన్న సత్యం కొద్దికొద్దిగా బోధపడింది.

తాత ఎక్కిన బస్సు కదిలి చీకట్లో పడి వాళ్ళ ఊరువైపు వెళ్ళిపోతోంది. అటువైపు వెలుగెప్పుడొస్తుందో...

**సెల్: 99499 41996**




## స్టైలిష్ బామ్మ



స్కర్టు వేసుకుని చైర్లో కాలుమీదకాలు వేసుకుని ఒక ఫొటో.. హ్యాండ్‌బ్యాగులన్నీ మీద వేసుకుని స్టైలిష్ ఫోజుతో మరొక ఫొటో... నాలుక బయటపెట్టి టేకిట్ ఈజీ అన్నట్టుగా హైహీల్స్, ప్యాంటూ, షర్టుతో ఇంకొక ఫొటో... ఇలా ఇచ్చిన ఫోజివ్వకుండా ఫొటోలమీద ఫొటోలతో సోషల్‌మీడియాలో హల్‌చల్ చేస్తోంది ఎర్నెస్టైన్ స్టాల్‌బెర్గ్.

ఆస్ట్రియా రాజధాని నగరం వియన్నాలో నివాసముండే ఎర్నెస్టైన్ ఎర్నీ స్టాల్‌బెర్గ్ రకరకాల స్టైలిష్ ఫోజులతో ఫొటోలుదిగి సోషల్‌మీడియాలో అప్‌లోడ్ చేస్తోంది. ఈమె ఫాలోయర్ల సంఖ్య కూడా తక్కువేమీ లేదు.

మరి ఈ ఫొటోలతో అందరిచేతా స్టైలిష్ బామ్మ అని పిలిపించుకుంటున్న ఎర్నెస్టైన్ వయస్సు ఎంతనుకుంటున్నారు? అక్షరాలా 95 సంవత్సరాలు. శతకానికి దగ్గరపడిన వయసులో కూడా కుర్రకారుకి నేనేమీ తీసిపోను అన్నట్టుగా అందరి దృష్టినీ ఆకర్షిస్తున్న ఎర్నెస్టైన్ ఓపిక, క్రియేటివిటీలను మెచ్చుకోవాల్సిందే!



## రికార్డ్ ఫీట్!

ఏవో చిన్న చిన్న వస్తువులనైతే గడ్డంమీద నిలబెట్టొచ్చు. కానీ ఏకంగా సైకిల్‌ని గడ్డం మీద నిలబెట్టేసి రికార్డు కొట్టేశాడు చెక్ రిపబ్లిక్‌కి చెందిన ఆస్ట్రిటా ఫర్‌మేన్. ఈ అరుదైన రికార్డు సృష్టించిన ఫర్‌మేన్ గిన్నిస్‌బుక్‌లో చోటు సంపాదించుకున్నాడు. 12 కేజీల బరువున్న సైకిల్ సీటుని తన గడ్డంపై నిలబెట్టి గాల్లో నిలిచేలా చేశాడు. అలా రెండు నిమిషాలకు పైగా ఉంచాడు. దాంతో గిన్నిస్ రికార్డు అతని సొంతమైంది.

## సరదా సరదా యోగా!

ఫిట్‌నెస్, ఆరోగ్యం కోసం ప్రతిరోజూ జిమ్‌కెళ్ళి ఎక్సర్‌సైజులూ, యోగా చేసి చేసి విసుగొస్తోంది కదా! ప్రతిరోజూ ఇవన్నీ చేయాలంటే చాలా బోర్! అందుకే న్యూహాంప్‌షైర్‌లోని జెన్నెస్‌ఫామ్‌లో యోగా క్లాసుల్ని చాలా విచిత్రంగా నిర్వహిస్తున్నారు.

ఫిట్‌గా ఉండటంకోసం రోజూ జిమ్‌కెళ్ళి ఇష్టం లేకున్నా కష్టపడే వారికి ఈ యోగా భలే మజాగా అనిపిస్తుంది. అలా ఎంతసేపయినా యోగా చేయాలనిపిస్తూనే ఉంటుంది. ఎందుకంటే మీరు యోగా చేస్తున్న సమయంలో క్యూట్‌గా ఉండే బుల్లి బుజ్జి మేకపిల్లలు మీ వీపులమీద గెంతుతాయి. మిమ్మల్ని ఉల్లాసపరుస్తాయి. అవి అలా వీపులపై గెంతుతుంటే అస్సలు టైమే తెలియట్లేదని, ఇంకా ఇంకా యోగా చేయాలనిపిస్తోందని చెబుతున్నారు ఇక్కడి తరగతులకు వచ్చినవారు. అన్నిచోట్లా జిమ్ క్లాసులు ఇలా ఉంటే ఎంత బావుంటుందో అనుకుంటున్నారు కదా.





## వింత చర్చ్

అనగనగా ఓ దేశంలో ఓ చర్చ్. మరి అందులో ప్రవేశానికి మాత్రం కొంచెం ప్రయాసపడాల్సిందే. ఎందుకంటే ఆ చర్చ్‌లోకి ప్రవేశించాలంటే భూమి లోపలికి వెళ్ళాలి. దానికి ఇంకో ప్రత్యేకత కూడా ఉంది. ఉప్పురాతి గనుల్ని తొలిచి ఈ చర్చ్ నిర్మించారు.

కొలంబియాలోని జిపక్వీరా అనే చిన్న గ్రామంలో ఉందీ చర్చ్. సాల్ట్ కాథెడ్రల్‌గా పిలిచే ఈ చర్చ్‌లో ప్రార్థనలు చేయడానికి ప్రతి ఆదివారం మూడువేల మందికి పైగా భక్తులు వస్తారట. మరి ఈ చర్చ్‌కి వెళ్ళాలంటే 650 అడుగులు కిందకి వెళ్ళాలి. కొన్ని వందలఏళ్ళ క్రితం సముద్రం ఎండిపోవడంతో ఈ ఉప్పురాతి గనులు ఏర్పడ్డాయట. వాటిని తొలుస్తూ ఈ చర్చ్ నిర్మించారు. తెల్లటి ఉప్పురాతి గనుల్లో శిలువ, చర్చ్ స్తంభాలు, గోడలు, పైకప్పు అన్నీ ధగధగ మెరిసిపోతూ రంగు రంగుల కాంతుల మధ్య వెలుగులీనుతూ ఉంటాయి. 1995లో ఈ చర్చ్ ప్రారంభించారు. కొలంబియా మొదటి వింతగా ఇది పేరు పొందింది.

## భలే హాబీ

పక్షుల కిలకిల రావాలు వింటుంటే మనసు ఏదో లోకంలో విహరిస్తున్నట్టు ఉంటుంది. వాటి ధ్వనులే కాదు రకరకాల పక్షుల బొమ్మలు, చిత్రపటాలు చూసినా మనసు ఆహ్లాదకరంగా ఉంటుంది. అందుకేనేమో లారెన్స్ తన ఇంటిని పక్షుల బొమ్మలతో నింపేశాడు.

ఇంగ్లాండ్‌కు చెందిన లారెన్స్ కబోల్డ్ వేర్‌హౌస్ అటెండెంట్‌గా పనిచేస్తున్నాడు. అతనికున్న పనల్లా రకరకాల పక్షుల బొమ్మలను, చిత్రాలను సేకరించడమే. మొత్తానికి అతను సేకరించిన వాటిల్లో కామన్ అంశం 'పక్షి'. ఎంతో డబ్బు ఖర్చుపెట్టి వీటిని సేకరించాడు, సేకరిస్తూనే ఉన్నాడు, సేకరిస్తూనే ఉంటాడు కూడా. తను ఉండే ఇల్లు సరిపోక ఏకంగా మరో మూడు షెడ్డులు, గ్యారేజ్ కూడా వీటికోసం కొన్నాడు. అంతే కాదు అతడు తన సొంత ఇంట్లో ఉండటానికి వీలు కాక, తన తండ్రి ఇంట్లో కాలక్షేపం చేస్తున్నాడు. ఇతని కలెక్షన్స్‌లో పేపర్‌వెయిట్లు, థింబుల్స్, ఇంకా రకరకాల ఇళ్ళ నమూనాలు, సోఫా, బెడ్ కవర్లు, ప్లేట్లు ఒకటేమిటి ఎన్నో రకాలున్నాయి. 30 సంవత్సరాలుగా వీటిని సేకరిస్తున్నాడు. ఇప్పటికే అతని దగ్గర ఇలాంటి పక్షి కళాకృతులు, ఆభరణాలు, పటాలు, ఆర్టిస్టిక్ మెటీరియల్స్ అన్నీ కలుపుకుని 20 వేల వరకు ఉన్నాయి. భలే మంచి హాబీ!

–నర్మద వాసిరెడ్డి






# బెలూన్

**'చాలా దారుణం' ఎవరో అంటున్నారు వెనుక నుంచి.**

**డిటెక్టివ్ శరత్ దృష్టి పాప శవం పైనుంచి కదలటం లేదు.**

**'ఎక్కడో చంపి ఇక్కడికి తెచ్చి పారేశారు' మరెవరో అన్నారు.**

**శవాన్ని చూడగానే తెలుస్తోంది హత్య ఇక్కడ జరగలేదని.**

'స్కూలు కాంపౌండ్‌లో పారేశారు. స్కూలుకి అపఖ్యాతి తేవాలని కాబోలు'

ఇన్‌స్పెక్టర్ విజయ్‌కి సౌంజ్ఞ చేశాడు శరత్. అతడు దగ్గరకు వచ్చాడు. చాలామంది గుమిగూడారక్కడ.

'ముందు వీళ్ళందరినీ దూరంగా పంపించెయ్యాలి. వీళ్ళు పరిశోధనకు అడ్డుపడతారు' చెప్పాడు శరత్.

పోలీసులకు సూచనలు ఇచ్చాడు విజయ్. నిమిషాలలో ఆ స్థలం ఖాళీ అయింది.

శవాన్ని జాగ్రత్తగా పరిశీలించటం ప్రారంభించాడు శరత్.

ఒకవైపు శవంమీద ఎలాంటి గాయాలు లేవు. మరోవైపు తిప్పగానే అర్థమైంది.

ఎవరో బ్యాట్‌తోనో, మరేదో బలమైన వస్తువుతోనో పాపను చితకబాదారు. అందువల్ల మరణం సంభవించి ఉంటుంది.

శరీరంపై మరో ఆధారం లేదు.

'ఎక్కడో చంపి ఇక్కడికే తెచ్చి పారేయటంలో ఉద్దేశం ఏమిటో?' అన్నాడు విజయ్.

ఇంతలో పెద్దగా ఏడుస్తూ పాప తల్లిదండ్రులు వచ్చారు.

'వీరిని ప్రశ్నించాలి' అన్నాడు శరత్.

విజయ్ అందుకు సూచనలిచ్చాడు.

అసిస్టెంట్ రామువైపు తిరిగాడు శరత్. 'రామూ... వారి కుటుంబ నేపథ్యం సేకరించు. తగాదాలు, ద్వేషాలు ఏమైనా ఉన్నాయేమో తెలుసుకో. సాధారణంగా ఇలాంటి హత్యలు సన్నిహితులు, బంధువులే చేస్తుంటారు. పసిపిల్లలు వాళ్ళ దగ్గరకు త్వరగా వెళ్తారు'.

'యెస్ బాస్' అన్నాడు రాము.

'ఇంకో పని.. హత్య ఇక్కడ జరగలేదు. కానీ ఈ పరిసరాల్లోనే జరిగి ఉంటుంది. ఇక్కడనుంచి రెండు మూడు కిలోమీటర్ల రేడియస్‌లో వెతకమని నీ అసిస్టెంట్లకు చెప్పు. హత్య జరిగిన స్థలం తెలుసుకుంటే, ఇంకా ఏమైనా ఆధారాలు దొరకవచ్చు' అన్నాడు.

'యెస్ బాస్' అన్నాడు రాము.

***

'మమ్మల్ని అనుమానిస్తున్నారా?' ఆశ్చర్యంగా అడిగింది పాప తల్లి పావని.

'ఒక నేరం జరిగినప్పుడు దానితో సంబంధం ఉందనుకున్న వారందరినీ ప్రశ్నించటం మా విధి. మా ప్రశ్నలకు లభించే సమాధానాల ద్వారా అనుమానితులను నిర్ణయించి పరిశోధన సాగిస్తాం. నేరం జరగగానే నేరస్థుడెవరో తెలిసిపోదు కదా!' మృదువుగా వివరించాడు శరత్.

'మా పాప పవిత్ర...' ఆమె కళ్ళల్లో నీళ్ళుబికాయి. 'ఇద్దరం ఉద్యోగాలు చేస్తున్నాం. అందుకని స్కూలు అవగానే క్రెచ్‌కు వెళ్తుంది తిన్నగా. మేము ఇంటికి వచ్చేసరికి రాత్రి ఏడవుతుంది. అప్పుడు ఇంటికి తెచ్చుకుంటాం. అలాగే, ఇంటికివచ్చి క్రెచ్‌కు వెళ్తే పాప రాలేదన్నారు. అప్పుడు భయం వేసింది. స్కూలు ప్రిన్సిపాల్‌కి ఫోను చేస్తే స్కూలు అవగానే వెళ్ళిపోయిందన్నారు. తెలిసినవారికి ఫోనుచేసి పోలీసు కంప్లయింట్ ఇచ్చాం. ఇంతలో ఉదయమే పోలీసులు పిలిచారు. మా పాపని మేం ఎందుకు చంపుకుంటాం? భోరున ఏడ్చిందామె.

'మీ బంధువులతో ఎవరితోనైనా కక్షలు, ఆస్తితగాదాలు... ద్వేషాలు..'

'ఏమీ లేవు' శరత్ మాట పూర్తికాకముందే అందామె.

'ఆలోచించండి. మీకు ఎవరిమీదైనా అనుమానం ఉంటే చెప్పండి' అన్నాడు శరత్.

ఆమె వెళ్ళిన తరువాత ఆమె భర్త భూషణ్ వచ్చాడు. అతడి కళ్ళు ఎర్రగా ఉన్నాయి.

'పిల్లలు బాధ్యతాకాదు, బరువూకాదు, అది దైవం మనపై ఉంచిన విశ్వాసం. కాబట్టి పిల్లపుట్టగానే ఉద్యోగం మానేయమన్నాను. పావని ఒప్పుకోలేదు. ఆమె నా మాట విని ఉంటే ఈ రోజీ పరిస్థితి వచ్చేది కాదు' కసిగా అన్నాడతడు.

'మీరు ఒకరినొకరు నేరస్థులుగా చేసుకోవటంవల్ల లాభంలేదు. మీకు ఎవరిమీదైనా అనుమానం ఉందా?'

తల అడ్డంగా ఊపాడతడు. 'పసిపిల్ల...అంత రాక్షసంగా వ్యవహరించటం నా ఊహకి అందటం లేదు' భోరుమన్నాడతడు. 'నాకు బ్రతకాలని లేదు..' ఏడుపు తీవ్రమైంది.

***

'బాస్..తల్లిదండ్రులను అనుమానించేందుకు ఏమీలేదు. బంధువుల వివరాలు సేకరించి, వారి కదలికలన్నీ గమనించాను. అనుమానించేందుకు ఎలాంటి ఆస్కారం లేదు. సో డెడ్ ఎండ్ చేరుకున్నట్టే' అన్నాడు రాము.

రామువైపు చూశాడు శరత్.

'ఇది తల్లిదండ్రుల పని, బంధువుల పని కాకపోతే చాలా గంభీరమైన సమస్య. ఎందుకంటే ఎలాంటి కారణం లేకుండా పసిపిల్లను చంపినవాడు, మానసికరోగై ఉంటాడు. అలాంటి మానసికరోగి ఒక హత్యతో ఆగడు. మరో పసిపాప వాడికి బలయ్యేలోగా మనం వాణ్ణి వెతికి పట్టుకోవాల్సి ఉంటుంది' అన్నాడు శరత్ ఆలోచిస్తూ.

శరత్ మాట పూర్తయ్యేసరికి ఓ నడి వయసు వ్యక్తి గదిలోకి వచ్చాడు.

'సార్... నేను డ్రైవర్‌ను సార్. స్కూలు అయిన తరువాత పాపను క్రెచ్ దగ్గర దింపుతాను రోజూ. ఆ రోజు పాప నా వ్యాన్ ఎక్కలేదు సార్. అందరూ వచ్చేవరకూ చూసి పాప రాకపోవటంతో 'పాప ఆ రోజు స్కూలుకి రాలేదనుకున్నాను. వెళ్ళిపోయాను'.

శరత్ అతణ్ణి పరిశీలనగా చూశాడు.

'పాప వచ్చిందో, రాలేదో ఫోన్ చేసి ఓసారి కనుక్కుంటారుగా, కనుక్కోలేదా?'

'లేద్సార్, అదే నేనుచేసిన పొరపాటు. ఆ రోజు సెల్ ఇంట్లో మరచిపోయాను. ప్రతిరోజూ అందరికన్నా ముందు వచ్చేది పాప' అతడి కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

ఇంతలో ప్రిన్సిపాల్ వచ్చాడు.

'మీరు స్కూలు వదిలిన తరువాత పిల్లల్ని బస్సు ఎక్కించారా?' సూటిగా అడిగాడు శరత్.

ప్రిన్సిపాల్ తలవంచుకున్నాడు. 'కొత్తల్లో టీచర్లు దగ్గర ఉండి ఎక్కిస్తారు. కానీ అలవాటైన తరువాత, పిల్లలు వాళ్ళంతట వాళ్ళే బస్సు గుర్తుపట్టి ఎక్కుతారు. అందుకని అలసత్వం వహించారు. ఇప్పుడు ప్రతిస్టూడెంట్‌ని వ్యాన్ ఎక్కించే బాధ్యత టీచర్‌దేనని నోటీసు పంపించాను' చెప్పాడతడు.

శరత్ వాళ్ళని వెళ్ళిపొమ్మన్నాడు. వాళ్ళు వెళ్ళిన తరువాత రాము వైపు తిరిగాడు.

'పాప స్కూలు వదిలిన తరువాత వ్యాన్ ఎక్కలేదు. అంటే, స్కూలు పూర్తయినప్పటినుంచి వ్యాన్ బయలుదేరే మధ్య సమయంలో అదృశ్యమైంది'.

దిగ్గున లేచాడు శరత్. 'పద మరోసారి స్కూలును పరిశీలిద్దాం' అన్నాడు.

**చిన్న పాప హత్యకు గురైంది. పాపను ఎక్కడో చంపి తెచ్చి స్కూలు ఆవరణలో పడేశారు. చూడగానే ఆ విషయం తెలుస్తోంది. డిటెక్టివ్ శరత్ పాప శవాన్ని చాలా జాగ్రత్తగా పరిశీలించాడు. శవాన్ని రెండోవైపు తిప్పి చూశాడు. అతడి భ్రుకుటి ముడిపడింది. ఏదో బలమైన వస్తువుతో పాపను కొట్టారు. చివరకు తల్లిదండ్రులను కూడా అనుమానించాడు శరత్. ఇంతకూ ఎవరీ ఘాతుకానికి పాల్పడ్డారు? వాళ్ళకేం కావాలి?**

***

పెద్ద ఆవరణ ఉన్న స్కూలు అది. పెద్ద ఆట స్థలం, స్విమ్మింగ్ పూల్ ఉన్నాయి.

స్కూలు ఆవరణలో కుడివైపున బస్సులు బారులు తీరి ఉన్నాయి.

స్కూలు ఆవరణంతా తిరగటం ఆరంభించాడు శరత్.

పాపని ఎవరైనా ఎత్తుకుపోయి ఉంటే, అది అందరి దృష్టినీ ఆకర్షించేది. కాబట్టి పాప తనంతట తానే అతడితో వెళ్ళి ఉండాలి. కానీ తెలియనివారి వెంట స్వచ్ఛందంగా వెళ్ళటం కుదరని పని.

ఆలోచిస్తూ అంతా తిరుగుతున్న శరత్ దృష్టి స్కూలు కాంపౌండ్ గోడలో మనిషి పట్టేంత రంధ్రంపై పడింది.

స్కూలుకి ఆవల పెద్ద ఖాళీస్థలం ఉంది. దుబ్బులా పెరిగిన చెట్లున్నాయి. ఆలోచిస్తూ ఆ రంధ్రంలోంచి ఆవలివైపు వెళ్ళాడు శరత్.

ఆవలివైపు గుబురు గుబురు చెట్లున్నాయి. పొదలున్నాయి.

ఆ పొదలన్నింటినీ జాగ్రత్తగా పరిశీలిస్తూ ముందుకు సాగాడు శరత్. ఇంతలో అతడి కనుకొల కుల్లో ఏదో కదలిక కనిపించింది.

ఆగి ఆ వైపు చూశాడు.

చెట్టు కొమ్మనుంచి దారంతో వ్రేలాడుతోంది గాలిపోయిన బెలూన్.

జాగ్రత్తగా వంగి దాన్ని చూశాడు. ఆ పొదవైపు చూశాడు.

శరత్ కళ్ళు చిన్నవయ్యాయి. జాగ్రత్తగా వంగి మట్టిని పరిశీలించాడు.

అక్కడ ఘర్షణ జరిగినట్టుంది. రక్తం మరకలు ఎండి మట్టిలో కలిసి కనిపించాయి.

పొదలోకివెళ్ళి జాగ్రత్తగా చూశాడు. మద్యం బాటిల్ కనిపించింది. సిగరెట్ పీకలు కనిపించాయి.

***

'ఇవి నేరస్థుడి ఆనవాళ్ళు! అతణ్ణి పట్టించే సాక్ష్యాలు కావచ్చు. డీఎన్ఏ ఏమైనా దొరుకుతుందేమో చూడు' ఫోరెన్సిక్ నిపుణుడు ఫణికి తాను ప్లాస్టిక్ కవ ర్‌లలో తెచ్చిన మట్టిని అందించాడు శరత్. మట్టిలో ఉన్న రక్తం కూడా పరిశీలించు' చెప్పాడు.

తల ఊపాడు ఫణి.

బయటకు వస్తూ రాముతో చెప్పాడు శరత్. 'రాము... ఇది ఎవడో పాతనేరస్థుడో, ఎలాంటి పనీ పాట లేని ఆవారాగాడి పనో అయి ఉంటుంది. నీ మను షులను మారువేషాల్లో స్కూలులో ఉండమను. కాంపౌండ్‌గోడకు అవతల ఎలాంటి కదలిక కనిపిం చినా, ముఖ్యంగా బెలూన్ కనిపించిన వెంటనే ఫోన్ చేయమను. నా అనుమానం ప్రకారం వాడు మొదట హత్యానేరంనుంచి తప్పించుకున్నాడు. మళ్ళీ హత్య చేయాలని ప్రయత్నిస్తాడు'.

'యెస్ బాస్' అన్నాడు రాము.

***

'ఇటీవల ఎవరైనా చిన్నపిల్లలపై అత్యాచారాలు చేసే నేరస్థులు బెయిల్‌పై విడుదలయ్యారేమో చూడు. ఇదిగో రెండువేళ్ళ ముద్రలు. డీఎన్ఏ రిపోర్టు. దీనితో ఎవరిదైనా సరిపోతుందేమో చూడు'. విజయ్‌కి చెప్పాడు శరత్.

తలఊపి డేటాబేస్‌లో ఇటీవల విడుదలైన నేర స్తుల వివరాలు చూడటం ఆరంభించాడు విజయ్.

ఇంతలో శరత్‌కి ఫోన్ వచ్చింది.

'బాస్... ఎవరో ఓ వ్యక్తి పొదలలో తాగుతున్నాడు. తాగుతూ బెలూన్ ఊదాలని ప్రయత్నిస్తున్నాడు'.

'గుడ్...వాణ్ణి మీ దృష్టిపథం నుంచి పోనీయకండి. మీరు గమనిస్తున్నట్టు వాడికి తెలియనీయకండి'.

'నరసింహ' అన్నాడు విజయ్.

ప్రశ్నార్థకంగా చూశాడు శరత్.

'నరసింహ అనే ఖైదీని విడుదలచేశాం. భార్యకు అక్రమ సంబంధం వల్ల జన్మించిన వారన్న అనుమానంతో పిల్ల లతోపాటు భార్యను కూడా నరికాడు. అంతేకాదు, పొరుగింటి పిల్లల్ని చంపబోయాడు. వాడికి ఉరిశిక్ష పడింది. అందరూ గోలచేసి అభ్యర్థిస్తే, యావజ్జీవ ఖైదు విధించారు. సత్ప్రవర్తనవల్ల శిక్షతగ్గించి ఇటీ వల వాణ్ణి విడుదల చేశారు' చెప్పాడు విజయ్.

'చలో' లేచాడు శరత్. విజయ్‌కి విషయం వివ రించాడు.

***

స్కూలు వదిలారు. టీచర్లు పిల్లలందరినీ వారు ఎక్కాల్సిన బస్సులదగ్గర వరుసలో నిలబెడుతున్నారు. పిల్లలు అరుస్తూ, ఆడుతూ గోల చేస్తున్నారు. టీచర్లు అదిలిస్తూ బెదిరిస్తూ వారిని వరుసల్లో నుంచో పెట్టేందుకు ప్రయత్నిస్తున్నారు.

వరుసలో నుంచుందిగానీ ఆ పాపకళ్ళు కాంపౌండ్ వాల్ బయట ఎగుర్తున్న ఎర్రటి బెలూన్ పైనే ఉంది.

ఆమెకు బెలూన్‌తో ఆడటం ఇష్టం. కానీ ఎంత అడిగినా అమ్మా నాన్నా ఏవేవో కొనిస్తున్నారు. కానీ బెలూన్ కొనివ్వటం లేదు.

పాప అటూఇటూ చూసింది. క్యూలైన్ వదిలి పెట్టి బెలూన్‌వైపు పరుగుతీసింది. ఎవరి హడావి డిలో వారున్న టీచర్లు ఆ పాపని గమనించలేదు. ఎవరో 'ఏయ్ ఎటూ?' అనడిగారు.

చిటికెన వేలు చూపించింది పాప. పరుగు ఆపకుండా.

గబగబావెళ్ళి కాంపౌండ్‌వాల్ రంధ్రంలోంచి ఆవైపు పాకింది. బెలూన్ అందుకునేందుకు చేయిచాపింది.

ఎవరో ఆమె చేయి అందుకుని లాగారు బలంగా.

పాప భయంతో అరవబోయింది. మరోచేత్తో ఆమె నోరు మూశాడతడు.

అవలీలగా పాపని ఎత్తుకుని పొదలోకి తీసుకెళ్ళాడు.

'మీరంతా పాప ఫలితాలు. నిలువెల్లా పాపమే. మిమ్మల్ని చంపితే ప్రపంచంలోంచి పాపం పోతుంది.' గొణుగుతూ ఓ చేత్తో పొదలో ఉన్న బ్యాట్ అందుకున్నాడు.

ఓ చేత్తో పాపను ఒత్తిపట్టి పాపని కొట్టేందుకు బ్యాట్‌ని పైకెత్తాడు. బలంగా పాపపై బ్యాటు దింప బోయాడు.

కానీ ఎత్తినబ్యాట కిందకి దిగలేదు. పొదలో ఇరుక్కున్నట్టుంది. కోపంగా దాన్ని లాగబోయాడు. రాకపోతే తిడుతూ ఆ వైపు చూశాడు.

అంతే భయంతో కొయ్యబారిపోయాడు.

అతడి బ్యాట్ పట్టుకున్నాడు శరత్. తుపాకీ గురిపెట్టి నుంచున్నాడు విజయ్.

అతడి చేతిలోంచి పాపను లాక్కున్నాడు రాము.



**–కస్తూరి మురళీకృష్ణ**
*సెల్: 98496 17392*



# ప్రయాణం 2

(రాచెల్ కలోఫ్ ఆత్మకథ)

-బాలి

సెల్: 98499 63082

"చాలా అందంగానూ, శుభ్రంగానూ ఉన్నాడే" అనుకున్నాను మనసులో. అయితే ఇలా కొట్టు ముందు అంతసేపు నిలబడడం ఏం బాగుంటి?" అందుకే "నేను తొందరగా వెళ్ళాలి" అన్నాను ముక్తసరిగా. అతడేదో జోక్ చేస్తున్నట్టు పగలబడి నవ్వి "మీకు మంచి మాంసం ఇవ్వాలనే వెతుకుతున్నా" అని ఏదో వెతుకుతున్నట్టు నటించి చివరకు ప్యాకెట్లో పెట్టి ఇచ్చాడు. పైగా నేను రోడ్డు మీదకు వచ్చి నాలుగడుగులు వేసి వెనక్కి తిరిగి చూసేసరికి షాపు గుమ్మం దిగి నన్నే చూస్తున్నాడు. నాకు నవ్వు వచ్చింది. నా మనసు ఏదోలా అయిపోయింది. ఏదో అంటే ఏం చెప్పలేను. అందంగా ఉన్నాడు. నాకన్నా కొద్దిగా పెద్ద వయసు ఉండొచ్చు. ఒంటి మీది దుస్తులు శుభ్రంగా, అతడి ఆకారానికి తగినట్టే ఉన్నాయి. చమత్కారంగా మాట్లాడుతున్నాడు. అయితే ఏం?

నాకు అలా తలుచుకోగానే భయమేసింది. అప్పట్లో మా రష్యాదేశంలో ముఖ్యంగా మా యూదుజాతిలో మాంసం అమ్మేవారికి, బట్టలు కుట్టే టైలర్లకి, చెప్పులు కుట్టేవారికి, సంగీత కళాకారులకు ఇంకా కొన్ని వృత్తుల వారికి సంఘంలో పెద్దగా విలువ లేదు. వారి గురించి చులకనగా మాట్లాడతారు. వాళ్ళపైన లోస్టేటస్ అనే ముద్ర ఉంది. ఇక నేనెవర్ని?

పట్టెడన్నం కోసం పనిమనిషిని అయ్యుండవచ్చు!

సంఘంలో మంచి పేరు, పక్కా యూదు సంప్రదాయవాదిగా ఉన్న 'ఇదువెల్‌కెల్‌కోహిన్' గారి మనవరాలిని. ఆ అబ్బాయితో కలిసి తిరిగినా, చనువుగా మాట్లాడినా మా బంధువుల్లో ఏమన్నా ఉందా? గబగబా ఇంటి వైపు అడుగులు వేశాను. ఫలానా ఇంట్లోంచి వచ్చాను మాంసం కోసం అన్నానే గానీ నేనా ఇంట్లోని పనికత్తెననీ, పేద పిల్లననీ, దురదృష్టవంతురాలిననీ తెలియదా? నా ఒంటి మీద ఏమంత ఖరీదైన బట్టలున్నాయి? ఇప్పుడే అన్ని గదులకీ తడిగుడ్డ పెట్టి వచ్చాను కదా! పిడికెడు రుచికరమైన భోజనం దొరుకుతుందని ఇప్పుడిప్పుడే ఆశపడుతున్న దాన్ని. అది పోగొట్టుకుంటానా? ఆ కుర్రవాడు అందగాడు కావచ్చు, మరొకటి కావచ్చు. ఇక అతని గురించి ఆలోచించడానికే భయమేసింది. పరుగులాంటి నడకతో

ఇంటిగుమ్మం ఎక్కాను. మరో రెండురోజుల తరువాత ఇదే ఆర్డర్, ఆ షాపుకెళ్ళి మాంసం తేవాలని. "మంచిది చూసుకో. మొన్న తెచ్చింది బాగుందిలే! ఆ మాటే చెప్పు!" మా అత్త డబ్బులు ఇస్తూ అంది.

ఇక నేను వెళ్ళక తప్పలేదు.

షాపులో ఆ కుర్రవాడే ఉన్నాడు, చక్కటి బట్టల్లో ఫ్రెష్‌గా ఉన్నాడు. నా గుండెలు గుభేలుమన్నాయి. కలవరపడుతూనే లోపలికి అడుగు పెట్టాను. ఈ మారు ఆ కుర్రవాడి నుంచి కొత్త ప్రపోజల్. "అలా కొంత దూరం నడుస్తూ వెళదాం... వస్తారా!"

ఆ చనువుకి ఆశ్చర్యపోయాను. ఏం చెప్పాలో తోచలేదు. తలెత్తి అతడి ముఖంలోకి చూడలేను. డబ్బులున్న చేతి పిడికిలి వైపే నా దృష్టి అంతా!

అతన్ని ప్రేమిస్తున్నానేమో! అందువల్లనే అతని మాటల్ని తిరస్కరించలేకపోతున్నానా!! నా నోటంట ఏ మాటా రావడం లేదు. ఆ తరువాత నాలో నేను ఎంతో నిలదొక్కుకుని లెక్కపెట్టినట్టు మాట్లాడగలిగాను. "ఇదావెల్ వెల్ కోహిన్ గారు మా తాతగారు. ఆయన్ని చూడ్డానికి వచ్చాను. దయ చేసి మీతో అలా రాలేను."

ఇదొక పెద్ద అబద్ధం. అయితే దాన్ని అతడు నమ్మే ఉంటాడు. లేక నా నిస్సహాయతను గమనించే ఉంటాడు.

"ఇదావెల్‌వెల్ కోహిన్ గారు మీ తాతగారా?" అన్నాడు కళ్ళెగరేస్తూ.

అంతే నాకందివ్వబోతున్న మాంసం ప్యాకెట్‌ను గబుక్కున అతని చేతుల్లోంచి తీసుకొని గబగబా ఇంటి ముఖం పట్టాను. ఆ తరువాత ఆ కుర్రవాడి గురించి ఆలోచించడం మానేశాను. అయినా తీరిక ఎక్కడుంది? పనీ పనీ... ఆ గదుల్లో ధూళే ఉండదు. అయినా తడిగుడ్డ పెట్టాలి. పొడిగుడ్డల కోసం వెతుక్కోవాలి. అత్త పిల్లలతో ఎంతో వినయంగా మాట్లాడాలి. ఏమన్నా వారికి ఇబ్బంది కలిగిస్తున్నానేమో అని ముందుగానే సారీ చెప్పాలి.

అయితే ఈ మాంసం కొట్టు ప్రేమికుడు ఎలా కనుక్కున్నాడోగానీ మా తాతగారికి ఉత్తరం రాశాడు. మా తాతగారు ఆ కుర్రవాడు రాసినట్టుగానే అతన్ని కలుసుకున్నారు. ఇదంతా నాకు తరువాత తెలిసింది. ఆ కుర్రవాడు ఒక మాంసం అమ్మేవాని కొడుకు. చూడ్డానికి బాగానే ఉన్నాడు. ఆ కుర్రవాడు ఏం చెప్పాడంటే "నాలాంటి వినయ విధేయతలున్న అమ్మాయిని అంతవరకూ చూడలేదట. పైగా కన్నెత్తి గట్టిగా మాట్లాడనే లేదట. అటువంటి మంచి అమ్మాయినే తాను పెళ్ళి చేసుకోదలిచాననీ, అందువల్ల ఇద్దరి బతుకులు ఆనందంగా గడుస్తాయనీ ఇంకా గొప్ప విషయమేమంటే ఏమాత్రం కట్న కానుకలు అవసరం లేదట. మా యూదుల్లో కట్నకానుకలున్నాయి. కనీసం చెక్కదో, ఇనుముతో చేసినదో బీరువా అన్నా పెడతారు. అది అమ్మాయి బట్టలు దాచుకునేందుకు.

## జరిగిన కథ

**రాచెల్** కలోఫ్ ఉక్రెయిన్‌లో పుట్టి పెరిగింది. తరువాత అమెరికా చేరింది. ఆమె రాసుకున్న తన జీవితానుభవాల డైరీ ముప్పై సంవత్సరాల తరువాత బయటపడింది. ఆమె రాసుకున్న ఆత్మకథే ప్రయాణం. రాచెల్‌కు నాలుగేళ్ళ వయసులో తల్లి మరణించటంతో తండ్రి రెండోపెళ్ళి చేసుకుంటాడు. ఆమెకు ఒక అన్న, అక్క, తమ్ముడు ఉంటారు. సవతితల్లి గొడవపడి ఇంట్లో నుంచి వెళ్ళిపోతుంది. దాంతో తండ్రి చిన్నగా పిల్లల్ని బంధువుల పంచనచేర్చి, అమెరికా వెళ్ళిపోతాడు. రాచెల్ తాతగారింటినుంచి మేనత్త ఇంటికి పనిమనిషిగా వెళుతుంది. ఒకరోజు మాంసం తెమ్మని కొట్టు దగ్గరికి పంపుతుంది ఆమె మేనత్త. అక్కడ ఒక యువకుణ్ణి చూస్తుంది ఆమె.

ఆ తర్వాత....



ఆ కుర్రవాణ్ణి చూసి, మాట్లాడిన తరువాత మతపరమైన చాదస్తుడు, మూర్ఖుడు అయిన మా తాతగారు ఉరుములేని పిడుగులాగ ఒక ఉదయాన్నే మా అత్త దగ్గరికొచ్చాడు. ఇద్దరూ ముందుహాల్లో బల్లమీద కూర్చుని గట్టిగా మాట్లాడుకుంటున్నారు. నేను మామూలుగా నా పని నేను చేసుకుంటున్నాను.

ఆ ఉత్తరాన్ని మా అత్త ముందు పెట్టాడు.

ఆ కుర్రవాడు నా గురించి, కట్న కానుకల విషయం ఏం రాశాడో అదే చెప్పాడు మా అత్తతో. విషయం నా గురించే అయినా నన్ను న్యాయస్థానంలోలా బోను ఎక్కించలేదు. నేను మా వంశ పరువూ, ఆ రకంగా మా తాతగారి పరువూ మర్యాదా నిలబెట్టినట్టే అయ్యింది.

ఇద్దరూ చాలాసేపు మాట్లాడుకున్నారు. మా అత్త ఆ తండ్రిగారి కూతురే కాబట్టి మా వంశ మర్యాదా, మన్ననా దానివల్ల ఆ భగవంతుని కృప గురించి చెప్పుకుంటూనే మధ్య మధ్య నా పేరు ఎత్తుతున్నారు. నన్ను నేరస్థురాలిని చేస్తారేమో అనే భయంతోనూ, తట్టెడు చాకిరీతోనూ చెమట్లు పడుతుంటే తుడుచుకుంటున్నాను.

మా అత్త చేతిలో ఆ ఉత్తరం ఉంది.

ఆమె ముఖం నిర్మలంగానే ఉంది. అయితే ఇక్కడ మా అత్త గురించి రెండు ముక్కలు చెప్పుకోవాలి. ఆమె ఎంతో హుందాగా మోడ్రన్‌గా ఉంటుందని లోగడ చెప్పానుకదా! చేతల్లో కూడా అలాగే చేస్తుంది. ఆమె బయటకు వెళ్ళేటప్పుడు విగ్ పెట్టుకోదు. (మతపరమైన యూదులు ఆష్‌కెనాజిక్ యూదులు. వీరు తూర్పు మధ్య యూరప్‌లో ఉంటారు. వీరిలో ఒక తెగ వారు పెళ్ళి జరిగిన

తర్వాత క్రాఫ్ చేయించుకొని బయటకు వెళ్ళేట ప్పుడు తలకు తప్పనిసరిగా విగ్ ధరించాలి.) చదువులకోసం పిల్లలను పబ్లిక్ స్కూలుకి పంపు తుంది. (పిల్లలను కచ్చితంగా మతపరమైన స్కూల్లో చేర్చాలి) ఆమె పిల్లలు మాంసం కూరలో పాలు కలుపుకుని తింటారు. అది నిషిద్ధం. (మాంసంలో గానీ లేక మాంసం కలగ లిపిన పదార్థాల్లోగానీ పాలు, పాలతో తయా రయిన పదార్థాలు కలపకూడదు. అందులోనూ సబ్బత్ రోజున, లేక పవిత్రమైన శుక్రవారాల్లో ఇది మరీ పాటించాలి. తెల్లవారుజామున లేస్తూనే చేతులు శుభ్రంగా కడుక్కోవాలి. అందుకు పెద్ద గిన్నెలో నీళ్ళు మంచానికి దగ్గరగా పెట్టుకుంటారు)

నన్ను చూస్తోందే కానీ పల్లెత్తు మాటనలేదు. ఆ వయసులో అది సహజం అనుకుంది కాబోలు లేక ఆమె మాటలు ఆ తండ్రికి రుచించలేదు. మా తాతకే నాపై కోపం ఉన్నట్లుంది. ఆమె చేతి లోని ఆ ఉత్తరం లాక్కుని జేబులో కుక్కుకుని చరచరా వెళ్ళిపోయాడు.

ఆ మాంసం కొట్టు అందగాడు నన్ను మనః పూర్వకంగా ఆహ్వానిస్తున్నాడే అని అనుకున్న నా మూగ ప్రేమను మా తాత ఇలా ధ్వంసం చేశాడు.

అయినా నాలాంటి పేదరాలికి ప్రేమలేమిటి? పెళ్ళేమిటి? ఆ కుర్రవాడి తండ్రికి, మా తాత పెద్ద ఉత్తరం రాశాడట. మా వంశంలో పిల్లను పెళ్ళి చేసుకునే తాహతులేదనీ, భవిష్యత్తులో అటు వంటి ఆశలు పెట్టుకోవద్దనిన్నీ–

దాంతో మా మధ్య పెద్ద తెర పడింది. నేను మాంసంకొట్టుకెళ్ళి మాంసం తెచ్చే అవస్థ తప్పింది. ఆ అధ్యాయం అక్కడితో ముగిసినట్టే!

నాకు పద్దెనిమిదో సంవత్సరం వచ్చింది. నా బతుకంతా శూన్యమే. ముందు ముందు ఏం జరుగుతుందో తెలియని జీవిని (యూదుల్లో ఆడ పిల్లకు పద్దెనిమిదో ఏడు వచ్చిందంటే అదో పెద్ద వేడుకైన సంవత్సరం. వారి "లా" ప్రకారం అది సరిగ్గా ఆమెకు పెళ్ళి చేయవలసిన వయస్సు. పదిహేడవ ఏట నుండే ఆమెకు తగ్గ వరుణ్ణి వెతికి సిద్ధం చేసి ఉంచుతారు) మా నాన్న గురించి అప్పుడప్పుడు ఆలోచించేదాన్ని. ఇన్ని సంవత్సరాలు గడిచాయి. ఆయన అమెరికాగాని వెళ్ళుంటే, మమ్మల్ని తీసుకెళ్ళడా? పోనీ వీళ్ళ బతుకులు ఎలా ఉన్నాయి అని ఆలోచించాడా? కనీసం మా దగ్గరివారికన్నా ఉత్తరాలు వ్రాసి మా గురించి కనుక్కున్నాడా? ఆ ఆశా నిరాశగా కూలిపోతోందే ! ఆయన ఎక్కిన షిప్ నడి సముద్రంలో మునిగిపోయిందంటే ఇక ఆయన మాకు కనపడడు. ఓ ఏడుపు ఏడ్చి ఊరుకునే వాళ్ళం. ఇప్పుడు అది కాదే!

దగ్గర బంధువులై ఉండీ, అనాథలైన మమ్మల్ని చూసే తీరు ఇదా! అయితే నా మొర విని ఆ భగ వంతుడు మరొకలా తీర్పు ఇస్తున్నాడేమో అని పించింది.

వరుసకు మామయ్య అయ్యే ఒక వ్యక్తిని మా వాళ్ళందరూ 'గ్రేట్ అంకుల్' అని పిలుస్తుం టారు. ఆయనకు పక్క ఊర్లో చాలా ఇళ్ళు ఉన్నాయి. ఆయనకు చాలా డబ్బుంది. నలుగురిలో పరపతి ఉన్న వ్యక్తి అట. అయితే ఆయన పక్కింట్లో 'ఛాయ' అనే ఆమె భర్తతో ఉంది. ఆమె కూడా ఆయనకు బంధువు అవుతారు. అయితే ప్రస్తుతం ఛాయ ఇంట్లో ఏదో వేడుక జరుగుతోంది. అందు వల్ల చాలా మంది బంధువులూ, మిత్రులూ వారి వారి కుటుంబాలతో ఆ ఇంటికి వచ్చారు. అందరూ విందుభోజనం అయ్యాక కబుర్లు చెప్పు కుంటున్నారు. ఆ కబుర్లమధ్యలో ఛాయ వారం దరి ముందూ ఒక విషయం బయట పెట్టింది. "నాకు వరుసకు కజిన్ బ్రదర్ అయిన అబ్రహం అనే యువకుడు అమెరికాలో ఉంటున్నాడు. అతడి కింకా పెళ్ళి కాలేదు. మన బంధువులు (యూదు మతం) అయిన అమ్మాయినే అతడు వివాహం చేసుకోదలిచాడు. ఇదంతా నాకు ఉత్తరం ద్వారా తెలియపరిచాడు. మీ ఎరుకలో అటువంటి మంచి గుణగుణాలు, సంప్రదాయం గల అమ్మాయి ఉంటే చెప్పండి. మరొక ముఖ్య విషయం ఏమంటే అబ్రహం ఫొటో నా దగ్గ రుంది. ఆ అమ్మాయి ఇష్టపడితే ఆ అమ్మాయి ఫొటోను అతనికి పంపుతాను. దారి ఖర్చులూ,

**అందంగా ఉన్నాడు. చూడగానే ఎవరినైనా సరే ఇట్టే ఆకర్షిస్తాడు. అందరికీ ఎవరి ప్యాకెట్లు వాళ్ళకి ఇచ్చి పంపించేశాడు. గానీ ఆమెనలాగే నిలబెట్టాడు. అందరూ వెళ్ళిపోయాక ఆమెకు ప్యాకెట్ అందించాడు. అది తీసుకుని వడివడిగా ఇంటికి చేరుకుంది. మరోరోజు మీతో మాట్లాడాలి, కాసేపు అలా బయటకొస్తారా? అని అడిగాడు. అప్పుడామె ఏమని చెప్పింది? అతడితో బయటకు వెళ్ళిందా?**

టికెట్ ఖర్చులూ అతనే పెట్టుకుంటాడు.."

ఈ విషయం అందరూ విని, "చూద్దాం, ఇప్పుడే కదా చెప్పావు" అన్నారు ఏదో చెప్పాల న్నట్టు.

అందరూ ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళారు. ఈ విషయం ఎవరూ సీరియస్‌గా తీసుకున్నట్టు లేదు. ఛాయ దృష్టి అప్పటికే ఒక అమ్మాయి మీద ఉంది. ఆమె తండ్రి ఆ ప్రాంతంలో లోకల్ షోచాట్‌గా అధికారం పొందిన వాడు. (అంటే యూదుల కోహర్ లా ప్రకారం ఆవుని పవిత్రంగా చంపే అధికారం పొందిన వాడు. ఇక కోహర్ అంటే ఆవు తాలూకా పొట్ట, ముందు రెండుకాళ్ళు, వెనక రెండు కాళ్ళ మధ్య ఉన్న ప్రాంతం. అది ఎంతో పవిత్రమయినదీ తినదగినదీ). ఆయనకో కూతురు ఉంది. ఆమె పేరు 'రాచెల్'. నా పేరూ అదే, ఇంటి పేరు తప్ప. ఆమె తండ్రి అన్ని ఏర్పాట్లూ చేసి, అబ్రహం కూడా అ అమ్మాయి ఫొటో చూసి నచ్చిందని జవాబు రాసిన తరు వాత, ఇక అమెరికా ప్రయాణమవడమే మిగి లింది అనుకుంటుండగా, ఆ అమ్మాయి నేను అమెరికా వెళ్ళనని మొండికేసింది.

ఇప్పుడు ఈ సంగతి గ్రేట్ అంకుల్ చెవిన వేసినట్టుంది. గ్రేట్ అంకుల్ ఆలోచించి, ఆలో చించి, నన్ను మా అత్తవారింటిలో చూసి, నన్ను గొప్ప పనిమంతురాలిగా నిర్ణయించుకుని, పైగా ఆ అమ్మాయి పేరూ, ఈమె పేరూ కలిశాయే అనుకుని నా పేరును ఛాయత్తకు సూచించాడు.

అయితే ఛాయ తాను వ్యక్తిగతంగా పెళ్ళి కొడుకు అబ్రహంను ఎరిగున్నది కాబట్టి కాబోయే పెళ్ళికూతురు అతనికి అన్ని విధాలా సరిపో తుందో లేదో అని పరీక్ష పెట్టదలచింది.

గ్రేట్ అంకుల్ నన్ను ఛాయ ఇంటికి తీసుకెళ్లాడు. ఆ పరీక్ష ఏమిటో నాకు తెలియదు. అంకులన్నా చెప్పలేదు. నాకున్న దుస్తులలో శుభ్రమైనవీ, నాకు నప్పుతాయనుకున్నవీ (ఉన్నవే నాలుగు జతలు) కట్టుకుని ఆయన వెనక భయం భయంగా వెళ్ళాను. ఆమె మా కోసమే చూస్తున్న ట్లుంది. హాల్లో గుమ్మం దగ్గరే ఎదురయ్యింది. గ్రేట్ అంకుల్‌తో గలగల మాట్లాడుతూ, ఆయన



# క్వీన్ కొత్త అవతారం?

**బాలీవుడ్** క్వీన్ కంగనా కొత్త అవతారం ఎత్తబోతోంది. ఇంత వరకూ తెర మీద మెరిసిన ఈ తార ఇప్పుడు తెర వెనుక మెరవబోతోంది. తన తాజా సినిమా 'మణికర్ణిక' తరువాత నటనకు గుడ్‌బై చెప్పనున్నట్టు కంగనా చెప్పింది. స్వీయ దర్శకత్వంలో సినిమాలు నిర్మిస్తానని అంటోంది. తన నుంచి సీరియస్ మూవీలు ఆశించకూడదని, కామెడీ సినిమాలకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తానని చెబుతోంది. తన జీవితంలో ట్రాజెడీకే ఎక్కువ చోటు ఉందనీ, కామెడీ తక్కువనీ, కామెడీ విలువ తనకు తెలుసు కనుక కామెడీ సినిమాలు తీసి నవ్వులు పూయిస్తాననీ చెప్పుకొచ్చింది. కాకపోతే కామెడీ సినిమాలు తీయాలంటే సెన్సాఫ్ హ్యూమర్ ఉండాలనీ, కంగనాలో అదే లేదనీ, అలాంటప్పుడు కామెడీ సినిమాలు ఎలా తీస్తుందన్నది కొందరి అనుమానం.

వెనక తల వంచుకుని నిలబడ్డ నన్ను నఖశిఖ పర్యంతం, గుచ్చి గుచ్చి చూస్తోంది.

హాలు మధ్యకు నడిచి, ఆయనకో కుర్చీ చూపిస్తూ, తాను ఎదురుగా ఉన్న కుర్చీలో కూలబడింది. నేను గోడకు చేరబడి మధ్య మధ్యలో గోడమీది ఫొటోలవంక చూస్తున్నాను. గ్రేట్ అంకుల్ విరగబడి నవ్వుతూనే నేనెంత మంచి వంశంలోంచి వచ్చానో, మా తాతగారు ఎంత గొప్పవారో, పనీ పాటా విషయంలో ఎంత ఓపికగా చేస్తానో చెబుతున్నారు.

"ఇక్కడ గుర్రాలు కొనేవాడు గుర్రాన్ని అటూ ఇటూ నడిపి, దాని ఒంటిరంగూ, పళ్ళూ, తోకా పరిశీలిస్తుంటాడు. సరిగ్గా అలాగే ఉంది నా పని.

నన్ను అటూ ఇటూ నడిపించింది.

నా ఎత్తుని కళ్ళతోనే అంచనా కట్టి పెళ్ళికొడుకు అబ్రహం ఇంకా ఎంత ఎత్తుగా ఉంటాడో చెప్పింది. అప్పటికే లోపల కూచున్న ఫొటోగ్రాఫర్‌ని పిలిచి, నా ఫొటో తీయించింది. దాన్లో నవ్వు ముఖం వచ్చేట్టు సూచనలిచ్చింది. ఆ ఫొటోను త్వరలోనే అబ్రహాంకు పంపుతాననీ, అతను ఇష్టపడతాడనీ చెప్పింది. లోపలికి వెళ్ళి సొరుగు లాగి అబ్రహం ఫొటో తెచ్చి నాకు చూపించింది. వెనక్కు తిప్పి చూస్తే అక్కడ అతను జులై 16, 1887లో పుట్టినట్టు రాసి ఉంది. నేను ఇంకా అలా చూస్తుండగానే ఆ ఫొటోను తన చేతుల్లోకి తీసుకొని మా ఇద్దరి వయస్సు లోనూ తేడా ఎంతో నోటితో లెక్కలుకట్టి చెప్పింది.

ఆ ఫొటోలో అతను మామూలుగానే ఉన్నాడు. చారల చొక్కా, పైన ఉన్నికోటు. అన్నిటికీ చిరునవ్వే సమాధానంగా ఇస్తూ తలెత్తి ఆమెవైపు చూస్తు న్నాను కొంచెం ధైర్యంగా. మా గ్రేటర్ అంకుల్ కూడా చిన్న చిన్న మాటలతో నా గురించి చెబుతూ నవ్విస్తూనే ఉన్నాడు. ఇక ఈ పరీక్షలు అయిపోయాయి అనుకుని కొంచెం ముందుకు వంగాను. అంకుల్ కూడా కుర్చీలో నుంచి లేచి నిలబడ్డాడు. ఇక ఈ పరీక్షలు అయిపోయాయి అనుకున్నాను.

ఛాయ లేచింది. నడుముకి ఉన్న బెల్ట్ సర్దుకుంటూ అంది. "వచ్చే పవిత్ర రోజున అంటే శుక్రవారం (యూదులకు ప్రతి శుక్రవారం గొప్ప పవిత్రమైన రోజు) అంకులూ, నీవూ రావాలి సుమా" అంది.

అలాగే అని తల ఊపాను.

"నేను వెంటపెట్టుకు వస్తానుగా" అన్నాడు అంకుల్.

అయితే మరో పరీక్ష ఉందన్నమాట. నాకున్న ఈ పరిస్థితుల్లో ఈ రకమైన పరీక్షలు తప్పవనిపించింది. అయితే మా జీవితాలలో మార్పు వస్తోందంటే అది ఇంకో రకమైన నరకాన్నే మేము చవిచూస్తున్నాం. అలా కాకూడదు దేవుడా! అనుకున్నాను. అతడెవరో నాకు కాబోయే భర్త, అంత వరకే! అక్కడి పరిస్థితులు ఎలా ఉంటాయో, అతని గుణగణాలు ఏమిటో నాకు తెలియవు కదా! అయినా ఒక ఆడపిల్ల పుట్టింటిలోంచి అత్తగారింటిలో అడుగుపెడుతూనే విపరీతమైన మార్పులు చూస్తుంది. ఇప్పుడు నేను ఆ పరిస్థితులే కాదు దేశం విడిచి కొత్త దేశంలో అడుగుపెడుతున్నదాన్ని. కాబోయే భర్త ఎలాంటి వాడో, ఆ కొత్త దేశం ఎలా ఉంటుందో తెలియదు. పైగా ఇది పెద్దలు కుదురుస్తున్న సంబంధం. అంతా గాలి. గాలిలో తిరుగుతున్న నమ్మకం. అంకుల్, నేను బయటకు వచ్చాం.

వచ్చే శుక్రవారం గ్రేట్ అంకుల్‌తో ఛాయ ఇంటికి వెళ్ళాలి కదా! నాకు మంచి బట్టల్లేవు. ఉన్న ఒక్క జత నిన్న వాడేశాను. ఆలోచించి, ఉన్న వాటిల్లో మంచిదైన ఉన్ని పరికిణీ తీశాను. పైన జాకెట్టు కోసం దాచిన డబ్బుల్లోంచి వీధి చివర ఉన్న షాపులో కొత్తది కొన్నాను. రెండింటి కాంబినేషన్ బాగుందనిపించింది. తలకు చుట్టుకోవడానికి మంచి నదరైన రంగులతో పూల స్కార్ఫ్ ఉంది. ఇవన్నీ సిద్ధం చేసుకునేసరికి ఛాయ నిర్ణయించిన పవిత్ర శుక్రవారం వచ్చేసింది. గ్రేట్ అంకుల్ వచ్చాడు.

ఆయన వెంట బయలుదేరాను. మళ్ళా మామూలే! అంకుల్‌ని చూడగానే ఛాయ గలగల నవ్వుతూ జోకులు పేల్చుతూ మమ్మల్ని ఆహ్వానించింది. అయితే నాలోనే కొంచెం భయంగా ఉంది. ఈ రోజు పెట్టబోయే పరీక్ష ఏమిటా? అని. కొద్దిసేపటిలో ఆ మాటలూ, ఈ మాటలూ అయిపోయాయి. పరీక్ష మొదలయ్యింది.

మాకు కొద్ది దూరంలో పెద్ద ఎర్రరంగు దారపు ఉండ కిందపడి ఉంది. దానిలోంచి కొంత దారం చెదిరి చిక్కుపడి ఉంది. దాన్ని నేను సరిచేసి,

ఉండగా చుట్టాలి. ఈ పరీక్ష దేనికో తెలియదు. కింద పడిన దారపు ఉండనూ, ఆ పక్కనే ఉన్న దారాన్నీ చేతిలోకి తీసుకుని కొద్దిసేపటిలోనే ఆ మొత్తం దారాన్ని ఉండలా చుట్టేసి బల్లమీద పెట్టాను.

మరి రెండు ఇలాంటివే జరిగాయి.

ఛాయ చాలా ఆనందపడింది. అది నా ఓపి కనూ, మంచితనాన్నీ పరిశీలించడమట. ఆ తర వాత తెలిసింది.

నేను ఆమె పెట్టిన పరీక్షల్లో నెగ్గానని ప్రకటిం చింది. "చూశావా!" అంటూ అంకుల్ ఇంకా విరగ బడి నవ్వాడు.

నన్ను నేనే అభినందించుకున్నాను. "బ్రతికానురా దేవుడా!" అని.

నాకేదో అమెరికా వ్యక్తి భర్తగా రావాలని




కోరుకోవడం లేదు. నా జీవితంలో మార్పు కోసం రుచికరమైన రెండు బ్రెడ్ ముక్కలకోసమే ఈ తిప్పలన్నీ. అయితే ఇందులో నా ప్రమేయం ఏమీ లేకుండానే ముందుకు నెట్టబడుతున్నాను.

ఛాయ నా గుణగణాలు, రూపురేఖలు వర్ణిస్తూ అబ్రహాంకు నేనే సరితూగే భార్యనని ఉత్తరం రాసింది. అతడు సమాధానం ఇస్తూ ఛాయకు నచ్చితే అ అమ్మాయి తనకు నచ్చినట్టే నని అంటూ తన దగ్గర ప్రస్తుతం ఇరవై ఒక్క డాలర్లున్నాయని, అవే పంపుతున్నానని, మిగిలిన దారి ఖర్చుల కోసం ఎవరినన్నా అప్పు అడిగి ఆమె చేతిలో పెడితే త్వరలోనే తను ఆ డబ్బు పంపుతాననీ రాశాడు.

ఈ ఉత్తరం రెండు నెలల తరువాత వచ్చింది. ఆ దేశం వెళ్ళాలంటే ఓడ మీద వెళ్ళాలి. దాని టిక్కెట్టే ఇరవై ఒక్క డాలర్లు. ఇంకా నా పాస్‌పోర్ట్ ఖర్చులూ అవీ చాలా ఉన్నాయి. ఇవన్నీ ఎలా?

ఈ దరిద్రంలోంచి మరో దరిద్రంలోకి వెళ్ళడం లేదు కదా? కాబోయే భర్త ఆర్థిక పరిస్థితి చూస్తే అలా ఉంది. నాకు పాస్‌పోర్ట్ రావడానికి అమె రికా వెళ్ళే వీసా రావడానికి తొమ్మిది నెలలు పడు

తుందని తెలిసింది. ఇందులో సంతోషం కన్నా దుఃఖమే ఎక్కువగా ఉంది. నా చిన్న తమ్ముడినీ, అక్కనూ, అన్ననూ వదిలి వెళ్ళిపోతున్నాననీ, నా స్వార్థం నేను చూసుకుంటున్నానన్న బాధతో పాటు తిరిగి వారిని ఈ జన్మలో కలుసుకుంటానో లేదో అనే బాధ నన్ను నిలవనీయడం లేదు. పోనీ వెళ్ళి ఆ ఛాయతోనే చెబితే!

ఇంత మంచి పిల్లవు, ఇది నీకో మంచి అవ కాశం.. పైగా నిన్ను అబ్రహం ఇష్టపడ్డాడని అంటుందేమోనని భయం. ఆలోచిస్తుంటే దుఃఖం వచ్చేది. అందుకే వీలు చిక్కినప్పుడల్లా మా వాళ్ళను కలుసుకుని వెళ్ళినప్పుడు మాట కదా అని ధైర్యం చెబుతూ నాకు నేను సాంత్వన పొందే దాన్ని. "అధైర్యపడవద్దని, మన బతుకులు బాగు పడకపోవని ధైర్యం చెప్పేదాన్ని."

ఈ అమెరికా వ్యక్తి భవిష్యత్తులో నాకు కాబోయే భర్త అబ్రహం ఈ లోపల ఎవరో ఏజెం ట్‌ను కుదిర్చాడు. అతని పేరు 'బ్రెస్కోటోవస్కీ.' ఈ ఏజెంట్‌కి అమెరికావెళ్ళే షిప్పుల్లో అక్కడకు పోయేవారిని ఎక్కించడమే పని అట! నన్ను ఉక్రె యిన్ రష్యా బోర్డర్ దాటించి, పోలెండ్‌లోకి అడుగు పెట్టించడం, తిరిగి దాన్ని దాటి, జర్మనీలో అడుగు పెట్టడం, అక్కణ్నుంచి ఆ దేశం చివరలో ఉన్న హేమ్‌బర్గ్ రేవుకి తీసుకెళ్ళి అమెరికా వెళ్ళే షిప్‌లో నన్ను ఎక్కించడం. దీనికి దారి బత్తెం ఎంతవు తుందో, అసలు ప్రయాణానికి ఎన్ని రోజులు పడుతుందో, అదీ తిన్నగా సాగుతుందో లేదోనని భయం. పైగా నేను పద్దెనిమిదేళ్ళు నిండిన ఆడ పిల్లను. ఆయా ప్రదేశాలు చూసి ఎరగను. అంతా కొత్త. ఈ ఏజెంట్ ఎటువంటివాడో తెలియదు.

ఛాయ నన్ను అప్పుడప్పుడు పిలిచి ఏవన్నా విషయాలు చెప్పేది. ఒక్కోమారు నా వెంట అంకుల్ కూడా ఉండేవాడు. వారెంతో సరదాగా నన్ను నవ్విస్తూ నువ్వు అమెరికా వెళుతున్నావ్ అని చెప్పినా నేను వారితో చిన్న నవ్వు నవ్వినా, నా తమ్ముడూ, నా అక్కా, నా అన్నయ్యా కళ్ళ ముందు నిలిచేవారు.

అలా ఒక రోజున ఈ ఏజెంట్ ఖర్చులన్నీ అబ్రహామే భరిస్తాడనీ, పైగా నీకు దారి ఖర్చులకు ఈయనే కొంత డబ్బు ఇస్తాడని చెప్పింది. ఏదో మొండి ధైర్యంతో ఎప్పటిలాగే తల ఊపాను.

అయితే ఇందులో ముఖ్యమైన మరో విషయం ఉంది. నాకివ్వబోయే పాస్‌పోర్టు సంగతి. అదింకా 'రాచెల్ చవెట్జ్' పేరనే ఉంది. ఆమె ముందు వెళ్ళ వలసి ఉంది. ఆమె స్థానంలో నన్ను పంపుతు న్నారు కదా! ఆ పాస్‌పోర్ట్‌లోని మొదటిపేజీలో ఉన్న ఆమె ఫొటోను తీసేసి నా ఫొటో అతికిం చారు. అడిగితే నీ అసలు పేరు 'రాచెల్ కలోఫ్' అని కాకుండా 'రాచెల్ చవెట్జ్ అని చెప్పు అన్నారు. బాగా గుర్తు పెట్టుకో అని చెప్తున్నారు. ప్రతి క్షణం ఆ నామ జపమే చేస్తున్నాను.

రేపు ప్రయాణంలో ఏదన్నా పొరపాటు జరిగితే ఆ అధికారులు అదే ఓడలో నన్ను వెనక్కి పంపుతారు లేదా అరెస్ట్ చేస్తారు. అప్పుడు నా పరిస్థితి ఏమిటి? ఈ ఆలోచన వచ్చినప్పుడల్లా గుండెలు దడదడమంటు న్నాయి. ఈ విషయం ఛాయతో చెప్పాను.

ఆమె తేలిగ్గా తీసి పారేసింది. పైగా "నీకు అదే అసలు పరీక్ష. పోనీ నీ పేరులో ఈ మార్పులు చేర్పులు చేద్దామంటే మరికొంత సమయమూ, డబ్బు ఖర్చూ. రాచెల్ చవెట్జ్ అనే పేరు గుర్తు పెట్టుకోవడానికి ఇబ్బంది ఏమిటి?" అంది.

ఇక నేను బయలుదేరే రోజు వచ్చింది.

మా అన్నయ్య, అక్క, చిన్న తమ్ముడుతో కలిసి ఫొటో తీయించుకున్నాను. మనసు అడుగు పొరల్లో తెలియని ఆవేదన ఉన్నా పైకి హాయిగా కబుర్లు చెప్పుకున్నాం. నాన్న అమెరికాలో కనిపిస్తే గట్టిగా తిట్టమని నా చిన్న తమ్ముడు అమాయ కంగా అన్నాడు. ఆ ఫొటోను నా సంచిలో దాచు కున్నాను. నా దగ్గరున్న కొద్దిపాటి బట్టలూ సర్దు కున్నాను. దారుణమైన ఈ చలికాలంలో, ఆ సముద్ర ప్రయాణంలో ఏమి పట్టుకొని వెళ్ళాలో, ఏఏ జాగ్రత్తలు తీసుకోవాలో అస్సలు తెలియదు. అసలు నా దగ్గర అంత మంచి బట్టలు, ఉన్ని కోట్లు ఏమున్నాయి గనక?

చిన్న తలగడ, నీళ్ళ జగ్గు, రోజూ వేసుకునే బట్టలు సర్దుకున్న సంచి, ఉన్నిసాక్సులూ, భుజాల దగ్గర కొద్దిగా చిరిగిన ఓవర్‌కోటూ, కాళ్ళకు బిగు తుగా ఉండే బూట్లు ఎలాగూ ఉన్నాయి. నాకు వీడ్కోలు పలికే దశలో అందరూ సంతోషంగానే ఉన్నారు. ఒక్క నా అన్న, అక్క, తమ్ముడు తప్ప. మా చిన్నతమ్ముడి ముఖం అసలు చూడలేకపోతు న్నాను. కన్నీటితో అమాయకంగా నా రెండు చేతుల్నీ తీసుకొని, తన గుండెలకు హత్తుకుం టాడు. నా చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుం టాడు. మెడ ఎత్తి దీనంగా చూస్తుంటాడు. గుండె బద్దలవుతోంది. నాకు దుఃఖం ఆగడం లేదు. మాటల్లో వర్ణించలేని మౌనవేదన అది.

**(ఇంకా వుంది)**

## కిడ్నీలో రాళ్ళు



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

మూత్రపిండాల్లో రాళ్ళు ఏర్పడటం అనేది ఈ మధ్యకాలంలో చాలా ఎక్కువగా జరుగుతుంది. ఒక సర్వే ప్రకారం భారతదేశంలో పురుషుల్లో 10.6% మందిలో మరియు స్త్రీలలో 7.1% మందిలో ఈ సమస్యతో బాధపడుతున్నారు. దీనికి మారిన జీవనశైలి, ప్రపంచ ఆధునీకరణ, మారిన ఆహార అలవాట్లు, స్థూలకాయం వంటివి ప్రధాన కారణాలుగా భావించవచ్చు. ఇది మన శరీరం యొక్క భారీ కర్మాగారం. ఇందులో నిరంతరం రకరకాల జీవక్రియలు జరిగిపోతూనే ఉంటాయి. వీటిని బయటకు పంపించంటంలో మూడు అవయువాలు కీలకపాత్ర పోషిస్తుంటాయి. మూత్రపిండాలు, ఊపిరితిత్తులు, చర్మం ఈ మూడు ముఖ్యమైన విసర్జక అవయువాలు. మళ్ళీ వీటిలో కూడా 90% మలినాలను విసర్జించేవి మూత్రపిండాలే. మూత్రపిండాలు రక్తంలోని విషపదార్థాలను అదనంగా ఉన్న నీటిని క్రమంగా తొలగిస్తుంటాయి. మన కిడ్నీలు ప్రతీరోజు 200 లీటర్ల రక్తాన్ని వడపోస్తాయి.

నేటి ఉరుకు పరుగుల జీవితాల్లో చాలామంది సరిపడా నీళ్ళు కూడా తాగలేకపోతున్నారు. ఫలితంగా ఈ కిడ్నీ రాళ్ళతో సతమతమయ్యే వారి సంఖ్య నానాటికీ పెరిగిపోతుంది. చాలా సందర్భాల్లో ఈ రాళ్ళు చాలా చిన్నవిగా ఉంటూ మూత్రంలో విసర్జింపబడతాయి. కొన్ని సందర్భాల్లో రాళ్ళు పరిమాణం పెద్దగా ఉండటం కాని, మూత్రనాళాల్లో చిక్కుకొని తీవ్రమైన నొప్పిని కలిగిస్తాయి.

**కారణాలు:** అధిక బరువు, ద్రవపదార్థాలు తీసుకోకపోవటం. మూత్రఅవయావాల్లో వచ్చే ఇన్‌ఫెక్షన్. నీరు తగినంత తాగకపోవడం. జన్యుపరమైన ఇన్‌ఫెక్షన్‌లు. ఎక్కువగా వేడి వాతావరణంలో ఉండటం. వంశపారంపర్యం. కొన్ని రకాల మందులు వాడటం.

**లక్షణాలు:** పొత్తికడుపులో తీవ్రమైన నొప్పి, నీరసం, వికారం, తీవ్రమైన జ్వరం. విపరీతమైన చమటలు, బరువు తగ్గడం. మూత్రంలో రక్తంపడటం (దీన్ని హిమచ్యూరియా అంటారు) మూత్రంలో మంట రావటం. మూత్రంలో చీము రావడాన్ని పైయూరియా




**జాగ్రత్తలు:** నీటిని ఎక్కువగా తాగాలి, నీరుగాని ఇతర ద్రవ పదార్థాలు గాని మొత్తంగా కలిపితే రోజుకు 4 లీటర్లు తగ్గకుండా తీసుకోవాలి. కిడ్నీలో అప్పటికీ ఆక్సలేట్ రాళ్ళు ఉంటే, ఆక్సలేట్ ఉండే పదార్థాలు అంటే చాక్‌లేట్, పాలకూర, సోయా, ఎండు చిక్కుడు ధాన్యాలాంటివి తీసుకోకుడదు. కాల్షియం సిట్రేట్‌కు కిడ్నీలో రాళ్లు ఏర్పడకుండా నివారించే లక్షణం ఉంది కాబట్టి అవి శరీరానికీ అందేలా ఆహార నియమాలను పాటించడం మంచిది. కూల్‌డ్రింకులను అస్సలు తాగకూడదు.

**నిర్ధారణ పరీక్షలు:** కిడ్నీ ఎక్స్‌రే, అల్ట్రాసౌండ్ స్కాన్ & కిడ్నీ పరీక్ష, రక్తపరీక్ష, మూత్ర పరీక్ష.

**హోమియో చికిత్స:** హోమియోపతిలో శారీరక, మానసిక, లక్షణాలను పరిగణలోకి తీసుకొని ఎలాంటి సర్జరీ అవసరం లేకుండానే కిడ్నీలోరాళ్ళ పరిమాణం మరియు అవి ఏ వైపున ఏర్పడ్డాయో వాటి ఆధారంగా మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. ముఖ్యంగా బెరిబెరి వల్గరీస్, సరసపరిల్లా, కల్కేరియకార్బ్, కోలోసింత్ మందులను డాక్టర్ పర్యవేక్షణలో వాడాలి.



## సంతానలేమికి పరిష్కారాలు

**భార్యాభర్తల్లో ఇద్దరూ సంవత్సరం పాటు ఎలాంటి నిరోధక మందులూ వాడనప్పటికీ సంతానం కలగకపోతే దాన్ని 'సంతానలేమి'గా నిర్ధారించవచ్చు. కొన్నిసందర్భాల్లో కారణం ఏంటన్నది తెలుసుకోవడం సాధ్య కాదు. దాదాపు 10-20% మంది ఇలాంటి సమస్యతో బాధపడుతున్నారు. అయితే ఇక ముందు సంతానలేమితో బాధపడాల్సిన అవసరం లేదనీ, 'ఫర్టి9'లో ప్రముఖ ఫర్టిలిటీ స్పెషలిస్టు డాక్టర్ సి.జ్యోతి.**

కారణాలు తెలియని సంతానలేమిని వైద్యపరిభాషలో 'అన్ ఎక్స్ ప్లెయిన్డ్ ఇన్‌ఫెర్టిలిటీ' అంటారు. దంపతులిద్దరిలోనూ ఎటువంటిలోపం లేనప్పటికీ సంతానం కలగదు. స్త్రీలలో అండాలు క్రమంతప్ప కుండా తయారవుతూ ఉంటాయి. ఎండోమెంట్రియాసిస్ లాంటి సమస్యలేమి ఉండవు. ఫెలోపియన్‌ట్యూబులు ఆరోగ్యంగా తెరుచుకుని ఉంటాయి. పురుషుల్లోవీర్యకణాలఉత్పత్తి సాధార ణంగానే ఉంటుంది. అండోత్పత్తి సమయంలో కూడా శృంగారంలో పాల్గొంటూ ఉంటారు. పోస్ట్ కాయిటల్ పరీక్ష నార్మల్ అని వస్తుంది కానీ సంతానం మాత్రం కలగదు. **కారణాలు: వీర్యకణాల లోపం:** వీర్యకణాలు ఉండాల్సిన దానికన్నా ఎక్కువగా ఉన్నా తక్కువగా ఉన్నా సమస్యే. అంతేకాకుండా, వీర్యకణాలు అండంలోకి చొచ్చుకునిపోలేకపోవడం మరో కారణం. **ట్యూబల్ బ్లాక్:** అండోత్పత్తి సమయంలో ఫింబ్రియాలు అండాన్ని తోసుకునే ప్రక్రియలో కొన్నిసమస్యలు ఉండొచ్చు, లేదాట్యూబల్‌సీలియా సరిగాపనిచేయకపోవచ్చు.**అండోత్పత్తి లోపం:**నాణ్యతలేని, అబ్‌నార్మల్‌గాఉన్న అండాలు ఎక్కువ సంఖ్యలో ఉత్పత్తి కావడం.అండాలకు సంబంధించిన మరో కారణం ల్యుటినైజ్‌డ్ అన్‌రప్చర్డ్ పాలికల్‌సిండ్రోమ్.క్రోమోజోమ్‌లనిర్మాణం లోపాలుంటాయి. అండం ఆరోగ్యంగాఉన్నప్పటికీ అండంవిడుదలై కార్పస్ ల్యుటియమ్ ఏర్పడే ముందు అండం అందులో ఇరుక్కుపోతుంది. మైకోప్లాస్మా,కామిడియాలాంటి ఇన్ఫెక్షన్లు కూడా అన్‌ఎక్స్‌ప్లెయిన్డ్ ఇన్‌ఫెర్టిలిటీకి కారణాలు. **వ్యాధి నిరోధక శక్తి ప్రభావం:**వీర్యకణాలు లేకపోయినా, అవి చనిపోయినా అండం విడుదల కావడానికి వీర్యంపైన వ్యాధినిరోధక వ్యవస్థ వ్యతిరేక ప్రభావం చూపుతుంది. అంటే వీర్యకణాలు స్తంభింపచేయడానికి ఒకదానికొకటి అతుక్కుపోవడానికి దోహదంచేస్తుంది. మహిళల్లోఅయితే అండాలపైనకోటింగ్ ఏర్పడుతుంది.దాంతో వీర్యకణాలు వచ్చినప్పటికీఅతుక్కోవు. అండాశయంనుండి విడుదలైన తరువాత దశను ల్యూటియల్‌దశ అంటారు. ఈ దశలో కొన్ని సమస్యలు కారణం కావచ్చు. అందులో కార్పస్‌ల్యుటియల్ ప్రొజెస్టిరాన్ అనే హార్మోన్‌లను విడుదలచేస్తుంది. ఈ హార్మోన్‌ఎండో మెట్రియమ్ ఫలదీకరణంచెందిన అండాన్ని తీసుకోవడానికి సహాయపడు తుంది. కొన్నిసార్లు ఎండో మెట్రియం లోనే సమస్యఉండవచ్చు. **గర్భాశయ కారణాల వల్ల సంతానలేమి:** కొందరు స్త్రీలలో ఎండోమెట్రియంలో లోపం ఉంటుంది. పిండంగర్భాశయ గోడలకు అతుక్కో వడాన్ని కనుక్కోవడం చాలా కష్టం. కొన్ని పరీక్షలద్వారా నిర్ధారించాలి. గర్భాశయానికి సమపాళ్లలో రక్తం అందక పోవడం. ఈస్ట్రోజన్ రిసెప్టార్లు సరిగా లేకపోవడం వల్ల ఇలా జరుగుతుంది. **పరిష్కారం:** పోలికల్ నాణ్యత పెంచుతుంది. ప్రొజెస్టిరాన్ కూడా చికిత్సగా ఉపయోగపడుతుంది. దీన్ని ఇంజెక్షన్లుగా ఇవ్వవచ్చు. అసిస్టెడ్ రిప్రొడక్టివ్ టెక్నాలజీద్వారా మంచి ఫలితాలు పొందవచ్చు. ట్యూబులోపాలు, వీర్యకణాలు చొచ్చుకు పోలేక పోవడానికి ఐ.వి.ఎఫ్‌లో మంచి పరిష్కారం దొరుకుతుంది. **ఐ.యు.ఐ:** భర్త నుండి సేకరించిన వీర్యన్ని పరీక్షించిదానిలోనుంచి ఆరోగ్యంగాచురుగ్గా ఉన్నకణాలను వేరుచేసి వాటిని ఒక సన్ననిగొట్టంద్వారా స్త్రీగర్భాశయం లోకిప్రవేశపెడతారు. ఇలా ఒకనెలలో చేస్తే 15% సంతానం కలిగే అవకాశాలు ఉంటాయి. ఇలా ఆరు చక్రాల పాటు ఈ చికిత్స చేసినా ఫలితంలేకుంటే... ఐ.వి.ఎఫ్ ద్వారా ప్రయత్నించ వచ్చు. **ఇక్సీ:** స్త్రీ నుండి సేకరించిన అండాల్లోకి పురుషుని శుక్రకణాన్ని ఒక ప్రత్యేకమైన మైక్రో మానిప్యులేటర్‌సహాయం తో ప్రవేశపెట్టి ఫలదీకరణంచెందిస్తారు. వాటినితిరిగి గర్భా శయంలో పెడతారు. ఈ పద్ధతిద్వారా 40% విజయావకా శాలుంటాయి. శుక్రకణాల సంఖ్య తక్కువగా ఉన్న వారికి ఎక్కువ ఉపయోగం. **ఐ.వి.ఎఫ్:** దీన్నే టెస్ట్‌ట్యూబ్ విధానం అంటారు. ముందుగా స్త్రీనుంచి పక్వమైన అండాలను బయటకు తీసి, పురుషుడి శుక్రకణాలలో బయటే ఫలదీకరణం చెందిస్తారు. ఇలా ఏర్పడిన తొలిదశ పిండాల్లో 2-3 తిరిగి స్త్రీగర్భాశయంలో ప్రవేశపెడతారు. దీనిద్వారా 30- 35% విజయావకాశా లున్నాయి. ఫలదీకరించిన పిండాలలో గర్భాశయంలోకి ప్రవేశపెట్టగా మిగిలిన వాటిని అతి శీతల పరిస్థితుల్లో ఉంచి తరువాత ఉపయోగిస్తారు. అవసరాన్ని బట్టి అండాలను గానీ, శుక్రకణాలను గానీ దాతల నుంచి స్వీకరించివాడతారు. అందుకే సంతానం కలగటంలేదని ఏళ్ళ తరబడి బాధపడే వాళ్ళకు సరైన మార్గం, పరిష్కారం 'ఫర్టీ 9 హాస్పిటల్'.

**- డా॥ సి.జ్యోతి** ఫర్టిలిటీ స్పెషలిస్ట్
**ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం**



# నమ్మలేని నిజాలు
# సెల్ఫీ సీక్రెట్లు

**చేతిలో స్మార్ట్‌ఫోన్, సోషల్ మీడియాలో అకౌంట్.. ఈ రెండూ చాలు ప్రపంచాన్ని చుట్టేయడానికి, మనమేంటో తెలియజెప్పడానికి. చాటింగ్ చీటింగ్‌లతో కాలం గడుపుతూ మోసాలకు పాల్పడుతున్న వారు కొందరయితే, సోషల్ మీడియా అకౌంట్లతో పాపులర్ అవుతున్నవారు మరికొందరు. ఫేస్‌బుక్, ఇన్‌స్టాగ్రామ్, ట్విటర్‌లలో వేలు, లక్షల కొలదీ ఫాలోవర్స్‌ను పెంచుకుని సోషల్ మీడియా స్టార్లుగా ఎదిగేందుకు ఎందరో ప్రయత్నిస్తున్నారు. అందులో భాగంగానే సెల్ఫీలను తెగ ఉపయోగించుకుంటున్నారు. ఎంత రిస్క్ చేసైనా సరే.. ఇంతవరకూ ఎవరూ తీసుకోని రీతిలో సెల్ఫీ తీసుకుని క్రేజ్ సంపాదించుకుంటున్నారు.**



### షాకింగ్ నిజాలెన్నో..

సెల్ఫీలకు చిన్నాపెద్దా, ముసలీముతకా తేడా లేదు. వెరైటీగా సెల్ఫీ దిగామా, సోషల్ మీడియాలో పెట్టామా, లైకులతో, కామెంట్లతో, షేరింగులతో దూసుకెళ్తున్నామా? అన్నదే లెక్క. పెళ్ళి వేడుక అయినా, పుట్టిన రోజు ఫంక్షన్ అయినా, ఆఫీసులో పార్టీ అయినా.. సందర్భం ఏదైనా సరే... సమయాన్ని కూడా మర్చిపోయి సెల్ఫీలతో మునిగిపోతున్నారు. సోషల్ మీడియాలో పెట్టి మానసిక ఆనందాన్ని పొందుతున్నారు. నైల్సెన్ అనే సంస్థ ప్రత్యేకంగా సెల్ఫీల గురించే వివిధ అంశాల వారీగా సర్వే నిర్వహించింది. అందులో నమ్మలేని నిజాలెన్నో బయటపడ్డాయి. పది ప్రధాన నగరాల్లో 16 నుంచి 40 ఏళ్ల లోపు వయసున్న వారిని 1001 మందిని ఎంపిక చేసి ఈ సర్వే నిర్వహించారు. సెల్ఫీలకు ఎందుకంత క్రేజ్? రోజుకెన్ని సెల్ఫీలను తీసుకుంటారు? ఏ వయసు వారు ఎక్కువ సెల్ఫీలు తీసుకుంటారు? ఎలాంటి సందర్భాల్లో తీసుకోవడానికి ఇష్టపడుతుంటారు? ఒక్కో సెల్ఫీని ఎన్నిసార్లు తీసుకుంటారు? సోషల్ మీడియాలో సెల్ఫీలకు కనీసం ఎన్ని లైకులు, షేర్లను ఆశిస్తుంటారు? ఇలా ఒక్కో అంశం గురించి ఈ సంస్థ అన్ని వయసుల వారి నుంచి వివరాలు సేకరించింది. అన్నింటినీ క్రోడీకరించి ఈ సంస్థ వెల్లడించిన సర్వే ఫలితాలు చూసిన వారు షాక్‌కు గురయ్యారంటే అందులోని అంశాలు ఏ రీతిన ఉన్నాయో అర్థం చేసుకోవచ్చు.

### సెల్ఫీ మహారాణులు

సెల్ఫీలంటే పడిచచ్చేది యువతేనని వేరుగా చెప్పనక్కర్లేదు. ఒకప్పుడు స్వీట్ మెమొరీ కోసం సెల్ఫీలు దిగేవారు. ఇప్పుడు సంచలనం సృష్టించడం కోసం సెల్ఫీలకు ఫోజులిస్తున్నారు. ఈ సంచలనాలకు కేంద్ర బిందువుగా స్త్రీలే ఉన్నారంటే నమ్మలేరేమో! ఒకటి కాదు రెండు కాదు ఏకంగా 48 శాతం మంది స్త్రీలు సెల్ఫీల పిచ్చిలో మునిగి తేలుతున్నారని నైల్సెన్ సర్వే తేల్చిచెప్పింది. పురుషుల్లో అయితే 40 శాతం మందికి మాత్రమే సెల్ఫీలంటే మోజు అని సర్వేలో తేటతెల్లమయింది. 16 నుంచి 20 ఏళ్లలోపు యువతలో 58 శాతం మంది సెల్ఫీలను తీసుకుంటుండగా, 36 నుంచి 40 ఏళ్లలోపు వారు 23 శాతం మందే సెల్ఫీలతో కాలం గడుపుతున్నారు. అత్యధిక శాతం మంది స్నేహితులతో పార్టీలు చేసుకునే సమయాల్లోనే సెల్ఫీలు తీసుకుంటున్నట్లు తెలిసింది. ఆ తర్వాతి స్థానాల్లో ఫ్యామిలీ ఫంక్షన్లు, ప్రయాణాలు వంటివి నిలిచాయి.

### విభిన్నంగా ఉంటే చాలు

సెల్ఫీలతో సోషల్ మీడియాలో హల్‌చల్ చేయడానికి విభిన్న ప్రయోగాలు చేస్తున్నారు నెటిజన్లు. ఫేస్‌బుక్కులో ఫేసుకు క్రేజ్‌ను రప్పించుకునేందుకు నానా తంటాలు పడుతున్నారు. ప్రముఖ ప్రాంతాల ముందు సెల్ఫీలు తీసుకుని ఫేస్‌బుక్, ట్విటర్, ఇన్‌స్టాగ్రామ్‌లో పెడుతున్న వారు దాదాపు 61 శాతం మంది ఉన్నారని సర్వేల్లో తేలింది. తాజ్‌మహల్ అయినా, తాజాతాజా కూరగాయలు పండుతున్న పొలం అయినా విభిన్నంగా ఉంటే చాలు ఎక్కడైనా సరే సెల్ఫీలు దిగుతున్నారు. కొండలెక్కుతున్నారు...

కోనలు పట్టుకు తిరుగుతున్నారు.. మంచు గడ్డలను సైతం లెక్కచేయకుండా సెల్ఫీలు దిగి పరవశించిపో తున్నారు. వీరిలో దాదాపు 89 శాతం మంది ఫ్యామిలీ, ఫ్రెండ్స్‌తో గ్రూపు సెల్ఫీలు దిగుతున్నా రని తేలింది. సోలోగా సెల్ఫీలు దిగుతున్నవారు 66 శాతం ఉన్నారు. గ్రూపు సెల్ఫీలు దిగుతున్నప్పుడు ఒకే ఫోజును కనీసం మూడు సార్లు క్లిక్ మనిపిస్తు న్నారట. సరిగా రాలేదనో, రాదనే భయంతోనో, తాము సరిగా ఎక్స్‌ప్రెషన్స్ ఇవ్వలేదనో.. కర్ణుడి చావుకు నూరు కారణాలన్నట్లు, ఒక్కో క్లిక్కుకు ఒక్కో కారణ మన్నమాట.

### ఫేస్‌బుక్కు... ఫేమస్ లాజిక్కు

సోషల్ మీడియా... ప్రపంచాన్ని కుగ్రామంగా మార్చేసిన సంధానకర్త. ఎక్కడో ఉన్న ఓ వ్యక్తి ఫేస్‌బుక్‌లో ఫోటో అప్‌లోడ్ చేస్తే చాలు.. ప్రపంచంలో ఏ మారుమూల ప్రాంతంలో ఉన్నా సరే... ఇంటర్నెట్ ఉంటే చాలు ఓ లైక్ పడేయొచ్చు. ఓ కామెంట్ రాయొచ్చు. నచ్చితే షేర్ చేయొచ్చు. సెల్ఫీలు దిగుతున్న వారిలో 82 శాతం మంది ఫేస్‌బుక్‌లో వాటిని పోస్ట్ చేస్తున్నారని సర్వేలో తేటతెల్లమయింది. వాటిలో సోలో సెల్ఫీలే ఎక్కువగా ఉన్నాయట. సాధారణంగా యూజర్లు ఎక్కువగా సోలో సెల్ఫీలనే సోషల్ మీడియాలో పోస్ట్ చేసేందుకు మొగ్గు చూపుతున్నారట. అయితే ఇలా సెల్ఫీలను ఫేస్‌బుక్, ఇన్‌స్టాగ్రామ్‌లలో పోస్ట్ చేయడమే కాకుండా వాటికి వచ్చే లైకుల కోసం పది నిమిషాలకు ఒకసారి నోటిఫికేషన్స్ చూస్తున్నారనే అంశం సర్వే చేసిన వారిని షాక్‌కి గురిచేసింది. సెల్ఫీలకు వచ్చే లైకుల కోసం కళ్లు కాయలు కాచేలా ఎదురుచూస్తుంటామని మెజారిటీ నెటిజన్లు తేల్చిచెప్పేశారు. కొందరు యువతులు అయితే.. తెలిసిన వారికి ఫోన్లు చేసి మరీ లైకులు కొట్టించుకుంటున్నారట. లైకు కొట్టకపోతే స్నేహితులతో కూడా గొడవపడిన సందర్భాలు ఉన్నాయని కొందరు పేర్కొనడం ఆశ్చర్యానికి గురిచేసిందంటూ సర్వే పేర్కొంది.

### వింత చేష్టలు.. అనుకోని ప్రమాదాలు

సెల్ఫీలకు సోషల్ మీడియాలో క్రేజ్ వచ్చేందుకు చాలామంది నెటిజన్లు విపరీత పోకడలు పోతున్నారు. చనిపోయిన వ్యక్తితో ఫోటోకు పోజిచ్చి, శవంతో సెల్ఫీ అంటూ ఫేస్‌బుక్‌లో పోస్ట్ చేస్తున్నారంటే సెల్ఫీ పిచ్చి ఎందాకా వెళ్లిందో అర్థం చేసుకోవచ్చు. కదులుతున్న రైలుపై సెల్ఫీ దిగాలని ప్రయత్నించి కరెంటు తీగలకు తగిలి బూడిదయిపోయిన ఓ వ్యక్తి వీడియో కూడా సోషల్ మీడియాలో కలకలం రేపిన సంగతి తెలిసిందే. పడుకుంటున్నానంటూ ఫోటోలు, 'ఇప్పుడే నిద్రలేచాను ఫ్రెండ్స్' అంటూ పక్కపైనుంచి లేవకుండానే సెల్ఫీలు.. ఆఫీసులోనూ, పొలాల్లోనూ, ప్రయాణాలు చేస్తూ.. నిత్యం సెల్ఫీలతో తమ దినచర్యను ప్రపంచానికి చెబుతున్నారు చాలామంది 'సెల్ఫీ'ష్‌లు. నిత్యం సెల్ఫీ పిచ్చిలో మునిగిపోయి మమతానురాగాలకు దూరమవుతున్నారు. ప్రమాదాలను కొని తెచ్చుకుంటున్నారు. ఇలాంటి సెల్ఫీ అప్‌డేట్ల వల్ల ప్రయాణాల్లో ఉన్న వారి ఇళ్లలో దొంగతనాలు జరిగిన ఉదంతాలు కూడా లేకపోలేదు.

### మానసిక సమస్యలు

ఎడాపెడా సెల్ఫీలు తీసుకోవడం వల్ల చర్మసంబంధిత వ్యాధులు వస్తాయని వైద్యులు హెచ్చరిస్తున్నారు. స్మార్ట్‌ఫోన్ నుంచి వచ్చే రేడియేషన్ వల్ల చర్మం ముడతలు పడుతుందనీ, తద్వారా లేత వయసులోనే వృద్ధుల్లా కనిపిస్తారని చెబుతున్నారు. చర్మ కాంతికి దోహదపడే డీఎన్‌ఏలపై స్మార్ట్‌ఫోన్ నుంచి విడుదలయ్యే ఎలక్ట్రోమాగ్నటిక్ తరంగాలు ప్రభావం చూపుతాయని యూకేలోని లినియా స్కిన్ క్లినిక్ డైరెక్టర్ సిమోన్ జోయాకియో ఓ పరిశోధనలో కనుగొన్నారు. దీంతోపాటు సెల్ఫీలకు తగిన షేర్లు, కామెంట్లు, లైకులు రాకుంటే డిప్రెషన్‌కి లోనవుతున్నారని, మానసిక ఆరోగ్యం కూడా దెబ్బతింటుందని వైద్యులు హెచ్చరిస్తున్నారు. నిద్రలేకుండా సోషల్ మీడియాలోనే గడుపుతూ, ఆరోగ్యాన్ని అన్ని రకాలుగా దెబ్బతీసుకుంటున్నవారి సంఖ్య కోకొల్లలని చెబుతున్నారు.

—కె.హసాన్

kandula.hassan@gmail.com

## సెల్ఫీ క్రేజ్

ఈ సెల్ఫీ క్రేజ్ పురుషుల కంటే స్త్రీలకే ఎక్కువ ఉందని సర్వేల్లో తేలింది. మగాళ్ల కంటే మహిళలే సెల్ఫీలను ఎక్కువగా తీసుకుంటున్నారట. మార్కెట్లోకి హై క్వాలిటీ ఫ్రంట్ కెమెరా స్మార్ట్‌ఫోన్ వచ్చిందంటే చాలు... దాన్ని కొనేందుకు మొగ్గు చూపేవారిలో సెల్ఫీ ప్రియులు.. అందులోనూ స్త్రీలే ఎక్కువున్నారట. సెల్ఫీ క్రేజ్ స్త్రీలలో ఏ రేంజ్‌లో ఉందో తెలియాలంటే ఈ యువతి ఫోటో చూస్తే ఇట్టే అర్థం అవుతుంది.

ఈ ఫోటోలోని యువతిని చూశారా? అత్యంత ప్రమాదకర రీతిలో ఆమె తీసుకున్న సెల్ఫీ ఇది. ఒకటి కాదు రెండు కాదు ఏకంగా 1004 అడుగుల ఎత్తయిన భవనంపై నుంచి దిగిన సెల్ఫీ ఇది. దుబాయ్‌లోని కయాన్ టవర్ ఎక్కి, మామూలుగా ఫోటో దిగితే స్పెషల్ ఏముందని అనుకుందేమో, ఇలా సెల్ఫీ దిగి తన ఫాలోవర్స్‌ను భయ భ్రాంతులకు గురిచేసింది. రష్యాకు చెందిన విక్టోరియా ఒడిన్ట్‌కోవా అనే ఈ యువతి సెల్ఫీలతో తన డైన శైలిలో దూసుకెళ్తోంది. స్వతహాగా మోడల్ అయిన ఈ 23 ఏళ్ల యువతి తన సహాయకులతో ప్రమాదకర ప్రదేశాల్లో సెల్ఫీలు దిగుతూ సోషల్ మీడియాలో పోస్ట్ చేస్తుంటుంది. ఆమెకు 37 లక్షల మంది ఫాలోవర్స్ ఉన్నారంటే, ఆమె రేంజ్ ఏంటో ఇట్టే అర్థం అవుతుంది. ఈ రిస్కీ సెల్ఫీలో ఏ మాత్రం తేడా వచ్చినా ప్రాణాలతో బయటపడటం అసాధ్యమని వేరుగా చెప్పనక్కర్లేదు.



## దుమ్ము దులిపేస్తోంది



రష్యాకు చెందిన ఏంజిలా నికోల్యూ అనే మరో భామ కూడా సెల్ఫీల హొయలు పోతోంది. 'డేర్‌డెవిల్' అని ఫాలోవర్స్ అందరూ పిలుచుకునే ఈ యువతి కూడా రిస్కీ సెల్ఫీలకు పెట్టింది పేరు. ఈమె ఒక్కో సెల్ఫీని చూస్తే కళ్లు బైర్లు కమ్మాల్సిందే. సామాన్య జనం ఎక్కడానికి కూడా భయపడే భవంతుల మీదకు ఎక్కి వెరైటీ ఫోజులతో సెల్ఫీల దుమ్ము దులిపేస్తోంది. ఏంజిలాకు నాలుగు లక్షల 59వేల మంది ఫాలోవర్స్ ఉన్నారు. ఈ ఇద్దరు యువతులను చూస్తే చాలు మహిళలకు సెల్ఫీలంటే ఎంతటి మోజో ఇట్టే అర్థం అవుతోంది. అయితే పాపులారిటీ కోసం ఇలా రిస్క్ చేస్తున్నా తాము ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటామని ఈ మోడల్స్ చెబుతున్నారు. వీరిలా రిస్కీ సెల్ఫీల కోసం మాత్రం ప్రయత్నించకండి.




**ప**ళ్ళికిలిస్తూ రాజేష్.
**వీడెందుకున్నాడు ఇక్కడ?**
**ఒక్క నిమిషం బుర్రంతా బ్లాంక్‌గా అయిపోయింది కావ్యకి.**
**తన పక్క సీట్ అడుగుతున్నాడు కౌంటర్‌లోని వ్యక్తిని.**
**అప్పుడు అర్థమైంది ఆమెకి.**
**వీడు కూడా వస్తున్నాడు.**
**ఎలా...? ఏం చేయాలి? అసలీ ప్రమాదమే ఊహించలేదు తను.**
**వీడితో ఎలా వేగాలి?**
**తనకి సహాయపడటానికి సీమ, రోహిణి కూడా ఉండరు.**
**దేవుడా!**
**ఏడుపొస్తోందామెకి.**
**ఏదైనా కత్తి దొరికితే అతన్ని పొడిచేయాలన్నంత కసిగా ఉంది.**

సెక్యూరిటీ చెక్ ముగించి గేట్ నంబర్ వెతుక్కుంటూ వెళ్ళి వెయిటింగ్ ఏరియాలో కూర్చుంది కావ్య.

### జరిగిన కథ

అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోవడంతో, వారి కూతురు నైరాని తన సంరక్షణలోకి తీసుకుంటాడు అక్షయ్. ఒక రోజు నైరా కనిపించకుండా పోతుంది. పోలీస్ ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. నైరా ఆచూకీ కోసం రకరకాలుగా ప్రయత్నిస్తుంటాడు అక్షయ్. ఆ ప్రయత్నాల్లో భాగంగా ఎంతోమంది చిన్నపిల్లలను కాపాడతాడు. నైరా ఆచూకీ కోసం కావ్య ఒక ఆన్‌లైన్ డిటెక్టివ్‌ను కాంటాక్ట్ చేస్తుంది. ఆఫీసులో వాళ్ళందరూ వీకెండ్ టూర్‌కి వెళతారు. అక్కడ సీమ రాజేష్‌ని ముప్పతిప్పలు పెడుతుంది. ఇంతలో అక్షయ్‌ని పోలీసులు అరెస్టు చేస్తారు. అయితే అక్షయ్‌ని అరెస్టు చేసిన డీఎస్పీ నిర్వాకాన్ని అతడికి తెలియకుండా సోషల్‌మీడియా ద్వారా అందరికీ తెలిసేలా చేస్తాడు అక్షయ్. దాంతో డీఎస్పీని ఉద్యోగం నుంచి తొలగిస్తారు. ఆఫీసులో కొత్త మార్పులు చోటుచేసుకుంటాయి. కావ్యని యూఎస్ పంపిస్తున్నట్లు చెబుతాడు రాజేష్. అక్షయ్ ఆలోచనలతో ఎయిర్‌పోర్టులోకి అడుగు పెట్టిన కావ్యకి ఓ వ్యక్తి కనిపిస్తాడు. అతన్ని చూసి షాక్ తింటుంది ఆమె. ఆ తర్వాత...

వాటర్ బాటిల్ తీసుకుని ప్రత్యక్షమయ్యాడు రాజేష్.

"నీళ్ళు కావాలా?" అందించబోయాడు.

వద్దంది కావ్య.

ఏదో తెలీని భయం అడ్డొస్తోంది కానీ చెప్పుతీసి ఎడాపెడా కొట్టబుద్ధయింది ఆమెకి. తనకి నీళ్ళు కావాలంటే తను తెచ్చుకోలేదా? వీడివ్వాలా?

పక్క సీట్‌లో కూర్చున్నాడు.

ఒక కాలు మడిచి రెండో కాలు మీద పెట్టుకుని ఊపుతున్నాడు.

కాలు తగిలేట్లుగా ఉందామెకి.

ముడుచుకుని ఒక వైపు కూర్చుంది.

వెనక్కి జారగిలబడ్డాడు.

ఒక చేయి తలకింద పెట్టుకుని రెండో చేయి ఆమె కూర్చున్న కుర్చీ పైభాగంలో వేశాడు.

ఎవరన్నా వాడిని తన పక్కన ఆ పోజ్‌లో చూస్తే ఇద్దరూ కలిసొచ్చారనుకుంటారు.

ఇక భరించలేకపోయింది.

లేచి నిలబడింది.

రాజేష్ వింతగా చూస్తుండగా ఎదురుగా ఉన్న బుక్‌షాప్‌లోకి దూరి బుక్స్ చూడటం మొదలెట్టింది. కాసేపయ్యాక చేతికందిన బుక్ కొనుక్కొచ్చి అటూ ఇటూ మనుషులుండి మధ్యలో ఒక సీట్ ఖాళీగా ఉన్న చోట వెతుక్కుని కూర్చుంది.

"అక్కడ కూర్చున్నావేమిటి?" సైగ చేశాడు రాజేష్.

"వ్యూ బాగుంది" నోటికొచ్చిన సమాధానం చెప్పింది.

'కూర్చున్నది గోడ చివరవైపు. ఒకవైపు చూస్తే గోడ, మరోవైపు తను కనబడతారు. వ్యూ బాగుందట. దొంగ మొహంది. అబద్ధాలాడుతోంది. తనను తప్పించుకోవటానికి అక్కడ కూర్చుంది. ఎక్కడికి పోతావు. ఈ ట్రిప్‌లో నీ అంతు చూస్తా' నవ్వుకున్నాడు రాజేష్.

బోర్డింగ్ మొదలైంది.

గబగబా వెళ్ళి లైన్‌లో నిలబడింది కావ్య. సీట్ నంబర్ వెతుకుతూ వెళ్తోంది.

హాండ్ లగేజ్ తన సీట్‌పై ఉన్న ఓవర్‌హెడ్ కంపార్ట్‌మెంట్‌లో పెట్టడానికి ఎత్తింది.

దూసుకొచ్చాడు రాజేష్ అందర్నీ తోసుకుంటూ.

ఆమెకి సహాయపడుతున్నట్లుగా లాక్కుని లగేజ్ తనే పైన పెట్టాడు.

విండో సీట్ సెలెక్ట్ చేసుకుందామె. లాండింగ్, టేకాఫ్ సమయాల్లో సిటీస్‌ని దగ్గర నుంచి చూడొచ్చని, మబ్బులు చూస్తూ విండోకి తల ఆనించుకుని నిద్రపోవచ్చుననుకుంది.



పక్కనే సర్దుకుని కూర్చుంటున్న రాజేష్‌ని చూసి ఆమెకి కిటికీ పగలగొట్టి దూకేయాలనిపించింది.

మొహం మాడ్చుకుని, ముడుచుకుని, చెవులకు హెడ్‌ఫోన్స్ పెట్టుకుని, సీట్‌కి ఉన్న టీవీలో ఛానల్స్ మారుస్తూ కూర్చుంది.

సడన్‌గా గుర్తొచ్చిందామెకి.

వీడి టెన్షన్‌లో అక్షయ్ గుర్తు రాలేదు. గడచిన రెండు గంటల్లో ఎలర్జీ, కసి తప్ప తనలో మరే ఎమోషన్ లేదు వీడిని చూసేసరికి.

బాత్‌రూమ్‌కి లేవాలన్నా రాజేష్‌ని, అతని పక్కనతన్ని దాటుకుని వెళ్ళాలామె. విండోసీట్ తీసుకున్నందుకు తనని తనే తిట్టుకుంది. అయిల్ అయితే కొంతలో కొంత బెటర్‌గా ఉండేది.

నిద్ర పోతున్నట్లు నటిస్తూ భుజం తగిలించటానికి ప్రయత్నిస్తున్నాడు.

బాత్‌రూమ్‌కి లేచి అతన్ని దాటుకుని బయట పడ్డాకే ఆమెకి ఊపిరాడినట్లుగా అనిపించింది. బాత్రూమ్ బయట వెయిట్ చేస్తుండగా యథాలాపంగా ముందుకి చూస్తున్న ఆమెకి కనబడిందా సీన్.

విండో సీట్ కోసం ఒకామె విండో సీట్ అతన్ని తొక్కేసినంత పనిచేస్తూ ఎగబడి బయటికి చూస్తోంది. వెంటనే ఐడియా వచ్చింది కావ్యకి.

"కావ్యా, నీకూ తెలివి ఉంది. శభాష్" తన భుజం తనే తట్టుకుంది.

వెళ్ళి ఆమెకి తన సీట్ ఆఫర్ చేసింది కావ్య.

విండో సీట్ అనేసరికి ఎగిరి గంతేసి లేచిందామె.

రాజేష్ ఇంకా నిద్ర నటిస్తున్నాడు.

***

కావ్య ఆమె సీట్‌లో కూర్చుంది. ఆమె వెళ్ళి కావ్య సీట్‌లో కూర్చున్న కాసేపటికే పెద్ద గొడవ జరిగింది. రాజేష్ కావ్య అనుకుని ఆమె మీద చేయి వేసినట్లున్నాడు... చెడామడా తిట్టి కొట్టినంత పని చేసింది. ఈ గొడవంతా ఎవరో సెల్‌ఫోన్ కెమెరాతో వీడియో తీయడం చూసి తల పట్టుకున్నాడు రాజేష్.

సెల్‌ఫోన్లు అబ్యూజ్ చేస్తున్నారు జనాలు. ప్రతి దానికీ వీడియో తీయటం, సోషల్ మీడియాలో పెట్టడం, లేకపోతే సెల్ఫీలు తీసుకోవటం. అసలు ఫోన్లు మాట్లాడుకోవటానికా? ఫోటోలు, వీడియోల కోసమా?

వాట్సాప్, అందులోనూ గ్రూప్స్ వచ్చాక చచ్చేంత చావుగా ఉంది. క్షణాల్లో ఒక గ్రూప్ నుంచి మరొక గ్రూప్‌కి వెళ్తూ గంటలో ప్రపంచమంతా వెళ్తాయి.

రాజేష్ మొహం చూసి కావ్యకి ఎగిరి గంతులేయాలనిపిస్తోంది.

మనసులోనే పండగ చేసుకుందామె.

***

స్కాట్స్‌డేల్ ఎయిర్‌పోర్ట్‌లో లాండ్ అయ్యారు.

అక్కడ నుంచి ఒకే కాబ్‌లో హోటల్‌కి వెళ్ళారు. ఒకేచోట రూమ్స్ బుక్ చేశారట. ఫ్లయిట్‌లో జరిగిన అవమానంతో తలెత్తుకోలేకుండా ఉన్నాడు రాజేష్. దారి పొడుగునా మౌనంగా ఉన్నాడు. అయితే అది తాత్కాలికమే అనీ, మళ్ళీ మొదలెడతాడనీ కావ్యకి అనుమానంగా ఉంది.

ఒకే ఫ్లోర్‌లో రూమ్స్ ఇచ్చారు హోటల్ వాళ్ళు.

తిట్టుకుంటూ లోపలికొచ్చి లాక్ చేసుకుంది కావ్య.

స్నానం చేసి ల్యాప్‌టాప్ ఓపెన్ చేయగానే ఫోన్ మోగటం మొదలెట్టింది.

తన రూమ్‌కి ఎవరు ఫోన్ చేస్తారు?

"డిన్నర్‌కి వెళ్దామా?" రాజేష్ అడుగుతున్నాడు ఫోన్లో.

"నేను తినను. యూ కారీ ఆన్" చెప్పి పెట్టేసిందామె.

రాత్రవుతోంది.

వైఫై పాస్‌వర్డ్ ఎంటర్‌చేసి ఫోన్లో ఇంటర్‌నెట్ కనెక్ట్ చేసింది.

చేరినట్లు ఇంట్లో వారికి మెసేజ్ చేసింది.

రోహిణి ఆన్‌లైన్ కనబడుతోంది.

ఆమెని పింగ్ చేసింది.

ఖాళీగా ఉన్నట్లుంది. వెంటనే చాటింగ్ మొదలెట్టిందామె.

"చేరావా? ఎట్లా ఉంది యు.ఎస్?"



"చేరాను. యు.ఎస్. ఏమో కానీ రాజేష్ కూడా వచ్చాడు" చెప్పింది కావ్య.

ఖంగు తిన్నది రోహిణి.

వెధవ ఇందుకేనన్న మాట తనని పంపకుండా కావ్యను పంపాడు.

"భయంగా ఉంది" అంది కావ్య.

"వాడి బొంద. అది యు.ఎస్. ఇక్కడ నడిచినట్లు అక్కడ నడవదు. ఒక్క ఫోన్‌కాల్ చేశావంటే పోలీసులు నిమిషాల్లో వాలతారట. 911కి ఫోన్‌చేయి ఏమైనా అవసరమైతే" చెప్పింది రోహిణి.

"సరే. ఫ్లయిట్‌లో ఒకావిడ రాజేష్‌ని ఉతికి ఆరేసింది తెలుసా?" సంబరంగా చెప్పింది కావ్య.

మొత్తం విన్నాక మెచ్చుకుంది రోహిణి.

"ఫర్వాలేదు. నీకు కూడా సర్వైవల్ టెక్నిక్స్ వచ్చేశాయి".

రూమ్‌కే డిన్నర్ ఆర్డర్ చేసుకుంది కావ్య.

తిని కాసేపు టీవీ చూసింది.

మళ్ళీ ఫోన్ రింగ్ అవటం మొదలైంది. కాసేపు మోగి ఆగిపోయింది.

"నిజంగానే 911 పనిచేస్తుందా? అందరూ చెప్పుకుంటారు కానీ నిజంగా అవసరం పడినప్పుడు అది వర్క్ అవకపోతే?" అనుమానం మొదలయింది కావ్యకి.

ఒకసారి ప్రయత్నించి చూస్తే? ఎంగేజ్ వస్తుందా? అసలు నంబర్ పని చేస్తుందో, లేదో తెలుస్తుంది అనుకుంటూ ఫోన్ తీసి 911 డయల్ చేసింది.

రెండో రింగ్‌కే ఎత్తినట్లున్నారు.

"హలో వాటీజ్ యువర్ ఎమర్జెన్సీ?" అడుగుతున్నదొక గొంతు.

"పని చేస్తోంది" సంతోషపడింది కావ్య.

హ్యాపీగా బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది.

మర్నాడు ఆఫీసుకి వెళ్ళటానికి కావలసిన సామగ్రి రెడీగా పెట్టుకుని బయటికొచ్చింది.

తలుపు బద్దలు కొడుతున్న శబ్దం.

రాజేష్ గాడేమో!

కోపంగా డోర్‌కి ఉన్న వ్యూ మిర్రర్‌లో నుంచి బయటికి చూసింది. లైట్ బ్లూ షర్ట్‌లు, డార్క్ బ్లూ పాంట్లలో పోలీసుల్లా కనబడుతున్నారు.

పోలీసులెందుకు వచ్చారు?

ఆందోళనగా డోర్ ఓపెన్ చేసింది.

లోపలికి చొరబడి మొత్తం చెక్ చేశారు.

"ఈజ్ ఎవ్రీథింగ్ ఓకే? ఆర్ యూ ఆల్‌రైట్?" అయోమయంగా చూస్తున్న కావ్యని అడుగుతున్నారు.

తలూపింది కావ్య.

తలుపులు పగలగొట్టి రక్షించవలసిన కష్టమే మొచ్చింది తనకు? ఆలోచిస్తుండగా అడిగారు వాళ్ళు.

"911కి ఫోన్ చేశావు కదా! ఏమిటి ఎమర్జెన్సీ?"

అప్పటికి కానీ ఆమెకి బుర్రలో లైట్ వెలగలేదు.

ఓహో! అందుకని వచ్చారా? అయితే నంబర్ నిజంగానే పని చేస్తోంది.

"పని చేస్తుందో, లేదో అని ట్రై చేసి చూశాను" కళ్ళు తృప్తిగా మెరుస్తుండగా చెప్పింది.

తర్వాత చచ్చేన్ని చివాట్లు తిన్నదామె వాళ్ళతో.

ఫోన్ చేయగానే, జవాబివ్వటానికి ముందే వాళ్ళు సంసిద్ధమై పోతారట. లాండ్‌లైన్ అయితే నంబర్‌కి రిజిస్టర్ అయిన అడ్రస్‌ని బట్టి, సెల్‌ఫోన్ అయితే సెల్‌టవర్స్ డంప్‌ని బట్టి వాళ్ళ లొకేషన్‌ని కనుక్కుంటారు. మరుక్షణం పోలీసులు, మెడికల్ సిబ్బంది ఎమర్జెన్సీ అవసరాన్ని బట్టి బయలుదేరిపోతారు ఆ ప్రదేశానికి. సగటున తమ జీవితకాలంలో కనీసం రెండుసార్లు 911కి కాల్ చేస్తారట అమెరికన్లు.

"నీవు టెస్టింగ్ కోసం చేసిన పనివల్ల, నిజంగా సహాయం అవసరమైన వాళ్ళకి మా సహాయం లేట్ అవ్వచ్చు. ఇంకెప్పుడూ ఇలాంటి పనులు చేయకు?" గట్టిగా వార్నింగ్ ఇచ్చారామెకి.

బిక్కమొహం వేసుకుని విన్నది కావ్య.

వాళ్ళకు 'సారీ' చెప్పింది.

పోలీసులు వెళ్ళిపోయాక ఆలోచనలో పడింది కావ్య.

టెస్టింగ్ కోసం చేయొద్దన్నారా ఫోన్? తనని 911కి ఇంకెప్పుడూ ఫోన్ చేయవద్దన్నారా?

***

మర్నాడు బ్రేక్‌ఫాస్ట్ దగ్గర కనబడ్డాడు రాజేష్. కావ్య ఎంత అవాయిడ్ చేయాలని చూసినా

**సపోర్ట్ టీమ్‌కి అవసరమైన సలహాలిస్తుండగా, అనుకోకుండా కావ్య దృష్టి ఎదురుగా ఉన్న స్క్రీన్‌పై పడింది. ఆశ్చర్యపోయింది. నైరా పేరు కనబడుతోంది అక్కడ. ఎలాగైనా వివరాలు సేకరిద్దామని అనుకున్నదే తడవు, డేటాబేస్ ఓపెన్ చేసి చూసి, అన్నీ చకచకా ఫోటోలు తీసింది. నైరా వివరాలు ఏమయినా తెలిశాయా? ఆ తరువాత కావ్య ఏంచేసింది?**

వీలుపడలేదు. వచ్చి ఆమె కూర్చున్న టేబుల్ వద్ద కూర్చొని మాటలు కలిపాడు.

హోటల్‌కి దగ్గరలోనే ఆఫీసు ఉండటంతో రిసెప్షన్‌లో డైరెక్షన్స్ కనుక్కుని నడుచుకుంటూ వెళ్ళారు. ఆఫీస్‌లో మళ్ళీ రిసెప్షన్ డెస్క్ దగ్గర వెయిట్ చేయించారు. కాసేపయ్యాక కావ్యనీ, రాజేష్‌నీ రిసీవ్ చేసుకోవటానికి ఇద్దరు వ్యక్తులొచ్చారు. వాళ్ళతో మాట్లాడాక కావ్యకీ, రాజేష్‌కీ టెంపరరీ ఆక్సెస్ బాడ్జెస్ ఇచ్చారు.

ఈ మొత్తం ప్రక్రియలో కావ్యకి సంతోషాన్నీ, రాజేష్‌కి కష్టాన్నీ కలిగించిన విషయం ఇద్దరూ చెరొక బిల్డింగ్ నుంచీ వర్క్ చేయాల్సి రావటం. పైగా రాజేష్ వెళ్ళవలసిన బిల్డింగ్ అక్కడికి రెండు మైళ్ళట. ఒక బిల్డింగ్‌కి ఇచ్చిన ఆక్సెస్ మరో బిల్డింగ్‌కి పని చేయదు.

ఆ రోజంతా అక్కడ టీమ్‌కి నాలెడ్జ్ ట్రాన్స్‌ఫర్ అనీ, కొత్త రిక్వయిర్‌మెంట్స్ అనీ డిస్కషన్ సరిపోయింది.

***

మర్నాడు సపోర్ట్ టీమ్‌కి అవసరమైన సలహాలిస్తూ బగ్ ఫిక్సెస్ చేయిస్తుండగా అనుకోకుండా కనబడింది కావ్యకి.

షాక్‌కి లోనయిందామె.

ఇది నిజమేనా?

ప్రొడక్షన్ డేటాబేస్ అది.

నైరా పేరు కనబడుతోంది అక్కడ. కాస్త అరుదైన పేరవటంతో ఆలోచనలో పడిందామె.

తనతో కూర్చుని ఇన్ఫర్మేషన్ సేకరిస్తున్న రేచెల్, టిమ్ పక్కకెళ్తే డీటెయిల్స్ చూడవచ్చు. ఎదురు చూస్తోందామె.

వాళ్ళెంతకీ కదలటం లేదు.

ప్రశ్న తర్వాత ప్రశ్న... ప్రశ్నలు వేస్తూనే ఉన్నారు.

గంటయ్యాక టిమ్ లేచి "కాఫీ?" అన్నాడు.

లేచింది రేచెల్.

"మీరు వెళ్ళండి" అంది కావ్య.

"ఓకే" భుజాలు ఎగరేసింది రేచెల్.

"ఇప్పుడు డేటాబేస్ వెతకొచ్చు" సంబరపడింది కావ్య.

అప్పుడే సర్వర్ లాక్ చేసింది రేచెల్ వెళ్ళబోతూ.



ఒళ్ళు మండింది కావ్యకి.

తనక్కడ ఉండగానే లాక్ చేయటమెందుకు? తనేమైనా వెతుకుతుందా అందులో, లేకపోతే డేటా ఏమైనా ఇండియా పట్టుకుపోతుందా? రోషంగా ఉందామెకి.

కాసేపయ్యాక టిమ్ ఒక్కడే వచ్చాడు.

రేచెల్ వేరే మీటింగ్‌కి వెళ్ళిందట.

కాసేపు పని చేసినట్లు చేశాడు. తర్వాత లేచి స్మోక్ చేసొస్తానన్నాడు.

"మహా బద్ధకస్థుడనుకుంటా" అనుకుంది కావ్య.

స్క్రీన్ లాక్ చేయకుండా వెళ్ళాడతను.

గబగబా వెతకటం మొదలెట్టింది కావ్య.

నైరా పేరు మీదున్న రికార్డ్స్ తేలిగ్గానే దొరికాయి.

ఆమె తల్లిదండ్రులు మరణిస్తే నైరాకీ, నైరాకి ఏదయినా జరిగిన పక్షంలో మరొక వ్యక్తీ బెనిఫిషియరీ నామినీలుగా ఉందందులో.

నైరా ఇంటిపేరు, తల్లిదండ్రుల పేర్లు అన్నీ మాచ్ అవుతున్నాయి. ఖచ్చితంగా ఆమె వివరాలే ఇవి. ఈసారి తన పరిశోధన తప్పయ్యే సమస్యే లేదు.

కానీ తను చెప్తే ఎవరూ నమ్మరేమో!

స్క్రీన్ షాట్స్ చూపించాలి.

స్క్రీన్ కాప్చరింగ్ డిజేబుల్ చేసినట్లున్నారు. తీయరావటం లేదు.

ఫోన్‌తో గబగబా ఫోటోలు తీసింది.

సాయంత్రం రూమ్‌కి వెళ్ళాక నైరాకి బెనిఫిషియరీగా ఉన్నతనికి సంబంధించి వివరాల కోసం ఇంటర్‌నెట్‌లో సెర్చ్ చేసింది.

లింక్‌డ్ ఇన్ చూస్తే మొన్నటివరకూ యూఎస్‌లో వర్క్ చేశాడని అర్థమవుతోంది. ఫేస్‌బుక్‌లో అప్‌లోడ్ చేసిన ఫోటోలను బట్టి చూస్తే ప్రస్తుతం ఇండియాలో ఉన్నాడనిపిస్తోంది.

ఈసారి తను సేకరించిన వాటన్నిటినీ డైరెక్ట్‌గా శ్రీకాంత్‌కి పంపింది కావ్య.

కాసేపటికి శ్రీకాంత్ నుంచీ సమాధానం వచ్చింది.

"గుడ్ ఇన్‌ఫర్మేషన్. నేను ఇన్వెస్టిగేషన్ మొదలెడతాను".

***

అప్పటికి పావుగంట నుంచీ వాదం జరుగుతోంది రోహిణి, బ్రహ్మీలకు.

"రెండు రోజులు పడుతుందంటే ఒక్కరోజులో చేయమంటారేమిటి?" మొత్తుకుంటోంది ఆమె.

"ఇంతసేపు వాదించే బదులు, పని మొదలెడితే ఈపాటికి సగం అయిపోయేది" అన్నాడు బ్రహ్మీ.

"రెండు రోజులు పట్టే పని సగం అవ్వాలంటే ఒకరోజు పడుతుంది. అంతేకానీ పావుగంటలో సగం ఎలా అవుతుంది?" కోపంగా అంది రోహిణి.

"ఇంకొకళ్ళని కూడా ఇస్తాను, కావాలంటే?"

"ప్రతి పనినీ విడగొట్టి చేయలేము. ఏం ప్రాజెక్ట్ మేనేజర్లు సర్? మీకు తెలీదు. మేము చెప్తే వినరు. తొమ్మిది నెలలు మోసి పిల్లల్ని కనాలంటే తొమ్మిది మంది ఆడవాళ్ళని పన్లో పెడితే నెలలో కనేస్తారను కుంటారు" విసుగ్గా అంది రోహిణి.

"చూడమ్మా. వర్క్ డివైడ్ చేయగలుగుతావు. నథింగ్ ఈజ్ ఇంపాసిబుల్" మొహం ప్లెజెంట్‌గా పెట్టి అన్నాడు బ్రహ్మీ.

"మనం చేయనవసరం లేని పనులన్నీ పాసిబుల్ అనిపిస్తాయి. మీరు కాదు కదా చేసేది? ఎటూ ఇంత బేరాలాడేప్పుడు ఎంత టైమ్ పడుతుందో మమ్మల్ని అడగటం దేనికి?"

"ఒక్కరోజులో అవ్వాలి. ఓకే?" ఫోనొస్తే సైగ చేస్తూ వెళ్ళిపోయాడు.

"గుర్రంతో మీ ఎస్టిమేట్లకి కమిట్ చేయించగలరేమో కానీ పని పూర్తి చేయించలేరు" కాలుతో నేలను తన్నింది రోహిణి.

లేచి బ్రహ్మీ వెనకే వెళ్ళింది రోహిణి.

ఫోన్ పెట్టేసి వెనక్కి తిరిగాడు.

"ఒక జోక్" అంది.

"ఒక్కరోజులో నేను చెప్పిన పని చేస్తానంటే వింటాను" అన్నాడు బ్రహ్మీ.

"జోక్ కాదు అనాలిసిస్!"

# మనమీదేనర్రోయ్!

సరసి





"ఏదో ఒకటి.."

"నా దారికి అడ్డం వస్తే నిన్ను చంపేస్తా అనే వాడు ఆదర్శవంతమైన ప్రాజెక్ట్ మేనేజర్.

నా దారికి అడ్డం వస్తే నువ్వు నన్ను చంపుతావు అనేవాడు ఒక మోస్తరు ప్రాజెక్ట్ మేనేజర్.

నా దారికి నేను అడ్డం వస్తే నిన్ను చంపేస్తా అనేవాడు గాడి తప్పిన ప్రాజెక్ట్ మేనేజర్.

నీ దారికి నేను అడ్డం వస్తే నిన్ను చంపుతా అనేవాడు గట్టి ప్రాజెక్ట్ మేనేజర్.

అడ్డంలో నువ్వు దారికొస్తే చంపుతా నువ్వు నేను అనేవాడు బుర్రలేని చదువురాని ప్రాజెక్ట్ మేనేజర్.

నేనే దారిని. దమ్ముంటే నా జోలికి రా అనే వాడు ప్రాజెక్ట్ మేనేజర్లలో రజనీ.

తప్పుకోండి. అందరం చచ్చిపోతాము అనే వాడు సూయిసైడల్ ప్రాజెక్ట్ మేనేజర్.

నువ్వు నన్ను చంపితే నేను నీ దారికి అడ్డం వస్తా అనేవాడు పని రాని ప్రాజెక్ట్ మేనేజర్.

దారిలో ఏమీ అడ్డం లేదు. ఎవరూ ఎవరికీ అడ్డం రారు. అంతా సజావుగా జరుగుతోంది. అనుకునే ప్రాజెక్ట్ మేనేజర్ అతి త్వరలో పెద్ద ప్రాబ్లమ్‌లో చిక్కుకోబోతున్నాడన్న మాట.

నువ్వు నన్ను చంపితే నష్టమేముంది? ఎవరు ఎవరి దారికి అడ్డం వచ్చినా పోయేదేముంది? అనుకునేవాడు బద్ధకస్థుడైన ప్రాజెక్ట్ మేనేజర్.

మనిద్దరం ఒకళ్ళ దారికి మరొకరు అడ్డం వస్తే ఎవరు ఎవరిని చంపుతారు అనేవాడు గందరగోళపు ప్రాజెక్ట్ మేనేజర్.

"నన్ను చంపేయండి. మీకూ నాకూ ఇద్దరికీ శని వదుల్తుంది అనేవాడు సగటు ప్రాజెక్ట్ మేనేజర్" ముగించింది రోహిణి.

బ్రహ్మికి బుర్ర తిరిగిపోయింది.

ఆమె ఏమంటున్నదో అర్థం కాలేదు.

వెటకారమో, ఎక్కిరిస్తోందో అర్థం కాలేదు.

"నోటిదూల తీరింది కదా! పండగ చేసుకో!" అన్నాడు కసిగా.

వెళ్తుంటే వినపడింది రోహిణికి.

"నేను చెప్పిన వర్క్ మాత్రం ఒక్కరోజులో అయిపోవాలి."

చెవులు మూసుకుందామె.

***

"ప్రతి ప్రేమకథా అందమైనదే! కానీ మనది మాత్రమే నాకు అత్యంత ప్రియమైనది" ఫోన్ బీప్‌మంది.

నవ్వుకున్నాడు హర్ష.

"నిన్ను చూశాను ఇవాళ" రిప్లయ్ ఇచ్చాడు.

"నన్నా? ఎప్పుడు?" ఆశ్చర్యంగా అంది.

"పొద్దున... మాల్‌లో".

"నేనసలు మాల్‌కి వెళ్ళలేదివాళ" చెప్పింది.

"ఇంక దాచలేవు. దొరికేశావు" అన్నాడు హర్ష.

"నేను మాల్‌కి వెళ్ళలేదంటే వినవేమిటి?" కంగారుగా అంది.

"నీకు తెలుసా? మగధీర సినిమాలో చేయి తగిలితే షాక్ కొట్టడం లాంటివి చూసి నవ్వుకునే వాడిని, ఈ రోజు నువ్వు కనబడేవరకూ"

అవతలి వ్యక్తికి నవ్వాలో, ఏడవాలో అర్థం అవుతున్నట్లు లేదు.

'నిన్ను చూడగానే నాకు అర్థమైపోయింది ఈమె నా మనిషి అనీ, చామనచాయకంటే కొద్దిగా రంగు తక్కువే ఉన్నావు. కాటుక పెట్టిన తెల్లటి కళ్ళు, వరసగా పేర్చినట్లున్న తెల్లటి పళ్ళు, నిండుగా ఉన్న కోలమొహం! భలే ఉన్నావు".

"నేనలా ఉండను" ఏడుపే తక్కువగా ఉంది అవతల.

"పొడుగాటి జుట్టుని స్ట్రెయిటెన్ చేసి తెల్లటి రబ్బర్‌బాండ్ పెట్టావు చూడు...అక్కడే పడిపోయాను".

"ఎందుకూ? కాలికి రబ్బర్‌బాండ్ తగిలా?" ఉక్రోషంగా అడిగింది.

"నాకంటే పొట్టిగానే ఉన్నావు అంత హైహీల్స్ వేసినా!" చెప్పుకుపోతున్నాడు.

"తెల్లటి డ్రస్, తెల్లటి చెప్పులు, చామన చాయలో నువ్వు. నిన్ను చూడగానే షి ఈజ్ మైన్ అనిపించింది".

"అంతా నలుపు తెలుపు కాంబినేషన్ చూసి నీకు చెస్ బోర్డ్ గుర్తొచ్చి ఉంటుంది. అందుకే అలా దగ్గర వ్యక్తని ఫీలయ్యావు. నథింగ్ రొమాంటిక్ అబౌట్ ఇట్" అందామె.

"నిజంగా నువ్వు కాదా?" అనుమానంగా అడిగాడు హర్ష.

"కాదంటుంటే!"

"దొంగ... అబద్ధాలు. అది నువ్వే. నాకు తెలుసు" అన్నాడు హర్ష.

"చెప్తే వినవా?" చిరాగ్గా అందామె.

కాసేపు ఇద్దరూ మాట్లాడుకోలేదు.

అరగంట తర్వాత మెసేజ్ వచ్చింది.

"ఎందుకు అబద్ధం చెప్పావు? ఫేస్‌బుక్ లొకేషన్ ట్రాకర్‌తో చెక్ చేస్తే నువ్వు ఈ రోజు మాల్‌కి వెళ్ళలేదని తెలిసింది".

"నువ్వెవరో చెప్తావని" నవ్వుకుంటున్నాడు అతను.

"త్వరలోనే తెలుస్తుంది. తెలియాల్సిన టైమ్ దగ్గరవుతోంది".

"టైమ్ దగ్గరవటం ఏమిటి? నీకేమీ జబ్బులు లేవుగా, ఇలాంటి స్టోరీస్‌లో సాధారణంగా జరిగేట్లు" అడిగాడు.

"నీకు నిజంగా అలాంటి అమ్మాయిలు నచ్చుతారా?" కుళ్ళు బయటపడిపోతుందామె మెసేజ్‌లో.

స్మయిలీ పంపాడు హర్ష సమాధానంగా.

**(ఇంకా వుంది)**

## తెర మీద మాత్రమే అంటోంది

*కలర్ స్వాతి తెలుగమ్మాయే అయినా ఇక్కడ కాలం కలిసిరాక కోలీవుడ్‌కి వెళ్ళిపోయింది. అక్కడ వరుస సినిమాలు చేస్తూ బిజీగా ఉంది. ఇప్పటి దాకా హోమ్లీ క్యారెక్టర్లకు మాత్రమే పరిమితమైన స్వాతి కోలీవుడ్‌లో రొమాన్స్ సినిమాలకూ ఓకే చెబుతోంది. అలా ఓకే చెప్పేడమే నేను చేసిన పెద్ద తప్పు అని స్వాతి ఇప్పుడు బాధపడుతోంది. స్వాతి కొత్త సినిమాలో హీరోతో తెగ ఇబ్బంది పడుతోంది. తెర మీదే కాకుండా బయట కూడా తనతో రొమాన్స్ చేయమని ఆ హీరోగారు స్వాతిని తెగ వేధిస్తున్నాడట! అవన్నీ తెర మీద మాత్రమే చేస్తాను తప్ప బయట చేయనని హీరోకి గట్టిగా చెప్పినా లాభం లేకుండా పోయిందని ఆమె సన్నిహితులు అంటున్నారు. ఇక నుంచి తను తన పాత జోనర్‌లో మాత్రమే సినిమాలు చేస్తాను తప్ప తన జోనర్ దాటి రానని స్వాతి దర్శకనిర్మాతలకు గట్టిగా చెప్పేస్తోందట!*



# మారిన పిలుపులు

వాణిశ్రీ

**హాల్లో వున్న ల్యాండ్‌లైన్ ఫోన్ రింగవుతోంది. వరండాలో కూర్చుని పేపరు చదువుతున్న కృష్ణారావు, 'లోపల భార్య ఫోను ఎత్తుతుందేమో!' అనుకున్నాడు. కానీ ఆ సూచనలు కనిపించలేదు. ఇక తనే పేపరు పక్కన పడేసి వెళ్ళాడు. అతను ఫోన్ ఎత్తేలోపల శబ్దం ఆగిపోయింది. అతను తిరిగి వరండాలోకి వచ్చి పడక కుర్చీలో కూర్చుని పేపరు చదవడం మొదలెట్టాడు.**

కాసేపటికి ఛాయాదేవి వచ్చింది. తలంటు స్నానం చేసి వచ్చినట్టుంది, తలకి టవలు చుట్టుకుంది.

"కాఫీ తాగుతావంటయ్యా?" అని అడిగింది.

"ఆc పెట్టు" అన్నాడు.

ఆమె లోపలకు వెళ్ళబోతుంటే అన్నాడు.

"ఎవరో ఫోన్ చేశారు. నువ్వు ఎత్తుతావనుకున్నాను. నేను వెళ్ళేసరికి ఆగిపోయింది".

"నేను స్నానం చేస్తున్నాలే!"

"ఎవరు చేసి ఉంటారు?"

"ఎవరని తెలుస్తుంది? ఎవరిదో పేరంటం అయి ఉంటుంది. ఇదివరకు ఇంటికొచ్చి పిలిచేవారు. ఇప్పుడు ఫోన్‌చేసి 'మా అమ్మాయికి ఓణీలు ఇస్తున్నామనో, 'మా మనవరాలికి సీమంతం అనో, 'మా బుజ్జిగాడి పుట్టినరోజు అనో ఫోన్ చేస్తున్నారు. కాలం మారిపోయింది".

"నిజమేలే! మరిక ఫోన్లెందుకు పెట్టించుకున్నది?" అని నవ్వాడు కృష్ణారావు.

"నయమేలే! పెళ్ళిళ్ళకు మాత్రం ఇంటికొచ్చి కార్డులు ఇచ్చి రమ్మంటున్నారు. ముందు ముందు అదీ ఉండదేమో?"

"ఆ రోజులూ వస్తాయి. హైదరాబాద్ వెళ్ళినప్పుడు చూశాగా! అమ్మాయికి ఎవరో ఫోన్‌చేసి మా అబ్బాయి పెళ్ళి కార్డు మెయిల్ చేశాం అంటారు. అది వెళ్ళి కంప్యూటర్‌లో చూస్తుంది పెళ్ళి ఎక్కడ? ఏమిటి? అని. ఇక పిలుపులేమీ ఉండవు" అన్నాడు కృష్ణారావు.

కాసేపటి తర్వాత ఛాయాదేవి ప్లాస్టిక్ బుట్టలో క్యారేజీ, నీళ్ళ సీసా పెట్టుకుని "నేను పొలం వెళ్తున్నా!" అని బయల్దేరింది.

పిల్లలకు దసరా సెలవులని పుట్టింటికి వెళ్ళింది కోడలు. ఇక ఆమెకు పొలం వెళ్ళక తప్పలేదు. మోకాళ్ళ నొప్పులని కృష్ణారావు అంత దూరం వెళ్ళడం లేదు.

ఛాయాదేవి వెళ్ళిన కాసేపటికి మళ్ళీ ఫోన్ మోగింది. కృష్ణారావు రిసీవర్ ఎత్తి "హలో! ఎవరు?" అన్నాడు.

"నాన్నా! నేను అంజలిని".

"అమ్మా! బాగున్నావా? నీ మనవరాలు బాగుందా? అల్లుడు ఆరోగ్యం బాగుందా?" అని కుశల ప్రశ్నలు వేశాడు.



"అంతా బాగున్నాం నాన్నా! అమ్మ లేదా?"

"లేదమ్మా పొలం వెళ్ళింది తమ్ముడికి అన్నం ఇవ్వడానికి".

"ఏం? మరదలు లేదా?"

"లేదమ్మా! దసరా సెలవులు కదా, పిల్లల్ని తీసుకుని పుట్టింటికి వెళ్ళింది".

"నాన్నా! ఎందుకు ఫోన్ చేశానంటే, నాకొక పనమ్మాయి కావాలి. పది పన్నెండేళ్ళ పిల్లైనా చాలు".

"పని చెయ్యడానికా?"

"పనంటే పెద్ద పనికాదు. శాలినిని చూసు కుంటే చాలు. దానికి స్కూలుకెళ్ళే వయసు రాలేదు కదా! అప్పటిదాకా నాకీ తిప్పలు తప్పవు. ఒకటే అల్లరి చేస్తున్నది. ఉన్నచోట ఉండడం లేదు. దాన్ని ఎప్పుడూ ఆడిస్తూ ఉండాలి. అది నిద్రపోతేనే నేను ఏ పనైనా చేసుకోగలుగుతున్నాను".

"అక్కడ పనిమనుషులెవరూ దొరకడం లేదా?"

"దొరుకుతారు నాన్నా! హడావుడిగా వచ్చి అంట్లుతోమేసి, ఇల్లు ఊడ్చిపోతారు. బట్టలు కూడా ఉతకరు. దానికి వేరే మనిషిని పెట్టుకోవాలి. అప్ప టికీ మిషన్లో వేస్తుంటాను. బట్టలుపిండేసి ఆరేసే పని కూడా చెయ్యరు. నేను పిల్లనే చూసుకోవాలా? మీ అల్లుడికి వంటచేసి లంచ్‌బాక్స్ పెట్టివ్వాలా? టిఫిన్ రెడీ చేయాలా?"

అంజలి తన ఇబ్బందులన్నీ తండ్రికి చెప్పుకో వడం మొదలు పెట్టింది.

"సర్లేమ్మా! నువ్వు అమెరికా వెళ్ళి మనవరాలిని పెంచుతానని తీసుకురావడమే తప్పు అనిపిస్తోంది నాకు".

"ఏం చెయ్యను నాన్నా! శ్రావ్య ఇబ్బందులు చూసి తట్టుకోలేక పోయాను. మనకి నయం నాన్నా పనిమనిషి దొరుకుతుంది. అక్కడ అదీ లేదు. మొగుడూ పెళ్ళాలు ఉద్యోగాలకి పోవాలి. ఇంట్లో పసిపిల్లని డే కేర్ సెంటర్లో పడేసి పోవాలి. సంవత్సరం పిల్లని వాళ్ళెట్లా చూస్తారో అని భయం. వాళ్ళు స్వంత పిల్లల్ని చూసినట్టు ఎందుకు చూస్తారు? పిల్లల్ని సరిగా పట్టించుకోకపోవడంవల్ల జబ్బులు ముదిరి మళ్ళీ హాస్పిటల్ చుట్టూ తిరగడం గురించి కథలు కథలుగా చెప్తుంటారు. వాళ్ళకి ఇట్లా జరిగింది, వీళ్ళకిట్లా జరిగింది అని".

"అంతేనమ్మా! పెద్దవాళ్ళు దగ్గరలేకపోతే అట్లాగే జరుగుతుంటాయి. ఎవర్నని ఏం లాభం?"

"పెద్దవాళ్ళు ఎవరు ఉంటారు పర్మినెంట్‌గా? మా వియ్యపురాలు నాకు కుదరదమ్మా! జాబ్‌కి సెలవు పెట్టలేను అన్నది. ఆవిడ మహారాణి కాలేజీ ప్రిన్సిపాల్. నేనేగా ఏ పనీలేక ఖాళీగా ఉన్నాను. పిల్లని ఇచ్చుకున్నాక తప్పుతుందా నాకు? పురుడు పోయడానికి వెళ్ళకతప్పదు" నిష్ఠూరంగా చెప్పింది అంజలి.

'పీతకష్టాలు పీతవి అన్నట్టు. ఎవరి బాధలు వారివి' అనుకున్నాడు కృష్ణారావు.

"సరేనమ్మా! మీ ఇంట్లో ఉండిపోవడానికి ఒక అమ్మాయి కావాలి అంతేగా?"

"అంతే నాన్నా!"

"సరేనమ్మా! ఊళ్ళో అడిగి చూస్తాను ఎవరైనా ఉన్నారేమో?" అన్నాడు.

"తొందరగా చూడు నాన్నా! దొరికితే నువ్వు వెంట బెట్టుకుని తీసుకురా! పిల్లకి బట్టలుకొనిపెట్టి, సంవత్సరానికి ఇంతని ఇద్దాం. మాట్లాడు" అన్నది అంజలి.

భార్య ఇంటికి రాగానే కృష్ణారావు చెప్పాడు.

"హైదరాబాద్ నుంచి అంజలి ఫోన్ చేసిందే!"

"అబ్బో! ఫోన్‌చేసిందా? దానికి ఏం పని పడిందో మనతో? ఏదైనా అవసరం ఉంటేగానీ ఫోన్ చెయ్యదుగా మీ కూతురు?" వెటకారంగా అన్నది ఛాయాదేవి.

"ఔనా! ఏదైనా పనుంటేనే ఫోన్లో మాట్లాడు కోవాలి. ఉంది కదా అని కాకమ్మ కబుర్లు చెప్పుకో వడానికి కాదు. ఏం కూర వండావు వదినా? ఏం చీరకట్టుకున్నావు మరదలా? అని సొల్లుకబుర్లేగా మీ ఆడోళ్ళు మాట్లాడుకునేది. నాకు తెలీదా ఏం?" అంతే వెటకారంగా అన్నాడు కృష్ణారావు.

"అది సర్లే! ఎందుకంట అది ఫోన్ చేసింది?"

"మనవరాలిని ఆడించడానికి పనిపిల్ల కావా లట. ఊళ్ళో ఎవరినైనా మాట్లాడి పంపమని చెప్పింది".




**మెరుగైన జీవితాన్నే కోరుకుంటారు ఎవరైనా. అందుకే ఆ రైతు కుటుంబంలో అమ్మాయి పట్టుబట్టి పట్నం సంబంధం చేసుకుంది. బాగా స్థిరపడింది. దాని ప్రభావం ఆమె తమ్ముడు అనుభవించాడు.. అది ఆ కుటుంబంలో అసంతృప్తికి దారితీసింది. వలస జీవితం అందంగా ఉంటుంది, సంపద్వంతంగా ఉంటుంది కానీ ఆ పర్యవసానాలెలా ఉంటాయో, ఎటువైపు దారితీస్తాయో ఒక చిన్న సంఘటనతో చెప్పే ఈ కథ చదవండి.**

"ఆc... తేరగా ఉన్నారిక్కడ పనిపిల్లలు? ఎక్కడ దొరుకుతున్నారు పనిచేసేవాళ్ళు? అంతా పట్నాలకి ఎగబడి పోతున్నారు. పొలంలో పని చెయ్యడానికే దొరకడం లేదు. ఇక్కడ ఎవరూ దొరకరని చెప్పకపో యావా?" మండిపడుతూ అన్నది.

ఛాయాదేవికి పెద్దకూతురు అంజలి అంటే కోపం అన్న సంగతి కృష్ణారావుకు తెలుసు. దానికి కారణం ఉంది.

అంజలికి ఊళ్ళోనే పెళ్ళి సంబంధం వచ్చింది. సర్పంచి మేనల్లుడు ఇక్కడి హైస్కూల్లోనే టీచర్‌గా చేరాడు. కృష్ణారావుతో స్నేహంగా ఉంటాడు సర్పంచి.

"నా మేనల్లుడికి మీ అంజలిని ఇవ్వరా! వాడిది గవర్నమెంట్ ఉద్యోగం. కట్నం నీ ఇష్టం. ఇంత ఇవ్వమని నా చెల్లెలుగానీ, మా బావగానీ అడ గరు" అన్నాడు.

కృష్ణారావు 'సరే' అని పెళ్ళిచూపులకు రమ్మ న్నాడు. పెళ్ళిచూపులయ్యాక అంజలి పెద్దగొడవ చేసింది.

"నేను ఈ సంబంధం చేసుకోను. నాకు పట్నంలో కాపురం ఉండాలని ఉంది. పుట్టినప్ప ట్నుంచి పల్లెటూళ్ళోనే ఉన్నాను. చచ్చేవరకు ఇక్క డేనా? నా బతుక్కి ఏం సుఖం?" అని ఏడవడం మొదలుపెట్టింది.

ఆమె మనసులో పట్నం కాపురం చెయ్యాలని ఉన్న సంగతి ఎవరికీ తెలీదు. తీరా పెళ్ళిచూపులు అయ్యాక బైట పెట్టింది. అట్లా ఆ సంబంధం తప్పి పోయింది. ఎన్నో సంబంధాలు చూశాక హైదరా బాద్ సంబంధం కుదిరింది. ఐతే చాలా ఖర్చ యింది. ఉన్న ఆరు ఎకరాల పొలంలో మూడు ఎక రాలు అమ్మాల్సి వచ్చింది. దాని ప్రభావం తర్వాత కుటుంబంమీద పడింది. సగానికి సగం ఆదాయం పడి పోయింది. కొడుకు చదువు హైస్కూలుతోనే ఆపేయాల్సి వచ్చింది. కాలేజీలో చదివించటానికి కష్టమని తెలిసి వాడే వద్దన్నాడు. ఉన్న పొలం సాగు చేసుకుంటూ ఊళ్ళోనే స్థిరపడిపోయాడు. వాడి తోటి స్నేహితులు గుంటూరువెళ్ళి కాలేజీలో చేరారు. ఇంజనీర్లు అయ్యారు. చాలామంది అమెరికా వెళ్ళి సంపాదిస్తున్నారు. తన కొడుకు ఎండకు ఎండి, వానకు తడిసి పొలంలో కష్టపడుతున్నాడు.

# కత్రినా హాస్పిటల్‌కి ఎందుకెళ్ళినట్లు?

కత్రినా స్కిన్ స్పెషలిస్ట్ దగ్గరకి వెడుతూ కొందరి కంట పడిందట! దాంతో ఆమె చర్మ ఆరోగ్యం మీద ఇప్పుడు రకరకాల కథలు వినపడుతున్నాయి. ఎండ కారణంగా కత్రినా స్కిన్ సమస్యతో డాక్టర్‌ని కలిసి ఉండవచ్చని అంటున్నారు. ఆమె లోపలికి వెళ్ళే సమయంలోనూ, బయటకి వచ్చేటప్పుడూ మాట్లాడడానికి కొందరు ప్రయత్నించినా ముఖం చాటేసింది! దాంతో మరిన్ని అనుమానాలు బయలు దేరాయి. కత్రినా ఆ డాక్టర్‌ని స్కిన్ సమస్యల కోసమే కలిసిందా? మరి దేనికోసమైనా కలిసిందా? అన్న అనుమానాన్ని పలువురు వ్యక్తం చేస్తున్నారు.



కూతురిమీద ఛాయాదేవికి అందుకే కోపం. ఎన్నే ళ్ళైనా ఆ కోపం తగ్గించుకోలేక పోతోంది. సమయం వచ్చినప్పుడు బైటపడిపోతూ ఉంటుంది.

తన భార్యవల్ల ఎటూ కాదనుకున్న కృష్ణారావు, పనిపిల్ల దొరుకుతుందేమోనని వెతకడానికి బయల్దే రాడు. సొంతూరులోనే కాకుండా చుట్టుపక్కల ఊళ్ళకి, బంధువుల ఇళ్ళకి వెళ్ళి ఎంక్వయిరీ చేశాడు. అంజలికి కావలసిన వయసు పిల్లలు ఎవరూ తగ ల్లేదు. ఇప్పుడు చాలామంది పిల్లల్ని చదివించు కుంటున్నారు. పూర్వంలా పనిపాటలకు పంపడం లేదు. పల్లెటూళ్ళలో కూడా చాలామార్పులు వచ్చాయి. బీదవాళ్ళు చదువుకుంటేతప్ప బాగుపడరనే అభిప్రాయంతో ఉన్నారు. జీవితంలో తాము పడిన కష్టాలు తమపిల్లలు పడకూడదనీ, వాళ్ళు బాగా చదువుకుని ఉద్యోగాలు సంపాదించుకుని సుఖంగా బతకాలనీ కోరుకుంటున్నారు.

"నీకేం పనీ పాటా లేదా ఏం? ఎందుకట్లా ఊళ్ళ వెంబడి తిరుగుతావు? ఆ మహారాణి హైద రాబాద్‌లో దర్జాగా ఉంది. దాని కూతురు అమెరికాలో కూర్చుని డబ్బు సంపాదించుకుంటోంది. మధ్యలో మనకేందయ్యా తిప్పలు? తిరిగి తిరిగి నువ్వు మూలపడితే చెయ్యలేక నా చావుకొస్తుంది".

భార్యలాగా కృష్ణారావుకి అంజలిమీద కోపం ఏమీ లేదు. జరిగిపోయిందేదో జరిగిపోయింది. దాన్ని గురించి ఇప్పుడు అనుకోవడం ఎందుకు? ఎవరి అదృష్టం వాళ్ళది. తమ తాత ముత్తాతలు పొలం పనులు చేసుకునేగా ఊళ్ళో బతికారు. తనూ అదే పనిచేశాడు. ఇప్పుడు కొడుకు చేస్తున్నాడు. కులవృత్తి. అందులో తప్పేం ఉంది. ఊళ్ళో ఎవరి పిల్లలో ఇంజనీర్లు, డాక్టర్లు అయ్యారంటే అది వాళ్ళ అదృష్టం అనుకోవాలి. వాళ్ళలా మనం ఉండాలను కుంటే ఎట్లా? ఎంతైనా కన్నకూతురు. చేతనైనంత సహాయం చేయాల్సిందే? అదీ కృష్ణారావు స్వభావం. ఈ విషయంలో ఛాయాదేవికి, కృష్ణారావుకి చుక్కె దురు. కూతురు అతి ఆశలవల్ల కొడుక్కి అన్యాయం జరిగిందని బలంగా నమ్ముతోంది ఛాయాదేవి. ఇతరుల పిల్లలతో పోల్చుకోవడంతో అది మరిచిపోలేని బాధగా మిగిలింది.

అంజలి అప్పుడప్పుడు ఫోన్‌చేసి పనిపిల్ల గురించి అడుగుతూనే ఉంది. ఒకరోజు కృష్ణారావు చెప్పేశాడు.

"అమ్మాయ్! పిల్లలు ఎవరూ దొరకడం లేదు. నువ్వు అక్కడే తిప్పలుపడు".

"నాన్నా! జానీ ఇప్పుడేం చదువుతోంది?" అడి గింది అంజలి.

"తొమ్మిది చదువుతోంది".

"ఇంగ్లీషు మీడియమేనా?"

"ఔను. ఏం?"

"మా ఇంటిదగ్గరే మంచిస్కూల్ ఉంది నాన్నా! జానీని నా దగ్గరకు పంపరాదూ? ఇక్కడ బాగా చెప్తారు చదువు. పైగా నాకు సహాయంగా ఉంటుంది" అన్నది అంజలి.

"ఏమోనమ్మా! వాళ్ళ అమ్మా నాన్నా ఏమం టారో? అడగాలి వాళ్ళని".

"ఇందులో అనేదేముంది నాన్నా! మేనత్త దగ్గ రికి పిల్లని పంపితే తప్పేముంది?"

"తప్పేం లేదులే".

"తమ్ముడికి నచ్చచెప్పు నాన్నా!"

"సరే.. చెప్పి చూస్తాను" అన్నాడు కృష్ణారావు.

ఆ సంగతి భార్యకు చెప్పాడు. అది వినగానే తాచుపాములా ఎగిరిపడింది ఛాయాదేవి.

"ఏమనుకుంటోంది అది? కాస్త డబ్బు సంపా దించగానే కళ్ళు నెత్తికెక్కాయా? నా మనవరాలిని పనిపిల్లగా పంపించమంటుందా? ఇక్కడ మేమేం కూటికిలేక చావడంలేదు. పిల్లల్ని పని మనుషు లుగా పంపడానికి".

"ఎందుకే అట్లా ఎగిరి పడతావూ? అది పిల్లని చదివించడానికేగదా పంపించమనేది" అన్నాడు కృష్ణారావు.

"నువ్వొక పిచ్చోడివయ్యా! నీకేం తెలుసు దాని బుద్ధి? దాని మనవరాలిని ఆడించడానికి ఓ చిన్న పిల్ల కావాలి. తమ్ముడి పిల్లల్ని చదివించాలని ఇన్నాళ్ళూ లేని బుద్ధి ఇప్పుడు ఎందుకొచ్చింది దానికి? ఇక్కడ ఎవరూ తేరగా లేరని చెప్పు".

ఇక ఆ రోజంతా అలా ఛాయాదేవి కూతురి మీద మండిపడుతూనే ఉంది. పోనీలేవే అని కృష్ణా రావు చెప్పినా ఊరుకోవడం లేదు.

"ఈసారి ఫోన్ చెయ్యమను. దాన్ని కడిగి పారేస్తాను" అన్నది.

అన్నంత పనీ చేసింది. అంజలి ఫోన్ చేసిన ప్పుడు ఛాయాదేవి రిసీవర్ ఎత్తింది.

"చూడమ్మా! నువ్వేమో పల్లెటూళ్ళో ఉండను, పట్నంలోనే ఉంటానని వెళ్ళిపోయావు. ఇక్కడ అందరూ నీలాగా ఏమీ అనుకోవడంలేదు. నా మనవరాలిని నువ్వేం ఉద్ధరించనక్కర్లేదు. మా తిప్పలు మేం పడతాం. నీ కూతురు డాక్టరై అసలు దేశంలోనే ఉండనని అమెరికా వెళ్ళింది. ఏం? ఇక్కడ దేశం డబ్బు ఖర్చుపెట్టించి చదివి డాక్టరై, ఇక్కడ జనానికి సేవ చెయ్యగూడదా? అమెరికా వాళ్ళకే సేవ చెయ్యాలా? నీ కూతురు అమెరికా వాళ్ళ సేవలో మునిగితే, దాని కూతురికి మళ్ళీ మేమొచ్చి సేవలు చెయ్యాలా? బాగుందమ్మా! బాగుంది" అన్నది.

**సెల్: 93900 85292**




మే 17 నుంచి
మే 23 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, విద్య, సోదరీసోదరుల విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. 19, 20, 21 తేదీల్లో రాజకీయ, సినీరంగాల వారు ఆర్థిక విషయాల్లో నిదానం పాటించాలి. ఆర్థిక విషయాలు అశాంతి కలిగిస్తాయి. విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు చర్చలు ఫలిస్తాయి. కీలక సమాచారం అందుకుంటారు. 22, 23 తేదీల్లో కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. సోదరీసోదరుల విషయాలు, రాతకోతలు, చర్చలపై దృష్టి పెడతారు. ప్రయాణాల్లో నిదానం అవసరం.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, ఆర్థికపరమైన నిర్ణయాలు, చర్చలు, బిల్లుల చెల్లింపులకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో కీలక నిర్ణయాలు తీసుకుంటారు. కొత్త ప్రాజెక్టుల ప్రారంభానికి అనుకూలం. ఉద్యోగాన్వేషణ ప్రయత్నాలు ఫలిస్తాయి. 19, 20, 21 తేదీల్లో బృందకార్యక్రమాల్లో అసౌకర్యానికి గురవుతారు. పెట్టుబడుల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. ఖర్చులు అంచనాలు మించుతాయి. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 22, 23 తేదీల్లో దీర్ఘకాలిక పెట్టుబడులు, ఆర్థికపరమైన చర్చలు, ప్రయాణాలకు అనుకూలం. ఒక సమాచారం కలవరపెడుతుంది.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, వృత్తి, వ్యాపారాలు, పెట్టుబడులపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురువారాల్లో రాజకీయ, సినీరంగాల వారికి ప్రోత్సాహకరం. వేడుకలు, సమావేశాల్లో పాల్గొంటారు. ఉన్నత విద్య కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 19, 20, 21 తేదీల్లో పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది. గౌరవ మర్యాదలకు భంగం కలిగే అవకాశం ఉంది. వృత్తి వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ప్రముఖుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 22, 23 తేదీల్లో యూనియన్ కార్యకలాపాలు, ఆర్థిక సంస్థలతో పనులకు అనుకూలం. సమావేశాల్లో సత్ఫలితాలు సాధిస్తారు. పెట్టుబడుల్లో తొందరపాటు తగదు.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, వేడుకలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. మ్యూచువల్ ఫండ్, షేర్ల లావాదేవీలకు అనుకూలం. 19, 20, 21 తేదీల్లో సమావేశాల్లో అసౌకర్యానికి గురవుతారు. ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. విద్యార్థులు సత్ఫలితాలు సాధిస్తారు. 22, 23 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. ఉన్నత పదవులు, గౌరవ మన్ననలు అందుకుంటారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

ప్రముఖులతో సమావేశాలు, పెట్టుబడులు, ఆర్థిక సంస్థలతో లావాదేవీలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో జనసంబంధాలు విస్తరిస్తాయి. వేడుకల్లో ప్రముఖులను కలుసుకుంటారు. భాగస్వామి వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. 19, 20, 21 తేదీల్లో పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. బ్యాంకులతో పనులు పూర్తవుతాయి. 22, 23 తేదీల్లో బంధుమిత్రుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. ఆర్థికపరమైన సమావేశాలు, చర్చలకు అనుకూలం. ఖర్చులు అంచనాలు మించుతాయి.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, సమావేశాలు, బృందకార్యక్రమాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో హోటల్, వైద్య, ఉపాధి రంగాల వారికి ప్రోత్సాహకరం. వృత్తి, వ్యాపారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 19, 20, 21 తేదీల్లో వేడుకల్లో అసౌకర్యానికి గురయ్యే అవకాశం ఉంది. సన్నిహితులతో వాగ్వాదానికి దిగకండి. సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. గౌరవ మన్ననలు అందుకుంటారు. 22, 23 తేదీల్లో ఆర్థిక విషయాల్లో పైఅధికారుల సహకారం లభిస్తుంది. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఆర్థిక విషయాల్లో ఆశించిన సహకారం లభించక నిరుత్సాహపడతారు.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, వేడుకలు, వృత్తిపరమైన సమావేశాలు, ప్రయాణాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో చిన్నారులు, ప్రియతముల కోసం విలువైన వస్తువులు సేకరిస్తారు. పొదుపు పథకాలు లాభిస్తాయి. ఫీజుల చెల్లింపులకు నిధులు సమకూరతాయి. 19, 20, 21 తేదీల్లో ఆరోగ్యం మందగిస్తుంది. వైద్య అవసరాలకు నిధులు అందక ఇబ్బంది పడతారు. వృత్తి, వ్యాపారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తిపరమైన సమావేశాలకు అనుకూలం. 22, 23 తేదీల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. సమావేశాల్లో మాటపడాల్సి రావచ్చు.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

భాగస్వామ్యాలు, స్పెక్యులేషన్లు, క్రయవిక్రయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో కుటుంబ సభ్యుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభప్రదం. 19, 20, 21 తేదీల్లో స్పెక్యులేషన్లలో నష్టం సంభవం. శ్రీవారు, శ్రీమతి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వడ్డీలు, పాత బకాయిలు వసూలవుతాయి. చిన్నారుల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. వైద్యం, పరిశ్రమల రంగాలవారికి ప్రోత్సాహకరం. 22, 23, తేదీల్లో హోటల్, వైద్యరంగాలవారికి అనుకూలం. ఆరోగ్యం మెరుగుపడుతుంది. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా నిరుత్సాహకరం.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

ఇంటర్వ్యూలు, ప్రయాణాలు, బదిలీలు, వేడుకలు, చిన్నారుల విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. వృత్తిపరమైన చర్చలు ఫలిస్తాయి. బంధుమిత్రులతో విందు వినోదాల్లో పాల్గొంటారు. 19, 20, 21 తేదీల్లో కుటుంబ సభ్యుల ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది. బదిలీలు, సీట్ల మార్పిడి కారణంగా అసౌకర్యానికి గురవుతారు. శుభకార్యాలకు ఏర్పాట్లు చేస్తారు. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభప్రదం. 22, 23 తేదీల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. ఖర్చులు అంచనాలు మించుతాయి.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, విద్యా విషయాలు, వృత్తి, వ్యాపారాలు, ఆరోగ్యం, బదిలీలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ఫీజులు, బిల్లులు చెల్లిస్తారు. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 19, 20, 21 తేదీల్లో విలువైన పత్రాలు కోల్పోయే ప్రమాదం ఉంది. ప్రయాణాల్లో నిదానం పాటించాలి. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. విందు వినోదాల్లో పాల్గొంటారు. కీలక సమాచారం అందుకుంటారు. 22, 23 తేదీల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం. హోటల్, వైద్య రంగాల వారికి శుభప్రదం. కుటుంబ సభ్యుల ఆరోగ్యం కలవరపెడుతుంది.

**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

బదిలీలు, నిర్మాణం, విద్యా విషయాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభప్రదం. బదిలీ ప్రయత్నాలు ఫలిస్తాయి. కుటుంబ సభ్యులతో ఉల్లాసంగా గడుపుతారు. 19, 20, 21 తేదీల్లో ఆర్థిక విషయాల్లో కుటుంబ సభ్యుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. పెట్టుబడుల్లో నిదానం అవసరం. చిన్నారులు, ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 22, 23 తేదీల్లో ఏజెన్సీ, రవాణారంగాల వారికి, విద్యార్థులకు శుభప్రదం. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. ఒక సమాచారం కలవరపెడుతుంది.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

విద్య, ప్రయాణాలు, సోదరీసోదరుల విషయాలు, కుటుంబ విషయాలకు ఈ వారం ప్రాధాన్యత ఉంటుంది. బుధ, గురువారాల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. 19, 20, 21 తేదీల్లో ప్రయాణాలు, చర్చల్లో నిదానం అవసరం. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లలో జాగ్రత్తలు తీసుకోండి. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభప్రదం. మార్పుచేర్పుల గురించి ఆలోచిస్తారు. 22, 23 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాలవారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఇంటి కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఖర్చులు అధికం.




## రాజకీయాల్లోకి డార్లింగ్?

ప్రస్తుతం ప్రభాస్‌కి వస్తున్న, వచ్చిన పేరు క్యాష్ చేసుకోవాలని చూస్తోంది ఓ జాతీయ పార్టీ. త్వరలో జరగబోయే ఎన్నికల్లో అతగాడి చేత ప్రచారం చేయిస్తే తమ పార్టీ గెలుపు ఖాయం అన్న ధీమాలో ఆ పార్టీ ఉందట! కాకపోతే అతడి సినిమా షూటింగులకు ఇబ్బంది కలిగించబోమని కూడా ఆ పార్టీ ప్రభాస్‌కి హామీ ఇచ్చిందని అంటున్నారు. ప్రభాస్‌ని రాజకీయాల్లోకి తీసుకురావడానికి ఆ పార్టీ గట్టిగానే ప్రయత్నాలు చేస్తోందని చెబుతున్నారు. కాకపోతే ఈ డార్లింగే ఏ విషయాన్నీ తేల్చడంలేదట!



## వణుకుతున్న ఖాన్ త్రయం!

భారతీయ సినీ చరిత్రలో అత్యధిక వసూళ్ళు సాధించిన సినిమాలు చాలా వరకూ బాలీవుడ్ ఖాన్ త్రయం(అమీర్ ఖాన్, సల్మాన్ ఖాన్, షారూఖ్ ఖాన్) ఖాతాలోనే ఉన్నాయి. అలాంటిది ఓ తెలుగు సినిమా తమ రికార్డులను తిరగరాస్తుంటే ఖాన్ త్రయం వణికిపోతోందట! తమ రికార్డులు గల్లంతవుతున్నాయనీ, ఇప్పుడు ఈ సినిమా వసూళ్ళను అధిగమించాలంటే కష్టమేనని వారు ఆందోళన పడుతున్నారట! 'బాహుబలి 2' సినిమా గురించి సల్మాన్, షారూఖ్‌లు ఇంత వరకూ నోరు విప్పకపోవడానికి కారణం ఈ భయమేనని కూడా అంటున్నారు. చివరికి అమీర్ నోరు తెరిచి ఈ సినిమా గొప్పతనం గురించి నాలుగు ముక్కలు మాట్లాడి అందరి దగ్గరా మంచి మార్కులు కొట్టేశాడు. మిగతా ఇద్దరు మాత్రం ఇప్పటి నుంచే ఈ సినిమా వసూళ్ళను తలదన్నే సినిమా చేసి తమ సత్తా చాటుకోవడానికి ప్రయత్నాలు ప్రారంభించారట! మంచి కథ సిద్ధం చేసుకోమని ఒకరిద్దరు బడా రైటర్లకు ఆజ్ఞలు కూడా జారీచేశారట!






## ఆ వసూళ్ళు నిజమేనట!

'బాహుబలి 2' వసూళ్ళ మీద కొందరికి ఎక్కడో చిన్న అనుమానం ఉండేది. ఇన్ని కోట్ల వసూళ్ళు సాధ్యమేనా? అన్నది వారి వాదన. కానీ నిజమే అంటున్నారు ఆ సినిమా నిర్మాత దేవినేని ప్రసాద్. ఈ సినిమా ఇప్పటి వరకూ వెయ్యి కోట్లు వసూలు చేసిందని రాబోయే రోజుల్లో అది 1500 కోట్లు వసూలు చేయడం ఖాయమన్నది ఆయన మాట! ఇదే వ్యక్తి గతంలో 'బాహుబలి' ద్వారా దాదాపు 70 కోట్లు నష్టం వచ్చిందని చెప్పుకొచ్చారు. మొదటి భాగం అన్ని వందల కోట్లు వసూలు చేసినా నష్టం ఎలా వచ్చిందో ఇప్పటి వరకూ చాలా మందికి అర్థం కాని ప్రశ్నే! అప్పుడు ఆయన మాటలు నమ్మిన వారే ఇప్పుడు ఈ మాటలూ నమ్ముతున్నారు. ఈ దెబ్బతో గతంలో వచ్చిన నష్టాలు భర్తీ అవుతాయని మాత్రం ఈయన చెప్పకపోవడం విశేషమే అంటున్నారు.



## రమ్యకృష్ణకు, కృష్ణవంశీకి పడడం లేదా?





ఈ ప్రశ్న చాలా మంది మదిలో మెదులుతున్నదే! తామిద్దరం కలిసే ఉన్నామని రమ్యకృష్ణ ఎంత క్లారిటీ ఇచ్చినా సినీ జనాలు నమ్మడం లేదట! కృష్ణవంశీ తెలుగు రాష్ట్రాల్లో షూటింగ్స్‌లో బిజీగా ఉంటే రమ్యకృష్ణ చెన్నైలో కొడుకుతో ఉంటోంది. కృష్ణవంశీ, తానూ తరచు కలుసుకుంటున్నామని రమ్యకృష్ణ చెబుతున్న మాటల్లో నిజం లేదట! వీరిద్దరూ కలుసుకుని కొన్ని నెలలు అవుతోందని వీరిద్దరి సన్నిహితులు చెబుతున్నారు. శివగామిగా రమ్యకృష్ణకు ప్రపంచవ్యాప్తంగా ఎంత పేరు వచ్చిందో తెలిసిందే! అదే సమయంలో కృష్ణవంశీకి కాలం అస్సలు కలిసిరావడం లేదు. ప్రస్తుతం చేతిలో ఉన్న 'నక్షత్రం' సినిమా తప్ప మరొకటి లేదు. దీనినే సంవత్సరాల తరబడి చెక్కుతున్నాడు. ఇవన్నీ ఇద్దరి మధ్యా దూరాన్ని పెంచుతున్నాయని సినీ జనాలు అంటున్నారు.

## కోలీవుడ్‌కి వెడుతున్న లెక్కల మాస్టారు!

టాలీవుడ్‌లో లెక్కల మాస్టారుగా పిలిపించుకునే సుకుమార్ తమిళంలోనూ ఓ సినిమా నిర్మించబోతున్నాడు. టాలీవుడ్‌లో 'కుమారి 21 ఎఫ్' సినిమాను నిర్మించి మంచి విజయాన్ని అందుకున్న మాస్టారి కన్ను కోలీవుడ్ మీద పడింది. తెలుగులో తన దర్శకత్వంలో వచ్చిన '100 పర్సంట్ లవ్'ను అక్కడ రీమేక్ చేయబోతున్నారట! తెలుగులో నటించిన తమన్నానే తమిళంలోనూ నటించబోతోంది అంటున్నారు.



# నేను అలాంటిదాన్నే!

## -శ్రుతిహాసన్

**తల్లి అందాన్ని, తండ్రి తెగింపును పుణికిపుచ్చుకున్న చెన్నై సొగసరి శ్రుతిహాసన్. తండ్రి కమల్ ఎంత బహుముఖ ప్రజ్ఞాశాలో.... కూతురు శ్రుతి కూడా అంతే! ఒక్క నటనతోనే ఆగిపోకుండా సంగీత సాహిత్య రంగాల మీద కూడా దృష్టిసారించింది. తనకు ఎన్ని రంగాలలో ప్రవేశం ఉన్నా ప్రస్తుతానికి తన దృష్టి అంతా నటనమీదే అంటున్న శ్రుతిహాసన్‌తో....**

**శ్రుతి దర్శకుల నటి అంటారు... ఎంతవరకు నిజం?**

దర్శకుడు ఏం చెబితే అలా చేయాలన్నది నాన్నగారి పాలసీ. నేను కూడా అలాంటిదాన్నే! దర్శకుడు నవ్వమంటే నవ్వుతాను. ఏడవమంటే ఏడుస్తాను. డ్యాన్స్ చేయమంటే చేస్తాను. అంతే తప్ప నా సొంత పరిజ్ఞానాన్ని వారిమీద ప్రయోగించాలని చూడను. వాళ్ళు నా సలహా అడిగినా ఇవ్వను. బహుశా అందుకేనేమో నన్ను దర్శకుల నటి అంటుంటారు. ఒక్క మాటలో చెప్పాలంటే నేనొక మైనపు ముద్దని. ఎలా మలుచుకోవాలనుకుంటే అలా మలుచుకోవచ్చు.

**మీ ఫాదర్‌లాగే మొండితనం కూడా ఎక్కువేనంటారు. ఎంతవరకు నిజం?**

నా నైజాన్ని, పట్టుదలను మొండితనం అంటే ఎలా? మనసు పెట్టి ప్రయత్నిస్తే ఏదీ అసాధ్యం కాదు. చిన్నతనం నుంచి నాకొక అలవాటు ఉంది. ఎవరైనా సరే....'ఈ పని నీ వల్ల కాదు. నువ్వు చేయలేవు' అంటే నాలో పంతం, పట్టుదల పెరిగేవి. ఆ పని చేసి చూపించేవరకూ ఊరుకునేదాన్ని కాదు. ఆ అలవాటు ఇప్పటికీ కొనసాగుతూనే ఉంది. ఏదైనా కష్టమైన పాత్ర వచ్చినా, భయపడను. చేసి చూపిస్తాను.

**హీరోయిన్‌గా సక్సెస్ అయ్యారు కనుక ఈ మాటలు చెబుతున్నారా?**

అలా ఎందుకనుకోవాలి? నాకు వచ్చిన ఫ్లాపులు, నా మీద వచ్చిన విమర్శలు మరే హీరోయిన్ మీదా వచ్చి ఉండకపోవచ్చు. నా మొదటి సినిమా తరువాత తెలుగులో ఐరన్ లెగ్ అనేశారు. కోలీవుడ్, బాలీవుడ్‌లలో కూడా ఫ్లాప్ హీరోయిన్ అనే ముద్ర వేశారు. చాలా మంది చాలారకాలుగా విమర్శించారు. వారి మాటలు, వారు ఇచ్చిన బిరుదులే నన్ను సక్సెస్ వైపు నడిపించాయి. నాలో మొండితనాన్ని పెంచాయి. నటిగా ఎందుకు సక్సెస్ కాలేను? అన్న కసిని పెంచాయి. ఇప్పుడు గోల్డెన్ లెగ్ అంటున్నారు. వాళ్ళ బిరుదులు వింటూంటే ఒక్కోసారి నవ్వు వస్తుంది.

**అందాల ఆరబోతకు అడ్డు చెప్పరన్నది ఎంత వరకూ నిజం?**

ఆ విషయాన్ని నా సినిమాలే చెబుతాయి. చిట్టిపొట్టి డ్రస్సులు వేసుకోవడమే అందాల ఆరబోత కాదు. చీర, లంగా ఓణీలలో కూడా అందంగా, సెక్సీగా కనిపించవచ్చు. 'గబ్బర్‌సింగ్' చూస్తే ఆ విషయం అర్థమైపోతుంది. సినిమాల్లో నా కాస్ట్యూమ్స్ పాత్రకు అవసరమైన విధంగా ఉంటాయి తప్ప అనవసర ఎక్స్‌పోజింగ్ ఉండదు.

**మీ బాయ్‌ఫ్రెండ్ విషయంలో మీ ఫాదర్ మిమ్మల్ని తిట్టారట?**

నాకు నేనుగా చెప్పేంతవరకూ ఆయన నా విషయంలో ఎందులోనూ కల్పించుకోరు. ఆయన కూడా సినిమా వ్యక్తే! నటీనటులపై ఎలాంటి వార్తలు రాస్తారు?

ఎలాంటి పుకార్లు పుట్టిస్తారు? అన్నది ఆయనకు బాగా తెలుసు. నా విషయంలో ఇప్పటి వరకూ నా మీద కోపంగా అరిచిన సందర్భాలు చాలా తక్కువ. నేను ఎవరితోనైనా రిలేషన్‌షిప్ పెట్టుకోవాలని అనుకుంటే ఆ విషయాన్ని ఆయనకే నేరుగా చెబుతాను. ఇంకెవరికో ఆ ఛాన్స్ ఇవ్వను.

**అంటే ఇప్పటివరకూ మీ లైఫ్‌లో బాయ్‌ఫ్రెండ్ ఎవరూ లేరా?**

లేరని చెప్పలేను. గతంలో ఓ మ్యూజిక్ డైరెక్టర్ అంటే ఇష్టపడ్డాను. ఆయన చాలా మంచి వ్యక్తి. చాలా క్లోజ్‌గా మూవ్ అయ్యేవాళ్ళం. అప్పట్లో నాది ప్రేమ అని అనుకున్నాను. కానీ నాది ప్రేమ కాదు ఆకర్షణ ఆ రిలేషన్‌షిప్ బ్రేకప్ అయిన తరువాత కానీ తెలియలేదు. ఆ తరువాత ఎవరితోనూ ఎలాంటి రిలేషన్ పెట్టుకోలేదు. బాయ్‌ఫ్రెండ్‌కి టైమ్ కేటాయించేంత సమయం నాకు లేదు. అలాగే పెళ్ళి చేసుకునే ఉద్దేశం కూడా ఇప్పట్లో లేదు. పెళ్ళి చేసుకోవాలని అనుకున్నప్పుడు చేసుకుంటాను.



**ముందు పిల్లల్ని కని ఆ తరువాత పెళ్ళి చేసుకుంటాను అన్నారు. మీ పేరెంట్స్‌ని ఆదర్శంగా తీసుకొని అలా మాట్లాడారా?**

వారి ప్రభావం నా మీద ఉంది. నేను కూడా వారిలాగే ఆలోచిస్తాను కనుక అలా మాట్లాడాను. మనసుకు నచ్చిన వ్యక్తి దొరికితే పెళ్ళితో సంబంధం లేకుండా పిల్లల్ని కంటాను. ఆ మాటలకి ఇప్పటికీ కట్టుబడి ఉంటాను. ఈ విషయంలో ఎవరేమనుకున్నా ఫరవాలేదు.

**సౌందర్య ఉత్పత్తులకు అంబాసిడర్‌గా ఉండను అనడానికి కారణం?**

వాటి మీద నాకు నమ్మకం లేకనే! వాటిని రాసుకున్నంత మాత్రాన రంగు మారుతుందని నేను అనుకోను. అందం అనేది రంగు ఎక్కువ తక్కువ మీద ఆధారపడి ఉండదు. మన వ్యక్తిత్వం కూడా మనల్ని అందమైన వారుగా చూపిస్తుంది. చిన్నతనంలో నేను కొద్దిగా రంగు తక్కువగా ఉండేదాన్ని. అందరూ నన్ను నల్లపిల్ల అని ఏడిపిస్తూ ఉండేవారు. అప్పట్లో రంగు తక్కువగా ఉన్నందుకు బాధపడేదాన్ని. పెద్దవుతున్న కొద్దీ రంగు తక్కువగా ఉన్నాను అన్న భావన నాలోంచి తొలగిపోయింది.

**మీ ఫాదర్‌లా దర్శకత్వం చేపట్టే ఆలోచన ఉందా?**

అదో గురుతరమైన బాధ్యత. దాన్ని నేను హ్యాండిల్ చేయలేను. ఇప్పట్లోనే కాదు బహుశా ఎప్పటికీ ఆ ఆలోచన రాదేమో!

**పాత్రల ఎంపికలో పాటించే నియమం?**

నియమాలంటూ ఏవీ లేవు. ఒకేరకమైన పాత్రలు చేయడం అంటే నాకే బోర్! ఏ సినిమా అయినా ఒప్పుకునే ముందు, కథ వినే ముందే నేనే ఓ ప్రేక్షకురాలిగా మారిపోతాను. ఈ పాత్ర లేదా కథ నాకు నచ్చుతుందా? లేదా? అని ఆలోచిస్తాను. నాకే నచ్చకపోతే మూడు గంటల పాటు థియేటర్‌లో కూర్చుని చూసేవారికి ఎలా నచ్చుతుంది? కానీ కొన్ని సినిమాలు మొహమాటం కొద్దీ ఒప్పుకోవలసి వస్తుంది. తప్పదు. వాటి ఫలితం కూడా అలాగే ఉంటుంది.

**మీ ఫాదర్‌కి నటన అంటే మంచినీళ్ళు తాగినంత సులభం. మీరి మీకు?**

ఆయనతో నన్ను పోల్చడం సరికాదు. ఆయన ఏ పాత్రలోనైనా పరకాయ ప్రవేశం చేయగలరు. అది అందరికీ సాధ్యం కాదు. ముఖ్యంగా నాకు. నటించడం అంత తేలికైన పని ఈ లోకంలో మరేదీ లేదన్నది కొందరి అభిప్రాయం. అది తప్పు. నటిస్తున్నప్పుడు పడే టెన్షన్ కంటికి కనిపించకపోవచ్చు. దాని బాధ ఏమిటో అనుభవించేవారికే తెలుస్తుంది. ప్రతి సన్నివేశంలో వేరియేషన్స్ చూపడం అంటే మాటలు కాదు. ఉదాహరణకి ఓ ప్రేమ సన్నివేశాన్ని తీసుకోండి. అంతకు ముందు అలాంటి సన్నివేశాలను చాలామంది చేసి ఉంటారు. వారందరికన్నా కొద్దిగా భిన్నంగా చేస్తేనే మన ప్రత్యేకత ఏమిటో చూపించగలుగుతాం. అలాంటప్పుడు నటీనటులు లోలోపల పడే టెన్షన్ వారికి మాత్రమే తెలుస్తుంది.



**ఇటీవల మీ పర్సనాలిటీ మీద వస్తున్న ఆరోపణల గురించి?**

నోటితో సమాధానం చెప్పడం కన్నా, చేతలతోనే చెబుతాను. కొద్దిగా బరువు పెరిగిన మాట వాస్తవమే! దానికే నేను అందవిహీనంగా కనిపించాను, శ్రుతిలో అందం తరిగిపోయింది అన్న మాటలు అనవసరం. బరువు పెరగడం, తగ్గడం అనేది మన చేతుల్లోనే ఉంటుంది కనుక, నన్ను విమర్శించే వారికి తగిన విధంగా సమాధానం చెబుతాను.

–స్పందనారెడ్డి



## ఇంటర్వ్యూ

# దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి

### -నళిని

**'ప్రేమ సాగరం' డబ్బింగ్ చిత్రంతో తెలుగు తెరకు పరిచయమైన నటి నళిని. మూడు దశాబ్దాలుగా 200 పైగా చిత్రాల్లో నటించారు. మెగాస్టార్ చిరంజీవి సరసన హీరోయిన్‌గా చేసి గుర్తింపు పొందారు. రజనీకాంత్, రవితేజతోపాటు తమిళ, మలయాళ, కన్నడ చిత్రాల్లో ప్రముఖ నటులు మోహన్‌లాల్, మమ్ముట్టి, విజయ కాంత్, సత్యరాజ్, మోహన్, మధు వంటివారితో నటించారు. నటుడు శోభన్‌బాబు ఆశీర్వాదాలతో నటనలో అనేక మెళకువలు తెలుసుకున్నానంటున్న నళిని ఇంటర్వ్యూ....**

నేను పుట్టింది చెన్నై నగరంలో. మా నాన్నగారు కృష్ణమూర్తి. అమ్మ ప్రేమ. నా చదువంతా చెన్నై నుంగం బాక్కం ప్రభుత్వ పాఠశాలలో సాగింది. ఎనిమిదవ తరగతి వరకు చదివాను. పాఠశాలలో ఉన్నప్పుడే నాట్యం నేర్చుకోవడం ప్రారంభించి ప్రావీణ్యం సంపాదించుకు న్నాను. పాఠశాల వార్షికోత్సవాలలో కూడా పాల్గొనేదాన్ని. ముఖ్యంగా స్టేజిమీద భరతనాట్య ప్రదర్శనలెన్నో చేశాను.

### సినిమా రంగంలోకి

1980లో సినిమా రంగంలోకి ప్రవేశించాను. మొట్టమొదట మలయాళ చిత్రం 'ఐతిలి వన్నవరలో నటించాను. దర్శకుడు చంద్రకుమార్ ఆశీర్వాదంతో ఈ చిత్రంలో అవకాశం లభించింది. అలా 1983 వరకు చిన్న చిన్న పాత్రలు వేస్తూ వచ్చాను. అప్పటికి మెల్లిగా చిత్రపరిశ్రమలో గుర్తింపు రావడంతో తెలుగు, తమిళ చిత్రాల్లో కూడా అవకాశాలు రావడం ప్రారంభమైంది. ఐతిలి వన్నవర చిత్రంలో మధుశ్రీకుమార్, సుకుమారన్ నాయర్, షీల తదితరులు నటించారు. 1983లో తమిళచిత్రం 'రాణువవీరన్'లో నటించాను. ఆ సమయంలోనే ప్రముఖ తమిళ దర్శకుడు టి.రాజేం దర్ తను నిర్మిస్తున్న 'ఉయిరుళ్ళవరై ఉష' చిత్రంలో హీరోయిన్‌గా నటించమని అడిగారు. ఆయన చొరవ వల్లే నేను హీరోయిన్‌గా ఎదిగి సినీరంగంలో మంచి పేరు సంపాదించుకున్నాను. ఈ చిత్రంలో నాతో పాటు రమేష్, టి.రాజేందర్, సరిత తదితరులు నటించారు. టి.రాజేందర్ దర్శకత్వం వహించిన ఈ చిత్రాన్ని తెలుగులో 'ప్రేమ సాగరం' పేరుతో డబ్బింగ్ చేశారు. సినిమా బాగా ఆడింది. ముఖ్యంగా ఈ సినిమా తర్వాత నాకు తెలుగు దర్శకుల నుండి మంచి అవకాశాలు రావడం ఒక విశేషం. ఈ చిత్రం కూడా 1983లోనే విడుదలైంది. ఈ విధంగా 1980 నుండి 1987 వరకు దక్షిణాది భాషా చిత్రాల్లో నటిస్తూ చాలా బిజీ బిజీగా గడిపాను. కొన్ని సమయాల్లో దర్శకులకు నా కాల్‌షీట్లు కూడా ఇవ్వలేని పరిస్థితి ఏర్పడింది. ముఖ్యంగా తెలుగు చిత్రాల విషయంలో కొంతమంది దర్శకులను ఈ కారణంగా నిరుత్సాహ పరచవల్సి వచ్చింది. ఈ విషయంలో నేను ఇప్పటికీ బాధపడుతూ ఉంటాను.

### చిరంజీవితో సంఘర్షణ

సురేష్ ప్రొడక్షన్స్ బ్యానర్‌పై నేను నటించిన చిత్రం 'సంఘర్షణ'. ఈ చిత్రంలో నా పాత్రకు మంచి గుర్తింపు లభించింది. ఈ చిత్ర నిర్మాణ సమయంలో చిరంజీవిగారు అన్నమాటలు ఇప్పటికీ నేను గుర్తుంచు కున్నాను. 'నళిని నీ నటన, నీ క్రమశిక్షణ నాకు బాగా నచ్చింది, తప్పకుండా ఈ ఫీల్డులో నువ్వు రాణిస్తావు' అని చిరంజీవి నన్ను ఆశీర్వదించారు. ఆయన కూడా అప్పుడే ఈ రంగంలో బాగా రాణిస్తున్న రోజులవి. ఈ సినిమా షూటింగ్ జరిగినంతకాలం ఆయన నాతో ఎంతో జాలీగా ఉండేవారు. ఈ చిత్రం సూపర్ డూపర్ హిట్ కావడంతో తెలుగు ప్రేక్షకులు నన్ను అభిమానించడం ప్రారంభమైంది. ఈ చిత్రంలో నేను, విజయశాంతి హీరోయిన్లుగా చేశాం. రావుగోపాల రావు, కైకాల సత్యనారాయణ, గుమ్మడి, నిర్మల తది తరులు నటించారు. ఈ చిత్రదర్శకులు మురళీమోహన రావుగారు. సంఘర్షణతోపాటు ఇంటిగుట్టు, బందిపోటు సింహం, ప్రేమజయం చిత్రాల్లో కూడా చేశాను. 1987లో నా వివాహం జరగడంతో దాదాపు 12 సంవత్స రాలపాటు నా సినీ జీవితానికి గ్యాప్ వచ్చింది.

### చిరంజీవి క్రమశిక్షణ చూసి ఆశ్చర్యపోయా

సంఘర్షణ షూటింగ్ సమయంలో మేం ఒక పాటకు నాట్యం చేస్తున్నప్పుడు చిరంజీవిగారి కాలులో అద్దం పెంకులు గుచ్చుకుని రక్తం కారింది. ఆ షూటింగ్‌లో సెట్టింగ్ అంతా అద్దాలతో వేసిందే. చిరంజీవిగారి కాలు అద్దానికి తగిలి అది పగిలి కాలులో పెద్ద గాయమే అయింది. అయితే అప్పటి కప్పుడే ఫస్ట్ ఎయిడ్ బాక్స్ తీసి టకటకా తనకుతానే డ్రస్సింగ్ చేసుకుని తిరిగి అరగంట సమయంలో

షూటింగ్‌కు రెడీ అయ్యారు చిరంజీవిగారు. అదే గాయం నా కాలికి తగిలితే షూటింగ్ రెండు రోజులు పోస్ట్‌పోన్ చేయించేదాన్ని. ఆయన ఓపిక, సహనం, క్రమశిక్షణ చూసి నేను ఆశ్చర్యపోయాను. అప్పుడే అనుకున్నాను, ఆయన దగ్గర నేను చాలా చూసి నేర్చుకోవాలని.

### సీతయ్య చిత్రంలో లేడీడాన్‌గా రీ ఎంట్రీ

పుష్కరకాలం గ్యాప్ తర్వాత తెలుగులో 'సీతయ్య' లో లేడీడాన్ పాత్ర ద్వారా సినిమాల్లోకి రీ ఎంట్రీ ఇచ్చాను. ఆ చిత్రంలో విజృంభించి చెప్పిన నా డైలాగ్స్‌కి ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారట. ఈ చిత్రం సూపర్‌డూపర్ హిట్ కావడంతో నాకు లేడీ డాన్ పాత్రల అవకాశాలు వస్తున్నాయి. ఈ సినిమాలో హరికృష్ణ, సిమ్రాన్, సౌందర్య, బ్రహ్మానందం, అలీ, ఎమ్మెస్ నారాయణ, పోసాని మురళీకృష్ణ తదితరులు నటించారు. ఇది 2003 ఆగస్టులో విడుదలైంది. సీతయ్య చిత్రానికి ముందు 'ధూల్' తమిళచిత్రం చూశాను. ఇందులో లేడీడాన్ పాత్ర నాకు వస్తే బాగుండునను కున్నాను. నా అదృష్టం కొద్దీ ఇదే చిత్రాన్ని తెలుగులో 'వీడే' అనే టైటిల్‌తో తీశారు. రవిరాజా పినిశెట్టిగారు అదే పాత్ర నన్ను చెయ్యమని ఫోన్ చేశారు. నేను ఆశ్చర్యపోయాను. ఆ పాత్ర పోషించాలని మనసులో అనుకోవడమేంటి? వెంటనే నాకు అదే పాత్రకు అవకాశం వెతుక్కుంటూ రావడమేంటి? మనం వెంపర్లాడకపోయినా అదృష్టం మనల్ని వెతుక్కుంటూ వస్తుందంటారు ఇదేనేమో! 'వీడే' చిత్రంలో రవితేజ, ఆర్తిఅగర్వాల్, రీమాసేన్, శాయాజీషిండే, అలీ తదితరులు నటించారు. ఈ చిత్ర దర్శకులు రవిరాజా పినిశెట్టి నా నటనను ప్రత్యేకంగా అభినందించారు. 2003 అక్టోబరులో వచ్చిన సూపర్‌హిట్ చిత్రమిది. ఇదే చిత్రాన్ని సింహళభాషలో 'రంజ', పంజాబీలో 'ద లయన్ ఆఫ్ పంజాబ్', బెంగాలీలో 'ఘతక్'గా రీమేక్ చేశారు. హిందీలో 'ఏక్ ఔర్ జాలిమ్'గా డబ్ చేశారు.

### శోభన్‌బాబు చెప్పిన దీపం సామెత

దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి. ఈ సామెత శోభన్‌బాబుగారు నాకు చెప్పారు. ఆయన చాలా మంచి మనిషి. సినిమాల్లో అవకాశాలు వచ్చినప్పుడే సద్వినియోగం చేసుకోవాలి, భూమి, బంగారం వంటివి కొని దాన్ని మూలధనంగా అభివృద్ధి చేసుకోవాలి అని చెప్పారు. గ్లామర్ ఉన్నప్పుడు నటులకు అవకాశాలు వస్తాయి. తర్వాత రావు. కాల్షీట్లు ఎప్పుడూ ఉంటాయని అనుకోకూడదు. నటులుమాత్రం ఎప్పటికప్పుడు డబ్బు జాగ్రత్త పడాలి అని ఆయన చెప్పిన మాటలు ఎప్పుడూ గుర్తుకు వస్తాయి. ఆ విషయంలో శోభన్‌బాబుగారిని ఎన్నటికీ మరువలేను. వీడే, సీతయ్య, కిక్, పున్నమినాగు, సమ్‌థింగ్ సమ్‌థింగ్ నాకు బాగా నచ్చిన చిత్రాలు.

### చిరంజీవి స్ఫూర్తితో షూటింగ్ పూర్తిచేశా

తమిళంలో 'వీట్టుకు ఒరు కన్నగి' చిత్రం షూటింగ్ ఏవీఎం స్టూడియోలో జరుగుతున్న సమయంలో ఆకస్మికంగా నా కాలు మడతపడి కిందపడిపోయాను. కాలు వాచిపోయింది. కాలు విరిగిందేమో అనుకున్నాను. అదృష్టవశాత్తూ అలాంటిదేం జరగలేదు. షూటింగ్ పోస్ట్‌పోన్ చెయ్యండి అని అడుగుదామనుకున్నాను కానీ చిరంజీవిగారి స్ఫూర్తి గుర్తుకువచ్చింది. ఎలాగైనా షూటింగ్ పూర్తిచెయ్యాలని నిర్ణయించుకుని అప్పటికప్పుడే డాక్టర్‌ను పిలిపించి రెండు గంటల వ్యవధిలోనే సెట్ చేయించుకుని షూటింగ్‌కి సిద్ధమయ్యాను. మర్నాడు చేద్దాం అని దర్శకుడు చెప్పినా నేనుమాత్రం మొండిగా రెడీ అయిపోయాను. నిర్మాతలు లక్షలుధారపోసి సెట్స్ వేసుకుంటారు. మనం సహకరించాలి.

### కలిసి మెలిసి

గత శతాబ్దాంతంలో నటీనటులం అందరం షూటింగ్‌లో ఎంతో కలిసిమెలిసి సరదాగా ఉండేవాళ్ళం. అసూయా ద్వేషాలుండేవికావు. ఏ నటి అయినా బిజీగా ఉంటే ఆ నటి తన కొచ్చిన ఆఫర్‌ని మరొక నటికి రికమెండ్ చేసేది. అదేవిధంగా నేను బిజీగా ఉన్నప్పుడు వచ్చిన ఆఫర్స్‌ను నాతోటి నటులకు ఎన్నోసార్లు ప్రత్యేకంగా దర్శకులతో మాట్లాడి రికమెండ్ చేసేదాన్ని. ఇప్పుడు కార్వాన్స్ వచ్చిన తర్వాత ఎవరు హీరో? ఎవరు హీరోయిన్ అనే విషయాలు కూడా తెలియని పరిస్థితి ఏర్పడింది. మా పాత్ర పోషించడం, పూర్తికాగానే వెళ్ళిపోవడం అంతే. ఒకళ్ళకొకళ్ళు కలుసుకునే అవకాశం లేదు.

### టీవీ సీరియల్స్

ప్రస్తుతం అనేకమైన టీవీ సీరియల్స్‌లో నటిస్తున్నాను. ఎందుకంటే ఇప్పుడు ప్రేక్షకులు టీవీ సీరియల్స్‌వైపు మొగ్గు చూపిస్తున్నారు. ఇప్పటివరకు ఎన్నో సీరియల్స్ చేశాను. ఒక నిర్మాతగా, దర్శకురాలుగా, పంపిణీదారుగా అన్ని రంగాల్లోనూ విధులు నిర్వహిస్తున్నాను. తెలుగులో వస్తున్న 'అమ్మనా కోడలా', మలయాళంలో వస్తున్న 'స్వాతి', తమిళంలో వస్తున్న చిన్నపాప పెరియపాప సీరియల్స్‌లో నటిస్తున్నాను.




### ఎంపికలో అమ్మ పాత్ర

పలు భాషల్లో నేను ఇప్పటివరకు 200 పైగా చిత్రాల్లో నటించాను. నాకు తగిన పాత్ర చిత్రంలో ఉందా? నాకు ఆ పాత్ర సరిపడుతుందా? కథ ఎలా ఉంది? అనే అంశాలన్నీ మా అమ్మ చూస్తూ ఉండేది. కొన్ని చిత్రాల్లో వ్యాంప్ పాత్రలు చేశాను. ఆచితూచి నా పాత్రల్ని ఎంపిక చేసుకుంటాను. కాల్షీట్లు విషయంలో నా కంటే మా అమ్మ ఎక్కువ జాగ్రత్తగానూ, చొరవతోనూ వ్యవహరించేది.

### తెలుగు బాగా వచ్చు

తెలుగుభాష బాగా నేర్చుకోవడం వల్ల షూటింగ్ సమయాల్లో నాకు ఎలాంటి ఇబ్బందీ వచ్చేదికాదు. టి.రాజేందర్‌గారు నాకు గురుతుల్యులు. ఎదుగుదలలో నాకు శోభన్‌బాబుగారి ఆశీస్సులు ఉన్నాయి. తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ భాషల్లో అన్ని రంగాల్లో రాణించానంటే అంతా వీరి చలవే.

### జానపద చిత్రాలు

ఆనాటి సినిమాలకు ఈనాటి సినిమాలకు ఎంతో తేడా ఉంది. ఆనాటి పాటలనే ఈనాటికీ చాలామంది ఇష్టపడుతున్నారు. ప్రస్తుతం సినిమారంగంలో మంచి మార్పు వచ్చింది. మంచి చిత్రాలు వస్తున్నాయి. కాకపోతే పిల్లలకు ఉపయోగపడేవిధంగా పౌరాణిక, జానపద చిత్రాలు నిర్మిస్తే బాగుంటుంది.

### కుటుంబం

నా భర్త పేరు రామరాజన్. ఇప్పుడు వేరుగా ఉంటున్నాం. మాకు ఇద్దరు పిల్లలు. అరుణ్, అరుణ. అబ్బాయి అరుణ్ డెలైట్‌లో పనిచేస్తున్నాడు. అమ్మాయి అరుణ ఎం.ఏ., బిఎల్, ఎంబిఏ చేసింది. అడ్వకేట్‌గా పనిచేస్తోంది. ఎక్కువగా తెలుగు రాష్ట్రాల్లోనే షూటింగ్స్‌లో ఉంటాను. హైదరాబాద్ బిర్యానీ అంటే నాకు చాలా ఇష్టం. కరాచీబేకరీ ఫుడ్ వాడుతూ ఉంటాను. ఇక ఆంధ్రాలో ఉంటే ఇడ్లీ, వడ, దోసె బాగా ఇష్టపడి తింటాను. ముఖ్యంగా మామిడికాయ పప్పు అంటే నాకు బాగా ఇష్టం.

**—కె.హరనాథ్, సెల్: 97035 42598**



